# నేటి భారతరాజ్యాంగము.

1935 సం॥రం ఇండియా రాజ్యాంగచట్టం,

వివరణం. విలోకం.



రెబ్బాప్రగడ మందేశ్వరశర్మ.
ప్రణీతము.

# విన్నపము.

స్వరాజ్యముయొక్క పరిమితిని తెలపడానికి కాదు యీ చట్టముపూనుకున్నది. పరరాజ్యాధికారముయొక్క అపరిమితత్వమే యీచట్టములోని ప్రతిపంక్తిలోను వాచ్యమో, ధ్వనితమో అయితీరుచున్నది. ఈప్రకారం "సత్యాన్ని వదించి" నాము. కాని ఇంతటితో ఆవాక్యం పూర్తి కాలేదు. దానివెనువెంటనే యున్న "ధర్మాంచరిస్తే"నే "సత్యంవద"కు సార్థక్యం. ఇదే శృతియొక్క వాస్తవిక (realistic) భాష్యం. ఆధర్మాచరణాన్ని నిర్ణయించుకోడానికే 1935 సం॥రం ఇండియా రాజ్యాంగచట్ట వివరణవిలోకాలతో కూడుకున్నదీనిని ఆంధ్రలోకానికి అర్పించినాము.

నిజమైన భారతరాజ్యాంగం యేలావుండాలి? ప్రపంచదేశ రాచకీయ ఆర్థికసమస్యల పరిష్కారం ఆ రాజ్యాంగములో యేవిధముగా చెయ్యాలి? అనే జిజ్ఞాస బయలుదేరడానికి తరుణంవచ్చింది. మొన్న ఢిల్లీలో సమావేశమైన "కన్వెన్షన్" చరిత్రాత్మకమైనది. అది రాబోయే ప్రజాప్రతినిధిసమావేశం (Constituent Assembly) యిత్యాదులకు తొలకరివంటిది. భారతరాజ్యాంగజిజ్ఞాస (1) పూర్ణస్వరాజ్యం, (2) స్వయంనిర్ణయం, (3) ఆర్థికసమత్వం, (4) విధానం సులభావగాహంగా వుండడం, (5) అతితక్కువఖర్చుతో నడవడం, (6) కేవలం

తోకలలెఖలాంటి వోట్లసంఖ్యనుబట్టే ప్రతినిధికాకుండా ప్రజా సేవ అనుష్టానబలంగలవాళ్లకు ప్రభుత్వంలో స్థానం ఉండుట, (7) ప్రపంచదేశాల్లోని నూతనరాజ్యాంగపరిశోధనలు, నవ్య నాగరికతను వివేకంతో భారతదృష్టిలో పరిశీలించి అనుసరించుట—యీముఖ్యసూత్రాలను గమనిస్తూ జరగాలి. నేడు దేశంలో భావవాహినులు బాగా ప్రవహిస్తున్నాయి. కాని చిందరవందరగా ఉన్నాయి. వీటిని పైరీతిని యేకోన్ముఖంచేసి భారతీయుల ప్రాచీననిర్మాణాత్మకప్రతిభను నిలవబెట్టుకోవాలి. మనలోశాస్త్రదృష్టి (Scientific thinking) వికసించాలి. ఈఅంశాలు దేశంలో యోచనగలవారందరున్ను సంస్థలున్ను బాగా గమనించాలి.

ఇక గ్రంథంవ్రాయడాన్నిగురించి. భారతజాతీయోద్యమములో బయలుదేరిన నవ్యపరిణామంలో నేడు ప్రజాసామాన్యమందు రాచకీయములపట్ల, ముఖ్యంగా స్వరాజ్యంపట్ల, అఖండఆదరాభిమానాలే కాక ఒకవిధమైన "తహతహ", కూడా బయలుదేరుచున్నట్లు గతయెన్నికలు రుజువుచేశాయి. అందుచేత భారతదేశరాజ్యాంగసమస్యనుగూర్చి "రాబొయ్యేరాజ్యాధికారులైన, యీదేశంలోని ప్రతిస్త్రీపురుషుడున్నూ" విశదముచేసికొని చక్కనివివేచనతో జాతీయకర్తవ్యానికి గట్టితోడ్పాటు చెయ్యాలి. అందుకే యీఉద్యమం. ఈఫలప్రాప్తిపైననే గ్రంథకర్తయొక్క ధన్యత ఆధారపడియున్నది.

గుణదోషాలను బట్టి గ్రంథాలను విమర్శచేయడం, సద్గ్రంథాలను ప్రోత్సహించడం ఆంధ్రదేశంలో తక్కువగా నున్నది. ఇక్కడ పత్రికలలోటు చాలాయున్నది. అందుచేత ఈనిరుత్సాహపరంపరలను యెదుర్కోవడం కూడా గ్రంథకర్త లకు పెద్దసమస్యగా ఉన్నది. జనవరిలో రావలసిన యీగ్రంథ ము యిప్పటికైనా నిలదొక్కుకొని సమాప్తిచేయగలిగితిమి.

సాధ్యమైనంతవరకు జనబాహుళ్యానికి విశదం కావ డానికి వాడుకభాషలో యీగ్రంథంవ్రాసితిమి. కాని శాస్త్ర అనుభవం, దృష్టిపథంలో నిడుకొనియే యీఉద్యమం నడిపి నామని సవినయంగా ఆంధ్రలోకానికి, విబుధులకు మనవి.

ముఖ్యస్థలాల్లో సెక్షనులసంఖ్య నిచ్చినాము. "తా త్కాలిక అంశాలు," "శబ్దనిర్వచనాలు," "ఆస్తిసంపాదన," "ఒడంబడికలు" అనే అసలుచట్టములోనిభాగాలున్ను, అనుబం ధాల్లో యెన్నికలకుసంబంధించినవిన్ని—ఇల్లాంటివికొన్ని యీ గ్రంథంలో వదలినా వాటిల్లోని ముఖ్యాంశాలు ఆయాప్రకర ణాల్లో తెలిపాము.

ఈగ్రంథము వ్రాయుటలో పారిభాషికపదాలు కొన్ని వాడుకలోనివి వాడినాము. కొన్నికల్పించినాము. పైరెండుసాధ నలవల్లనుకూడా ఆంగ్లంలోని సాంకేతికార్థస్ఫురణము కలుగదని తోచిన స్థలాల్లో ఆంగ్లశబ్దాలనే వాడినాము. నవ్యశాస్త్రాంగ

భావపరంపర, సాంప్రదాయములు ఆంధ్రభాషలోనికి వ్యాపించినకొలది తగినశబ్దాలు కనపడకపోవు.

ఈగ్రంథం వ్రాయుటలో పరిశీలించబడిన రాజ్యాంగ, శాస్త్రాదులనుగూర్చిన గ్రంథములుగాక, 1928 సం॥నుంచి మేము వ్రాయుచున్న 'నోట్సు', వ్యాసాలు, చేసుకొంటూన్న పరిశీలన, స్వంతనిర్ణయాలుగాక, 'కెయితు' పండితుని 'భారత రాజ్యాంగపరిశీలనము' (A constitutional survey of India) అనే గ్రంథము వెంకట్రామశాస్త్రిగారి 1935 సం॥ మితవాది సభాధ్యక్షోపన్యాసము; పిమ్మట ఇంకుపై 'లాహిరి' గారివివరణం, మెడ్డీ, 'లాటను' గార్ల గ్రంథం కూడా ఉపచరించాయి. ముఖ్యమైనకొన్నిలు ఆధారల్లోని అంశాలు అక్కడక్కడ చేర్చినాము.

ఈగ్రంథమువ్రాసిపెట్టుటలో కడుసమర్థతతోను, ఓరిమితోను లేఖనాసహాయంచేసిన మిత్రులు శ్రీ కేశిరాజు వెంకట నృసింహఅప్పారావుగారిని, అభినందించవలసియున్నది. గ్రంథ ముద్రణము అతిత్వరితంగా జరిగించి మాఉత్సాహాన్ని నిలువబెట్టిన కాకినాడ ముద్రాక్షరశాలవారికి మాకృతజ్ఞతను తెలుపుచున్నాము.

| | |
|---|---|
| కొవ్వూరు-గౌతమీతీరం<br>ధాతృసం॥ఫాల్గుణబహుళదశమి<br>6—4—37 | ఇట్లు<br>విన్నవించు<br>గ్రంథరచయిత. |

# విషయసూచిక.

## అనుబంధములు.

# నేటి భారతరాజ్యాంగము.

## విషయప్రవేశము—౧.



### ప్రాచీనకాలంనాటి మనప్రభుత్వం.

భారతరాజ్యాంగచరిత్ర వ్రాయాలంటే వేదాలదగ్గరకు పోవాలి. ఒకవిధంగా భారతరాజ్యాంగచరిత్ర వేదాలంత ప్రాచీనమైనదన్నమాట. కోట్లు, లక్షలు సంవత్సరాలమాట అలావుంచి యీవేదాలనుగూర్చి వేయబడిన బహుకనీసపుమదింపునే స్వీకరిద్దాము. ఈవేదాలు 'క్రీ. పూ. 10000 సంవత్సరాలకు పైకాలమునాటివి గాని లోపలివి కావు' అని అన్నిరకాల పరిశోధకులు అంగీకరించారు. అప్పటికి మనలను పార్లమెంటరీ సాంప్రదాయంలోను, ప్రజాస్వామ్యంలోను తర్ఫీదు చేయడానికి అవతరించామనుకుంటున్న బ్రిటిషురాజకీయజ్ఞుల పూర్వులు యింకా బట్టకట్టుకోవడం నెఱుగరు. ఇల్లు కట్టుకోవడం చేతకాదు. గుహలలో నివసిస్తూ ఆకులతో ఆచ్ఛాదనం చేసుకుని ఉండేవారట! ఇల్లాంటికాలంనాటి భారతరాజకీయజీవితమును ప్రతిబింబింపజేసేవి యీవేదాలు.

"విశ స్త్వా సర్వా వాంఛంతు......వర్ష్మన్ రాష్ట్రస్య కకుది శ్రయస్వ, తతో న ఉగ్రో విభజా వసూని" (ఋగ్వేదము

10-173-1). "సర్వప్రజలు నిన్ను రాజుగా వాంఛించెదరు గాక, ఇట్టి ఉన్నతస్థానము ఆశ్రయింపుము. అక్కడనుంచి ప్రకృతి యొక్క ఐశ్వర్యమును మాకు ఉగ్రముగా పంచుము." దేవత లున్ను, అసురులున్ను యీలోకమునందు యుద్ధము చేసిరి. దేవతలను అసురులు జయించిరి. అప్పుడు దేవత లిట్లనిరి. 'రాజు లేకపోవుటవలన వారు మనలను జయించుచున్నారు. మనము రాజును వరించుదము.' అందుల కందరును "ఆలాగే" నని అంగీకరించిరి."[1] "తే ఆయం విశానరాజానం వృణేవ"; "ప్రజలు రాజునేర్పరుచుకొన్నట్లు". ఇలాంటిబుక్కులు, వాక్యాలు అనేకచోట్ల యీవేదాల్లో కనిపిస్తున్నాయి. వీటివల్ల రాజనేవాణ్ణి ప్రజలంతా కలిసి వరించడమనేది (Election) ఆకాలంలో అమలులో నుండెనని స్థిరపడుతుంది. ఇంతేకాక యీవేదాల్లో ఉపయోగించబడిన 'సమితి', 'పరిషత్తు' అనే శబ్దాలు అప్పటి సభాయుతపరిపాలనను గూర్చి స్ఫురింపజేయు చున్నవి. 'సభేయుడు', 'గ్రామణి' అనేశబ్దాలవలన సభలలోని వారికి యిప్పటి'కౌన్సిలరు'లలాంటి హోదా లున్నట్లు, గ్రామాలకున్ను, రాజసభలకున్ను సంబంధ మున్నట్లు కూడా బోధ పడుతుంది.

---

1. "దేవాసురావా యేషు లోకేషు సమయతంత; తాం స్తతో అసురా అజయన్......దేవా అబ్రువన్...అరాజతయా వై నో జయన్తి; రాజానం వరవామహే- తథేతి". (ఐతరేయబ్రాహ్మణము 1-1-14)

పిమ్మట ధర్మసూత్రకాలంలోకూడా రాజధర్మము అనేది ప్రజారక్షణము చేయుట కేర్పడినసంస్థగా అంగీకరించబడినది. 'తద్రక్షణధర్మిత్వాత్' అనే గౌతమసూత్రంవలన ప్రజారక్షణ చేసినంతవరకె రాజునకు ప్రజలు పన్నిచ్చుటకు బాధ్యులుగా నుందురు అని తెలుచున్నది. "రాజు జీతగాడు; నాయకుడు ప్రజలతనికి అసమ్మతి తెలిపినచో ఉద్యోగము వదలుకొనవలెను". అన్నది శుక్రనీతి. చరిత్రకుకూడ అందని అతిప్రాచీనకాలము లోనే యీదేశములో రాజసంస్థ ప్రజాసమ్మతిపై యేర్పడిన దనిన్నీ, ప్రజామోదముతో, ప్రజాక్షేమముకొరకు యిది నిర్వహింపబడవలెననే సాంప్రదాయాలు యిక్కడ లేకపోలే దని తెలపడమే మాతలంపు. పిమ్మట యిందునుగూర్చి తదితర వాఙ్మయాలసహాయంతోకూడా యోచిద్దాము.

ప్రజాసమ్మతిపై రాజు గద్దెనెక్కుట- సభాయుతుడై పాలనచేయుట-పరిపాలన యిష్టమువచ్చినట్లుగాక కొన్నినియమాలు, నిబంధనలతో నడచుట-అనేలక్షణాలు మనకు ప్రాచీన కాలంలో ఉన్నట్లు యితిహాసాలు, పురాణాలుకూడా చాటుచున్నాయి. శ్రీరామ, అంశుమంత, పురువుల పట్టాభిషేకాలకు దేశములోని అనుభవవిజ్ఞానసంపన్నులు, బస్తీపెద్దలు, గ్రామపెద్దలు, పాల్గొనిరి. (బ్రాహ్మణాశ్చ వృద్ధాశ్చ పౌర జానపదైస్సహ). దేవాపిని జ్యేష్ఠుడైనను వ్యాధిగ్రస్తుడౌట వల్ల నిరాకరించిరి. యోగ్యతగల్గి ప్రజారంజకంగా పాలించుచు

న్నంతకాలమే దేవునిఅంశ రాజులో నుండును. గుణభ్రష్టుడైన రాజును ప్రజలు, పెద్దలు తొలగించుచుండిరి. రాజైనమాత్రాన దైవాంశసంభూతు డనే పాశ్చాత్యసిద్ధాంతమును వేద, పురాణ, యితిహాసాలు, భారతసాంప్రదాయాలు ఒప్పవు.

అసలు ఆదిరాజైన మనువునే ప్రజాసంఘంవారు దేవుణ్ణి కోరి చేయించుకొని, అతనిని సమ్మతింపజేసి తెచ్చుకొన్నారని శాంతిపర్వం ఘోషిస్తుంది. ఇదంతా వేదాలు మొదలు క్రీ. పూ. 7 వ శతాబ్దమువరకు గాథ.

ఇక అర్థశాస్త్రం, కామందకం, శుక్రనీతి మొదలైన గ్రంథాలు ఆకాలపు మనవారి రాజనీతివిశారదత్వం, నిర్మాణ కౌశలాన్ని తెలుపుతున్నాయి. ఇక యింకా ప్రత్యక్షంలోనికి వద్దాం. అనగా చరిత్ర, శాసనములనుబట్టి చూద్దాం. 'మగస్తనీస్' మనదేశమునకు రావడానికి పూర్వమే అనగా క్రీ. పూ. 500 ప్రాంతంనుంచి గణప్రజాస్వామ్యాలు కొన్నిప్రాంతములలో వర్ధిల్లుతూ ఉండేవి. గణప్రజాస్వామ్యమనగా ఒకగణములోని పెద్దలంతా శాసనసభగా ఏర్పడి పాలనచేసుకోవడము లేక అందులోనుంచి కొన్నివందలమందిని " గణరాజులు " అని ప్రతినిధులనుగా ఏర్పాటు చేసికొని వారిద్వారా పాలన జరుపుకోవడము. ఒకప్పుడు కొన్నిగణములవారు (లేక రాష్ట్రములు) యిప్పటిసమాఖ్యవిధానములాంటి కలయికను ఏర్పాటు చేసుకొనుచుండిరి. ఇంకా చరిత్రకు దగ్గరగా వద్దాం. బౌద్ధయుగంలో

ఓట్లు, బౌలటుపద్ధతికూడా బౌద్ధభిక్షువులసంఘాలలో ఉండేవి. రాజు అనగా "మహాజనసమ్మతుడు" అని స్పష్టపరిచింది బౌద్ధం. రుద్రదామనుడు, అశోకుడు, పరిషత్సభల తీర్మానాలకు వ్యతిరేకించలేకపోయినారు. అంతకుపూర్వం చంద్రగుప్తుని పరిపాలనలో నేమి, యీరాజులపరిపాలనలో నేమి, శాఖలక్రింద పరిపాలనను విభజించడం, పన్నులవిషయములో న్యాయసమ్మతమైనసూత్రాల నేర్పరుచుట, శాఖాపరిపాలనకు కేంద్రం మొదలు గ్రామసంఘంవరకు అధికారవర్గం (యిప్పటి సివిలు సర్వీసువంటిది) కూడా ఉండేవి. ప్రత్యేకవిషయములు వచ్చినప్పుడు ఉపసంఘాలు యేర్పడుతూ ఉండేవి. 'వాజీయుల' (క్రీ. పూ. 600-400) గణరాష్ట్రాలలోని ఉపసంఘాలలో స్త్రీలు కూడ సభ్యులుగ నుండేవారని నిదర్శనం గలదు.

హిందూపాలనంపిమ్మటవచ్చిన మహమ్మదీయులు, విజేతలహోదాలో గద్దెక్కిరి. అందుచేత ప్రజాసమ్మతితో పట్టాభిషేకం అనేది పోయి ఆసాంప్రదాయం అడుగుకు పోయింది. కాని మొగలాయిచక్రవర్తులకాలంలో నిబంధనాయుతపరిపాలనం, మంత్రివర్గసమాలోచనం కనపడుతున్నాయి. అక్బరు మంత్రివర్గానికి "నవరత్నములు" అనిపేరు. ఇప్పటిభూమిపన్నువిధానం, చైన్ సర్వే మొదలైనవి అక్బరుపాలనలో తోడరమల్లుమంత్రి మొలకెత్తించినవే. శివాజీకికూడ 'అష్టప్రధాన' అనే మంత్రివర్గం ఉండేది. శాఖలుగా పరిపాలన విడదీసి నడిపించడం

అనేది బాగా వికసించింది. దక్షిణదేశంలో చాళుక్య (12 వ శతాబ్దం) విజయనగర (14 వ శతాబ్దం) సామ్రాజ్యాలలో శాఖావిభజనము, మంత్రివర్గసమాలోచనము మంచిపద్ధతిమీద నడిచినవి.

కాని, యీరోజులలోలాగ చీటికిమాటికి 'లా,' నిబంధన, 'రూలు' అనేవి అప్పుడు లేవు. ఢిల్లీనుండి పల్లెవరకు అధికారులు తమఆవరణలోని సంఘ కుల, వృత్తిపెద్దల అభిప్రాయాచారాల గౌరవిస్తూ తన'రూలును' అమలు పర్చుకు పోవడం ప్రాచీనపద్ధతియొక్క ప్రత్యేకత.

స్థానికప్రభుత్వము:—పైప్రభుత్వాలు ఎన్నిమారినా హిందూపాలననాటినుంచి వచ్చినగ్రామస్థానికజీవనం, పాలనాపద్ధతి మారలేదు. మహమ్మదీయులుకూడా దానిని అనుసరించిరి. అందుచేతనే గ్రామస్వరాజ్యమనేది 'ఉస్టిండియాకంపెనీ' పేరుతో బ్రిటిషువారు వచ్చేవరకు విచ్ఛిన్నం కాలేదు. దేవాలయం- కులసంఘాలు- వృత్తిసంఘాలు- పంచాయితీ, యివి గ్రామపాలనలో ముఖ్యాంగాలు. ఆకాలపుదేవాలయాలు అనేకచోట్ల వేదశాస్త్రపరిశోధనావిజ్ఞానాన్ని వెదజల్లేవి. అప్పటిసమ్మికప్రకారం ధర్మసంశయం తీర్చేసభలచ్చట జరిగేవి. వ్యక్తియొక్క కార్యదీక్షను, వీరప్రతాపాలను ఉద్దీపనచేసే పురాణకాలక్షేపములు అక్కడే. ప్రజలదానాలకు అది నిలయం. అన్నదానాలు జరిగేదికూడా అక్కడే. కొన్నిచోట్ల యీదేవాలయ

ములు ఆయావృత్తులవారికి, రైతులకు పెట్టుబడియిచ్చే 'బ్యాంకు' లలాగ పని చేసేవి.

ఇక ప్రభుత్వంవారిపన్ను వసూలుచేసేఅధికారులు గ్రామంలోనికి వచ్చి పంచాయితీదార్లు, మిరాశీదార్లు అనే గ్రామపెద్దలను పిలిచేవారు. ఆసాలున ఎంతపంట పండిందో, అందులో రాజభాగం ఎంపుచ్చుకోవచ్చునో సంప్రదించేవారు. ఈ మిరాశీదార్లు తమసోదరరైతులతో యోచించి తమనిర్ణయం చెప్పవలసినధర్మం ఉండేది. ఆప్రకారం రాజభాగం వెళ్లేది. ఆ ప్రకారం పన్నులనిర్ణయాధికారం వ్యవసాయకులచేతులలో నున్నకాలం, స్థలాలుకూడా ప్రాచీనభారతసభ్యతలో ఉన్నాయి. ఈగ్రామపంచాయితీలపైన మండలపంచాయితీలు, నాడు (రాష్ట్ర) పంచాయితీలు అనేవి ఉన్నట్టున్నూ, ఈగ్రామపంచాయితీలలో 'వార్డు'లక్రింద విభాగం, పంచాయితీసభ్యులకు అర్హతలు మున్నగునవికూడా ఉన్నట్టున్ను చాళుక్యరాజ్యశాసనాలనుబట్టి కనుపిస్తూంది.

గౌతమధర్మసూత్రాలు మొదలైనవి, సప్తసంతానాలు ఆకాలపు Planned Economies వంటివి. తటాకాలు, సత్రాలు, విద్యాలయాలు, న్యాయనిర్ణయసంస్థలనిర్మాణం; భూమిని వ్యవసాయిక, గో, ఆరామ, సాముదాయికములక్రిందవిభజించుట మొదటిరకముది; కుటుంబవారీగా పంపకముచేయుట, వృత్తులను శ్రేణులుగా విభజించుట, ఒకవిధమైన సహకారపద్ధ

తిని వృత్తులు సాగుట, మొదలైనవి ప్రాచీనసభ్యతలో ప్రశంస నీయముగా జరిగినవి. ఇంకాలోనిసూత్రాలే యింకోరూపంతో వర్తమానప్రపంచదేశాల్లో నేడుసంఘపునర్నిర్మాణానికిదారిమా పుతున్నాయి. అప్పటికంటె యిప్పుడు భౌతికశాస్త్రవిజ్ఞానం బాగా వికసించింది. ఆలవకాశాలు, పరిస్థితులు ఈ అవకాశాలు పరిస్థితులు వేరు. గ్రామజీవనం అర్థికరాచకీయంగా స్వేచ్ఛాసమ్మతులతో ఆరోజుల్లో జరిగినట్లు పండితులమతం.

ఈస్టిండియాకంపెనీ పేరుతో బ్రిటిషువారు యీదేశం వచ్చి రాజ్యాధికారులుకూడా అయ్యారు. వీరివిధానంలో యీ గ్రామస్వరాజ్యానికి దెబ్బ తగిలింది. ఆంగ్లవిద్యతో దేవాలయ భక్తి నశించింది. రైత్వారీపద్ధతి వచ్చినది. గ్రామరైతు తన స్వసంఘాశ్రయం వదలి రెవిన్యూఇన్స్పెక్టరుగారివశ మయ్యాడు. పన్నులనిర్ణయాధికారం గ్రామపెద్దలచేతులలోనుంచి రెవిన్యూ బోర్డుకు పోయింది. గ్రామాభివృద్ధి అవసరాలనుబట్టి సమిష్టి దృష్ట్యా భూవిభాగం పోయి ప్రతిసెంటునేల గవర్నమెంటు క్రియం చేయడం, ధనవంతులు కొనుక్కోవడం కలిగింది. గోభూములు, ఆరామాలు అసలే నశించాయి; సరిగదా సాముదాయకభూములు స్మశానాలుసహా రైత్వారీ జమీందారీ గ్రామాలలో పట్టాలమీద యివ్వడం, అక్రమించడం కూడా కలదు. విదేశవస్త్ర, వస్తువుల ప్రచారంచేసే ఆప్రభుత్వవిధానంలో గ్రామపరిశ్రమలు నశించడం ఆశ్చర్యం కాదు. నీటిలో

వేస్తే కంటికి కనుపడని 'మజిలిన్' స్థానే 'గ్లాస్గో, లంకాషైరు' బట్టలు, బర్మింగుహామ్, షెఫీల్డుకత్తులు, కాటాలు, కొడవళ్ళు, పింగాణీలు మొదలైనవి వచ్చి గ్రామ రాటం, మగ్గం, కుమ్మర, కమ్మర, వడ్రం, మచ్చీ మొదలైనవృత్తులను నశింపజేశాయి. సమిష్టిదృష్టి ప్రధానమైనహిందూ న్యాయశాస్త్రంలో ఆంగ్లవ్యష్టిత్వం ప్రవేశించింది. వెంటనే పూర్వం భారతగ్రామజీవితముకు పునాది యైన సహకారసమిష్టి పోయింది. నీచస్వార్థం ప్రవేశించింది.

ఇల్లాఅని ప్రాచీనమంతా తిరిగి తూ, చా తప్పకుండా తెచ్చిపెట్టుమని కాదు. ఆపరిస్థితులకు ఆపద్ధతి బాగానే నడిచింది. కాని, ఆంగ్లసభ్యత తనరాచకీయాధికారస్థాపనకుగాను భారతగ్రామసామరస్యాన్ని సమయించింది. కాని, నవీనపరిస్థితులనుబట్టి గ్రామోద్ధరణం చేయుటకై పూనుకోవాలనేసంగతి 1935 సం॥రం బొంబాయికాంగ్రెసులో గాంధిగారు గ్రామపరిశ్రమలసంఘం నెలకొల్పేదాకా ప్రభుత్వంకు తోచలేదు.

ఆకాలంలో ఆముష్మికమంటే ప్రజలకు ఎక్కువనమ్మకం. దానికి దేవాలయం చిహ్నం. ఆనమ్మకబలంతో గ్రామజీవితం సర్వతోముఖమైనవికాసం పొందేది. అంగ్లసభ్యతలో అది పోయింది. దానిస్థానే క్రొత్తఆదర్శం యేర్పడలేదు. అందుకనియే గ్రామజీవితంలో నేడు గొప్పఅరాజకత యేర్పడినది. ప్రతి మనిషీ ప్రతిఅడుగూ తర్కబలంమీాదను, శాస్త్రజ్ఞానంతో వేయలేడు. కార్యప్రవృత్తికికూడా ఆదర్శబలం ఉండాలి. యు

గాన్నిబట్టి ఆదర్శ మేర్పడినతర్వాత జనసామాన్యం అనుసరించేందుకుగాను దానిచుట్టూ కొన్నినమ్మకాలు ఏయుగంలోనైనా తప్పవు. ఒకరోజున ఆముష్మికప్రాప్తి, వేదధర్మవిశ్వాసం అనేయిరుసుమీద గ్రామసంఘభౌతికజీవనం తిరిగేది. ఈరోజులలో ఆముష్మికం ఫలంగా ఉన్నా, దాని నాధారపచ్చుకుని సంఘం, నిర్మాణకార్యప్రవృత్తికి దారి తీయజాలదు. వాస్తవిక ఆదర్శాలు కావలసినరోజు లివి. రాచకీయమో, ఆర్థికమో దానిస్థానే ఆదర్శంగా యేర్పడాలి. పూర్వధర్మశాస్త్రవిహితమైన సమిష్ఠిస్థానే నవ్యభౌతికశాస్త్రసిద్ధమైన సహకారసముష్టివిధానము రావాలి. ధర్మసంతర్పణలు, దేవాలయదానాలుస్థానే వృత్తికల్పనలు, విజ్ఞానం అందరికీ లభ్యమువడం జరగాలి. లేక యింకేదైన ఆదర్శం, విధానం రావాలి. ఇది వచ్చేదాకా గ్రామీయులలోనుండే కార్యశక్తి వికసించదు. అప్పుడుగాని భారతసమస్య నిజంగా పరిష్కారం కాదు.

---

# విషయప్రవేశము-౨.



## కాంగ్రెసుపుట్టుక మొదలు రాజ్యాంగసంస్కారం నిర్మాణాన్ని గురించి సూచనలు, పతకాలు.

కాంగ్రెసు పుట్టడానికిపూర్వమే రామమోహనరాయలు, దాదాభాయినౌరోజీ, యీదేశంలోని సివిలుసర్వీసులో ఆరితేరిన తెల్లవారిలో కొందరు, భారతపరిపాలనలోని అక్రమాలను పార్లమెంటువారికి తెలియజేస్తూ యుండిరి. సివిలుసర్వీసులోనుండిన సురేంద్రనాథబెనర్జీగారిని తగుకారణం లేకుండా ప్రభుత్వం తగ్గించారు. ఆపిమ్మటనే బంగాళంలో భారతీయసంఘం అని బయలుదేరి ప్రభుత్వంలో మార్పులనుగూర్చి ఆందోళనం చేస్తూండేది. ఇల్లాగే అక్కడక్కడ దేశంలో జరుగుతుండేవి.

1885 సం॥రంలో కాంగ్రెసుమహాసభ దేశములోని అక్కడక్కడ ఉన్న దేశాభిమానులను, సక్రమరాచకీయ ఉద్యమాలను ఒకచోట జేర్చుకోవడముకు, ప్రభుత్వంలో జరుగవలసినమార్పులనుగూర్చి జరుగుతున్న అక్రమాలనుగూర్చి తెలుపుకోవడముకు బయలుదేరినను స్వరాజ్యము భారతదేశము యొక్క లక్ష్యమని నాయకులమనస్సులలో లేకపోలేదు. 1890 సం॥రంలో కాంగ్రెసు ప్రోత్సాహమువలననే 'చార్లెసు బ్రాడ్లాగారు పార్లమెంటులో 'ఇండియాహోమురూలు'

బిల్లును పెట్టి అపజయమును సాహసముతో నెదుర్కొనిరి. 1892 సం॥రపు రాజ్యాంగసంస్కరణాలు కాంగ్రెసు ఆందోళనాఫలితమే నంటారు.

చిల్లరసంస్కరణాలు కాదు కాంగ్రెసు యొక్క ప్రధాన లక్ష్యం. "స్వరాజ్యము నాజన్మహక్కు" అని ప్రకటించి తిలకమహాశయుడు తొలుదొల్త భారతమాతముఖబింబంమీద తిలకంలా శోభించాడు. మనఆశయములు క్లిష్టమైనభాషలో నుంచి, మెల్లమెల్లగా జారవిడవడం కాంగ్రెసువంటిసంస్థకు గౌరవప్రదం కాదు. ప్రజాసామాన్యాన్ని ఉద్దీపింపజేయాలంటే యీఆదర్శం జ్యోతిలా వారియెదుట నిరంతరం వెలగా లన్నాడు. 1906 సం॥ కాంగ్రెసుఅధ్యక్షపీఠంనుండి దాదాభాయిమహాశయుడు "స్వరాజ్య" శబ్దాన్ని గర్జించి భారతదేశానికి లోకంలో నూతనవ్యక్తిత్వాన్ని కలిగించాడు. కాని, అప్పటికాంగ్రెసు సూత్రం (1912) కాలనీలలోనున్న స్వపరిపాలనపద్ధతివంటిపద్ధతి (Colonial Self-government) అనిమాత్రమే ఉండెను. ఇది అధినివేశప్రతిపత్తి (Dominion Status) కూడా కాదని జ్ఞాపక ముంచుకోవాలి. 1890 సం॥ లో "భారతసామ్రాజ్యంలోని ప్రజలయొక్క క్షేమం, సక్రమపద్ధతులవల్ల కాపాడుటయే కాంగ్రెసుయొక్క ఉద్దేశ్య" మని కాంగ్రెసుసూత్రము మహాసభలో అంగీకరింపబడినది. 1912 సం॥ వరకును 'స్వపరిపాలన' అనుశబ్దమే కాంగ్రెసు సూత్రంగా ఏర్పడలేదు. పైగా

నాయకులు క్రమసంస్కారప్రియులు. ఆదర్శముకంటె ప్రస్తుత విధానంలో మార్పులు చేయుట, విప్లవముకంటె మోతాదు ప్రాయపుమార్పులు వీరు కోరేరోజు లవి. 1914 సం॥ లో ప్రారంభించిన ఐరోపామహాసంగ్రామంలో భారతీయులు చేసిన 150 కోట్లధన, 12 లక్షలసేనాసహాయం బ్రిటిషువారు మరచి పోరని నాయకులు తలచిరి. దీనికితోడు అప్పటిరాజప్రతినిధి గారు భారతీయుల సహాయమును, భారతదేశముయొక్క అర్హ స్థానమునుగూర్చి యుద్ధానంతరము మరచిపో మన్నారు. ఈప్ర కటనము అప్పటి భారతనాయకులలో కొంతనిర్మాణభావాన్ని ఉద్దీపన చేసింది.

ఇందులో మొదటిపతకము 'గోక్లే' మహాశయునిది. దీని ప్రకారం గ్రామపంచాయితీ, తాలూకా, జిల్లాసంఘము లుం డాలి. గ్రామపంచాయితీ కొంత నామినేషను, కొంతయెన్నిక వల్ల యేర్పడితే సమర్థతకలవారికికూడా స్థాన ముంటుంది. తాలూకాఅధికారులు, జిల్లాకలక్టర్లు అధ్యక్షులుగా యుంటూ ప్రజాప్రతినిధిసంఘాలసహాయంతో వీరు పాలించాలి. జిల్లామొ త్తంమీాద యిప్పటివలె జిల్లాబోర్డు మొదలైన అధికారేతరపరి పాలన అనేది ఒకటి, కలెక్టరుమొదలైన అధికారపరిపాలన ఒకటి అనేది పోవాలి. ఒక్కటే కేంద్రపరిపాలనాసంస్థ జిల్లావ హైరాల కుండాలి. రాష్ట్రశాసనసభలు జిల్లాబోర్డు, మ్యూనిసి పాలిటీలవల్ల యెన్నుకోబడాలి. రాష్ట్రకార్యవర్గముకు ఆరుగు

రుండాలి. ఇందులో ముగ్గురు నల్లవాళ్లు, ముగ్గురు తెల్లవాళ్లు. సీమనుంచివచ్చిన గవర్నరుగారే యీవర్గాని కధిపతి. 'బడ్జెటు' మినహా సర్వశాసనాలు శాసనసభవారి ఆమోదంతో జరగాలి; కాని క్యాబినెట్టుపద్ధతిలోవలె గవర్నరు మంత్రివర్గమును శాసనసభనురద్దుపరచకూడదు. రాష్ట్రముయొక్క స్థానికవ్యవహారములన్నీ వీరే చక్కబెట్టుకోవాలి. కేంద్రప్రభుత్వం తనిఖీ మాత్రము చేస్తూ ఉండాలి. ఇక కేంద్రప్రభుత్వంలో ఆరు శాఖ లుండాలి. దేశంలో వ్యవహారాలు, ఆర్థికం, లా, సేన, మార్గాలు, విదేశవ్యవహారాలు. కేంద్రమంత్రివర్గంలో ఇద్దరైన నల్లవా రుండాలి. రాష్ట్రసభలో స్వతంత్రపాలన చేసుకోవడం బాగా అలవాటయ్యేదాకా యీకేంద్రశాసనసభలో అధికారుల మెజారిటీయే ఉండాలి. సేనలోను, నౌకలోను, భారతీయులకు బాగాస్థానాలు, తరఫీదు ఉండాలి. ఐరోపాయుద్ధంలో జర్మన్ తూర్పు ఆఫ్రికా, బ్రిటిషువారి వశమైతే అది భారతీయులవలసరాష్ట్రంగా ఉండాలి. ఈసూచనలు 1914 ప్రాంతమున చేయబడినవి.

రెండవపతకము 1916 సం॥లో భారతకాంగ్రెసుసభవారు మస్లిములీగువారు సమిష్టిగా తయారుచేసినది. దీనిప్రకారము రాష్ట్రశాసనసభలలో 4 వంతులు ఎన్నికసభ్యులు, ఒకవంతు నామినేషనుసభ్యులును ఉండాలి. మహామ్మదీయులకు ప్రత్యేక నియోజకవర్గాలు అంగీకరించబడ్డాయి. శాసనసభాధ్యక్షుడు

ఎన్నుకోబడాలి. ఉపప్రశ్న అడిగేఅధికారం ప్రశ్నఅడిగిన సభ్యునికే గాక అందరికీ ఉండాలి. శాసనసభలో అంగీకరించబడిన తీర్మానం గవర్నరుగారు 'వీటో' చేస్తే తప్ప కార్యవర్గాన్ని 'బైండు' చెయ్యాలి. ఆతీర్మానమే ఒక్క సంవత్సరం అయిన తర్వాత తిరిగి అంగీకరించబడితే అసలు జరుగవలసినదే. శాసనసభలో అంగీకరించబడినబిల్లులు గవర్నరుజనరలును తప్ప తిరస్కరించేఅధికారం ఉండకూడదు. ఆదాయశాఖల్లో రాష్ట్రానికి కేంద్రానికి పంపకం ఉండకూడదు. కేంద్రప్రభుత్వానికి ఆదాయం రాష్ట్రాలనుండి కట్నములక్రింద నిర్ణయించాలి. రాష్ట్రప్రభుత్వం గవర్నరుచేతులో ఉండాలి. ఈగవర్నరు సివిలుసర్వీసులోనుండి యేర్పడకూడదు. కార్యవర్గంలో ఉండేసభ్యులలో సగం శాసనసభ ఎన్నికసభ్యులలోనుంచి ఎన్నుకోబడాలి. కాలనిర్ణయం 5 సం॥లు. సామ్రాజ్యశాసనసభలోకూడా యిల్లాగే వుండాలి. విదేశ, సేనావ్యవహారాల్లో శాసనసభవారి కేమీ ప్రమేయ ముండనక్కరలేదు. ఇండియామంత్రిగారు సాధ్యమైనంతవరకు భారతప్రభుత్వానికి స్వతంత్ర మివ్వాలి. ఇండియామంత్రికార్యాలయం రద్దుచెయ్యాలి. ఆయనజీతం బ్రిటిషుప్రభుత్వం భరించాలి. అధినివేశాలమంత్రిస్థితికి ఆయన రావాలి. కార్యవర్గాన్నుంచి న్యాయశాఖను విడదియ్యాలి. సేనలో భారతీయులకు తరిఫీదుండాలి. పెద్దఉద్యోగాలు వారికి తెరవబడి ఉండాలి. సామ్రాజ్యమంతటా భారతీయులకు పౌరహక్కులుండాలి.

ఇంతలో యుద్ధం ముగియవచ్చింది. యుద్ధపుఅవకాశం పుచ్చుకొని అధినివేశాలు, తాముచుభవిస్తున్న దేశములోపలి స్వరాజ్యాన్ని సంపూర్ణస్వతంత్రంగా విస్తరింపజేసుకొనడానికి కృషిచేస్తూన్నరోజు లవి. ఆపదస్థితులలో ఆపత్సమయంలో మహత్తరసహాయం చేసినభారతదేశానికి—కాంగ్రెసు ముఖేన స్వరాజ్యఘోష చేస్తూన్న భారతదేశానికి—ఏదోమాటచెప్పాలి గదా! "బాధ్యతాయుతపరిపాలన క్రమసోపానములపై ఇచ్చుటయే" భారతదేశములోని బ్రిటిషువారి విధాన మని, ది 20-8-1917 తేదీని 'మాంటెగూ' మంత్రి ప్రకటనచేశాడు. కాని, దీనితోపాటే 1918 సం॥ సామ్రాజ్యశాసనసభలో 'రౌలటు' చట్టమును ప్యాసైనది. ఆశాసనక్రింద వ్యక్తిస్వాతంత్ర్యం అనేది, సి. ఐ. డి. పోలీసులచేతులలో ఉంటుందని అంతా అంగీకరించారు. ఆశ్చర్యవిషాదాలు ఒక్కమాటు కలిగినాయి దేశంలో. గాంధీజీ ప్రథమతః యావద్భారతనాయకత్వం వహించింది యీరౌలటుచట్టనిరసనాందోళనంలోనే. ఈసందర్భంలోనే 'జనరలుడయ్యరు' జలియన్‌వాలాబాగ్‌లో జరుగుచున్న పౌరసభమీద ఫిరంగులు పేల్చడం, సుమారు 500 మంది స్త్రీలు, పురుషులు, బాలురు మరణించడం, పంజాబులో మార్షలులా పెట్టడం, ఇందునుగూర్చి విచారణచేసిన 'హంటరు' కమిటీవారు నీళ్ళు నములడం చరిత్రప్రసిద్ధాలు. మోతీలాలునెహ్రూగారి అధ్యక్షతను కాంగ్రెసువారు విచారణ చేసి రిపోర్టు ప్రకటించారు.

యుద్ధానంతరం మిత్రమండలివారు యిదివరలోయిచ్చిన వాగ్దానాలకు వ్యతిరేకంగా టర్కీసామ్రాజ్యాన్ని అంతరింపజేసారు. అఖిలమహమ్మదీయమతప్రపంచానికి గురువైన టర్కీ సుల్తాను (కలీఫా) నామావశిష్టుడయ్యాడు. ఈలోపుగా 1918 లో 'మాంటెగూ, ఛెమ్సుఫర్డు'గార్లు తయారుచేసినవిధానము ప్రకారం-అందులోని ఆశయాలకుకూడా వ్యతిరేకంగాను కాంగ్రెసువారు 1918సం॥ బొంబాయి స్పెషలుకాంగ్రెసులో చేసిన యిందునగూర్చిన సూచనలను పెడచెవినిబెట్టిన్ని-తయారుచేయబడిన 1919 లో వచ్చిన చట్టమెంత అసంతృప్తికి హేతువయింది. 1919 సం॥ అమృతసరుకాంగ్రెసు యీచట్టము పనికిరానిది అసంతృప్తి, ఆశాభంగకరమైనది అని తీర్మానించింది ఈచట్టములోని ద్వంద్వప్రభుత్వవిధానముకూడా నిరసించబడింది. ఈ మూడుసమస్యలను గుచ్చెత్తి గాంధీగారు 'అసహాయోద్యమం' లేవనెత్తారు. సంస్కరణాలప్రశ్నకంటె అమృతసరుకాంగ్రెసుకు పిమ్మట జనరలుడయ్యరును పెన్షనుతో ఉద్యోగం చాలించుకొమని ప్రభుత్వం చేసినతీర్పు తనను అసహాయవాదిగా చేసెనని గాంధీగారొకసారి ఒప్పుకొన్నారు. తోడనే 1920 సం॥ ఆగష్టులో సమావేశమైన కలకత్తాస్పెషలుకాంగ్రెసులో రాబోయే సంస్కరణాలు బహిష్కరించాలని తీర్మానమైంది 1920 డిశంబరులో నాగపూరులో జరిగిన కాంగ్రెసులో కాంగ్రెసుసూత్రమే మారింది. ఇదివరలో ఉన్నకాలనీలలోని స్వపరిపాలనలాంటి

స్వపరిపాలన అనేదిన్ని, 'చట్టసమ్మతమైనపద్ధతి' అనేదిన్నీ పోయినవి. (ఇంకా అప్పటికి కాలనీలకు అధినివేశప్రతిపత్తి రాలేదు.) "శాంతధర్మపద్ధతుల స్వరాజ్యమును బడయుటయే కాంగ్రెసుయొక్క ఉద్దేశ్య" మని మార్చబడినది. తిలకుమహాశయుడు నాడు వ్యక్తిగతంగా గర్జించిన "స్వరాజ్యము నాజన్మహక్కు" అనేవాక్యం 1920 సం॥ కాంగ్రెసులో భారతీయుల పేరుతో సూత్రస్థమైంది. సాధనం చట్టసమ్మతంగా ఉండాలా? ఉండనక్కరలేదా? అనే ప్రశ్న పోయింది. ధర్మశాంతపద్ధతితో కూడిన సర్వసాధనాలు అంగీకరించబడ్డాయి. శాసనసభలు, కోర్టులు, పాఠశాలలు అనే త్రివిధబహిష్కారతీర్మానంకూడా యిచ్చటనే జరిగినది. ఈఅసహాయోద్యమం, దినదినప్రవర్ధమానమై అఖండంగా దేశమంతా వ్యాపించడం, చివరకు ఉద్యోగాలు వదలుకోవడం, పన్నులనిరాకరణంవరకుకూడా రావడం, వేలకొలది నిర్బంధప్రవాసాలు, ఆస్తులు వదలుకోవడం, ఏలా జరిగిందో చరిత్రప్రసిద్ధమే.

1922 సం॥లో గాంధీగారిని అప్పటిరాజప్రతినిధి రాజ్ నామాకు సంజ్ఞ చేశారు. కాని జరుగలేదు. ఈఉద్యమం దీప్తిమంతగా ఉన్నరోజుల్లోనే 'స్వరాజ్య' నిర్వచనం చెయ్యాలని జిజ్ఞాస కొంత దేశంలో బయలుదేరింది. స్వరాజ్యమనగా 'సంపూర్ణస్వాతంత్ర్యం' గా, నిర్వచనం చేయుమనిన్నీ, యీస్వరాజ్యవిధానం ఎలాఉండాలో కాంగ్రెసువారు పత్రకాన్ని రచించా

లనిన్నీ, కోరబడింది. స్వరాజ్యశబ్దానికి నిర్వచనం యివ్వడక్కరలేదనిన్నీ, స్వరాజ్యమనగా సాధ్యమైతే సామ్రాజ్యముకు లోబడేదనిన్నీ, అవసరమైతే సామ్రాజ్యమునకు వెలుపలిదనిన్నీ అర్థము అందులోనే యున్నదని నెహ్రూగారు సమాధానమిచ్చారు.

ఈకాలపుజిజ్ఞాసలలో మార్గదర్శకమైంది 'బాబు భగవాన్దాసు' గారిపతకం. స్వయంనిర్ణయసూత్రము ననుసరించి దేశప్రతినిధుల సమావేశంలోనే భారతస్వరాజ్య నిర్ణయం కావాలి. శాసనసభలకు సన్యాసులు, ఫకీరులలాంటి నిర్మత్సరులను ఎన్నుకోవాలి. ఎన్నిక అనేది కేవలం ఓట్లనుబట్టి లెక్కించేదిగా ఉండకూడదు. తనసేవ, విజ్ఞానబలంవల్లనే వ్యక్తి ప్రజాప్రతినిధిగా అయిపోవాలి. పూర్వము ఋషులు చేసినశాసనాలను రాజులు అమలు జరిపినట్లు కార్యవర్గానికి శాసనాధికారం ఉండరాదు. అంటే క్యాబినెట్టుపద్ధతి పనికిరాదు. ప్రజాస్వామ్యమనేది భారతవిజ్ఞానపుపునాదులమీద ప్రతిష్ఠితం కావాలన్నాడు భగవాన్దాసు. అసహాయోద్యమమే భారతదేశము యొక్క భావదాస్యవిముక్తిలనానికి తొలికారణం. ఇదివరలో పతకాలువేసిన గోక్లేమహానీయునివంటివారు ఎంతసేపూ తమవి, పాశ్చాత్యరాజ్యాంగదృష్టిలో సప్రమాణాలుగా ఉన్నాయా లేవా, అనేసంగతే చూచుకొనేవారు. నేటినుంచియే భారతదేశంలో నూతనరాజ్యాంగజిజ్ఞాసలు ప్రారంభం. భారతదేశము స్వయంనిర్ణయాధికారం గలది ప్రాచీననాగరికతగల ఒకవ్యక్తి.

రాజ్యాంగంలోకూడా ప్రత్యేకంగా యోచించుకోగల సమర్థత గలది అనేసంగతి బయలుపడింది.

1922 సం॥లో ప్రారంభింపవలసిన 'శాసనోల్లంఘనం' ఆగిపోయింది. పిమ్మటనుంచి శాసనసభాప్రవేశవాదం దాసు, నెహ్రూల నాయకత్వమున బయలుదేరింది. దేశద్రోహులను దూరంగా ఉంచడానికీ, ప్రభుత్వంలోపలినుంచి అసహాయోద్యమం చేయడానికీ, శాసనసభలు, వశపర్చుకోవాలి అన్నారు. 1923 సం॥ స్పెషలుకాంగ్రెసులో ఇందుకు వ్యక్తిస్వాతంత్ర్యం యివ్వబడింది. 1924 సం॥లో గాంధిగారియధ్యక్షతను బెల్గాం కాంగ్రెసుదీని నంగీకరించింది.

1925 సం॥రంలో ఢిల్లీశాసనసభలో భారతీయుల స్వయంనిర్ణయాధికారమును గుర్తించి అధినివేశప్రతిపత్తికి దారి జూపే సంస్కరణలు యీదేశములో ప్రవేశపెట్టుటకు భారత బ్రిటిషుప్రతినిధులు సమానహోదాతో కూర్చునే ఒక రౌండు టేబిలుసమావేశము జరగాలని తమకనీసపుకోర్కెల తీర్మానం కాంగ్రెసువారి ప్రోద్బలంవల్ల సర్వపక్షామోదంతో జరిగింది. కాని ప్రభుత్వంవారు, భారతదేశముయొక్క భాగ్యవిధాతలు బ్రిటిషుపార్లమెంటువారే అనిన్నీ, 1930 లో యేర్పడే బ్రిటిషు విచారణసంఘంయెదుట తమసమర్థతను భారతీయులు ఋజువు చేసుకోవాలనిన్నీ, అంతవరకు యేమీ చెప్పవీలులే దనిన్నీ, త్రోసివేశారు. ఇందు కసమ్మతిగా ఆసాలుబడ్జెట్టులోని ప్రథమ

పద్దును శాసనసభలో కాంగ్రెసువారు తిరస్కరించారు. బడ్జెట్టును స్వరాజ్యసమస్యమీద తిరస్కరించడముకు యిదే ప్రథమపర్యాయము. 1925 సం॥రం ఢిల్లీసభలోనుంచి స్వరాజ్యపార్టీ అసమ్మతిసూచకంగా లేచివచ్చారు. ఈకనీసపుకోర్కెలతీర్మానాన్ని మహాభారతంతో పోల్చి ఆరోజుల్లో యీజిల్లాల్లోని 'సత్యాగ్రహి' పత్రికవ్రాసిన చక్కనిసంపాదకీయము యిప్పటికీ జ్ఞప్తికి వస్తూంటుంది. ఉన్నవిధానంలో యేమైనా మార్పులు చేయుటకు 'మడ్డిమాన్'గారి అధ్యక్షతను ప్రభుత్వం విచారణ జరిపి నివేదికను తయారుచేయించారు. దీనిప్రకారం 'గ్యాసు' బాయిలర్లు శాఖలుకూడా రాష్ట్రమంత్రులపరం చేయమన్నారు. ఇది పైఆందోళనాఫలం.

ఈస్వరాజ్యపార్టీవారు బెంగాలు మధ్యరాష్ట్రాలలో ద్వంద్వప్రభుత్వం నడవకుండా చేశారు. ప్రభుత్వం మంత్రులశాఖలను అప్పగించుకోవలసివచ్చింది.

ఇంతకుపూర్వమే ఇండియామంత్రిగానున్న 'బిర్కెన్ హెడ్డు' ప్రభు వొకసవాలు చేశాడు. "స్వరాజ్యం, స్వరాజ్యమంటారు, మీకు శక్తివుంటే మీరంతా కలిసి ఒకవిధానం రచించుకోండి. చూస్తాం" అన్నాడు. దీనిమీదను నిర్మాణాత్మకమైన రాజ్యాంగజిజ్ఞాస తిరిగి లేచింది. ఈసమయమున చిత్తరంజనదాసుగారు స్థానికపంచాయితీలు మూలపీఠంగానుండే ఒకస్వరాజ్యపతకం తయారుచేశారు. 'ఆనిబిసెంటు' గారి

నాయకత్వమున 'ఇండియా కామనువెల్తు బిల్లు' అని ఒక స్వరాజ్యపతకం తయారు చేయబడి పార్లమెంటులో ప్రవేశపెట్టబడి ఓడిపోయింది. ఈసమయంలోనే దేశములోవుండే సర్వపక్షాలు పండితమోతీలాలు నెహ్రూగారి అధ్యక్షతను సమావేశమై ఒక నివేదికను తయారు చేశారు. అందులోని ముఖ్యాంశాలు:— హిందూదేశానికి బ్రిటిషుసామ్రాజ్యమనే జాతిసముదాయంలో కెనడావగైరాలవంటి అధినివేశప్రతిపత్తి వుండాలి. దేశపుసుపరిపాలనకొరకు శాసనాలు చేసుకొనే పార్లమెం టుండాలి. దానికి బాధ్యత వహించే కార్యనిర్వాహకవర్గం వుండాలి. ఈప్రభుత్వాన్ని 'యిండియాకామన్వెల్తు' అని పిలవాలి.

పౌరునికి వాక్స్వాతంత్ర్యం, అభిప్రాయస్వాతంత్ర్యం, పత్రికాస్వాతంత్ర్యం, ఆయుధధారణకును హక్కు ఉండాలి. విచారణలేని నిర్బధం ఉండకూడదు. యావద్భారతభాష హిందీగా ఉండాలి.

రాజుగారున్ను, రెండుసభలతోకూడిన కేంద్రశాసనవర్గమున్ను కలిసి యీ'కామన్వెల్తు'కు శాసనాధికారం కలిగిఉంటారు. పైసభకు 200 మంది, క్రిందిసభకు 500 మంది ప్రతినిధులుండాలి. పైసభకాలం 7 సం॥ లు. క్రిందిసభ 5 సం॥ లు. క్రిందిసభకు సరాసరిఎన్నికలు. పైదానికి రాష్ట్రసభలు ఎన్నుకోవాలి. ఆర్థికపత్రం క్రిందిసభలోనే ప్రవేశం కావాలి. ఉభయసభలు అంగీకరించనిది ఏబిల్లును శాసనం కాగూడదు. అభిప్రాయ

భేదాలు వస్తే జాయింటుమీటింగులు జరుగును. శాసనవర్గం అంగీకరించినబిల్లు గవర్నరుజనరలు ఆమోదిస్తేనే కాని చట్టం కాదు. గవర్నరుజనరలు ఆమోదించవచ్చును. లేక రాజుగారి ఆమోదానికి పెట్టవచ్చును. లేక కొన్నిసూచనలలో శాసన వర్గానికి త్రిప్పివేయవచ్చును. గవర్నరుజనరలుకు శాసనసభను కాలపరిమితిలోగా రద్దుచేసేవగైరాహక్కులు, అత్యవసర పరి స్థితులలో అసాధారణపుహక్కులు ఉన్నాయి. కార్యవర్గం క్యాబినెట్టుపద్ధతి నేర్పడి శాసనవర్గపువిశ్వాసంతో పాలించాలి.

రాష్ట్రప్రభుత్వం:—లక్షమందిప్రజలకు ఒకస్థానంచొప్పున ఏకసభతోకూడిన శాసనవర్గం ప్రతిరాష్ట్రంలోను ఉండాలి. కాలం 5 సం॥లు. సరాసరిఎన్నిక జరగాలి. గవర్నరుజనరలువలెనే గవర్నరుకు కూడా అన్నిరకాలహక్కులు ఉన్నాయి. రాష్ట్ర కార్యవర్గం క్యాబినెట్టుపద్ధతిని యేర్పరాలి. సమాఖ్యశాసనవర్గం నిర్ణయించే సంఖ్యనుబట్టి గవర్నరుజనరలు సుప్రీముకోర్టును నియమించాలి. చట్టనిర్వచనమునుగూర్చియేగాక తదితరవ్యాజ్యాలుకూడా వీరు పట్టవచ్చును.

రాజ్యాంగనిబంధనను కేంద్రశాసనవర్గం $\frac{3}{4}$ మెజారిటీతో మార్చడానికి హక్కుండాలి.

ఆంధ్రకర్ణాటకాలు ప్రత్యేకరాష్ట్రాలుగా యేర్పడాలి. సమిష్టినియోజకవర్గం ఉండాలి. పశ్చిమోత్తరపరగణాలలో మహమ్మదీయే తరులకున్ను, యితరచోట్ల అల్పసంఖ్యాకులు

గానున్న మహమ్మదీయులకు తప్ప ప్రత్యేకప్రాతినిధ్యముండ కూడదు. ఈఅల్పసంఖ్యాకప్రతినిధులకు "సాధారణస్థానాలకు" నిలబడడానికికూడ హక్కుండాలి. పంజాబు బంగాళారాష్ట్రశాసనసభలలో ప్రత్యేకప్రాతినిధ్యం కూడదు. కాని పదిసంవత్సరాలు ఈలాజరిగినాక తిర్గి అవసరమైతే యోచించవచ్చును. ప్రత్యేకప్రాతినిధ్యం సదరు సంఘాలవారు యింకా ఉంచమంటే తప్ప పదిసంవత్సరాలకంటె ఉండకూడదు.

సంస్థానాలతో ప్రస్తుతం సమాఖ్యవలదు. కాని సంస్థానాలకు ఆచారం, హక్కుప్రకారమున్న సంబంధాలు ఆప్రకారం పాలించడానికి 'కామన్వెల్తు' ప్రభుత్వంచేతుల్లోనే అవిఉండాలి.

ఈవిధానం తయారయేసమయంలోనే భారతదేశస్థులకు ముందివ్వవలసిన సంస్కరణాలనుగూర్చి యోచించడానికి సైమనుసంఘాన్ని వేశారు పార్లమెంటువారు 1919 సం॥ర చట్టప్రకారం 1927 లో కేవలం తెల్లదొరలతో కూడినసైమను సప్తకాన్ని బహిష్కరించవలసిందని కాంగ్రెసువారే కాక కేంద్రశాసనసభలోకూడా తీర్మానం జరిగింది. ఆసంవత్సరం మదరాసులో జరిగిన కాంగ్రెసుమహాసభలో సంపూర్ణస్వతంత్రమే భారతీయలక్ష్యంగా ఒకతీర్మానంకూడా ప్యాసవడానికి యీపరీక్షాసంఘముకూడా ఒకకారణం.

ఈజిప్టులో 'మిల్నరుకమిషన్‌ను' జాతీయవాదులు బహిష్కరించినట్లే యీసంఘము భారతదేశములో బహిష్కరింప

బడింది. 1928 సం॥రంలో తయారైన నెహ్రూనివేదికమీద రెండుపక్షాలేర్పడ్డాయి. అందులోని మహమ్మదీయులకు ప్రత్యేకప్రాతినిధ్యం పనికిరాదనే సూచనలు, నచ్చలేదు. అధినివేశస్వరాజ్యమును గమ్యంగా యీనివేదిక పెట్టుకోవడంకాంగ్రెసులోని యువకపక్షానికి నచ్చలేదు.

ఈస్థితిలోనే 1928 సం॥రం డిశంబరులో కలకత్తాలో కాంగ్రెసు సమావేశమైంది. ప్రజాభిప్రాయమును యేమిన్నీ సరకుచేయనిప్రభుత్వవిధానంవలన దోహదము పొందుతూన్నభావ ఆదర్శోద్దీపితులైన యువకులకున్ను, మోతీలాల్ నెహ్రూగారి వంటి పెద్దలకున్ను అభిప్రాయభేదాలు హెచ్చయాయి. ఈసంధిలోకోరబడి గాంధీగారు నాయకత్వంవహించారు. 1929 సం॥ లాహోరుకాంగ్రెసువరకున్ను 'సంపూర్ణస్వరాజ్యం కాంగ్రెసుసూత్రంగా మార్చవద్దనిన్నీ, యీలోపుగా నెహ్రూనివేదిక ప్రకారమైనా స్వరాజ్యసారాన్ని భారతప్రభుత్వంలో ప్రవేశపెడతారా? అని ప్రభుత్వానికి నోటీసు యిద్దాం అనిన్నీ, అలా జరుగనినాడు నెహ్రూనివేదికను రద్దుచేసి లాహోరులో 'సంపూర్ణస్వాతంత్ర్యమే' కాంగ్రెసుసూత్రంగా ప్రకటిద్దామనిన్నీ, హితబోధచేసి సమాధానం చేశారు. 1929 సం॥రంలో రాజప్రతినిధి 'ఇర్విన్'గారు కాలం పక్వమైనతర్వాత 'అధినివేశప్రతిపత్తి' యివ్వడమే మాఉద్దేశ్య మనిన్నీ, భారతసంస్కరణాలను గురించి రౌండుటేబిలుసభ సమావేశము జరుగుననిన్నీ,

ప్రకటించి గాంధిగారికి కబురంపించారు. "అధినివేశప్రతిపత్తి యెప్పుడు యిచ్చేది యోచించుటకు కాక; అధినివేశరాజ్యాంగం యొక్క పైలక్షణాలుమాత్రంగల నిర్మాణాన్నిగురించిమాత్రమే యోచించుటకు యీరౌండుటేబిలుసభ జరిగేటట్లు అర్థమగుతూంది. అది లాభం లేదు. పైగా ప్రస్తుతరాచకీయ ఖైదీలను వదలుటమొదలైన చర్యలవలన మీహృదయపరివర్తనం చూపించాలి" అని గాంధిగారినాయకత్వమున దేశనాయకులు ప్రకటించారు. అందునుగూర్చి నే నేమీ చెప్పలేకన్నారు రాజప్రతినిధిగారు.

1929 సం॥రం డిశంబరులో లాహోరుకాంగ్రెసు రాత్రి ఒంటిగంట రాగునకొట్టేసరికి—సరిగా సంవత్సరం గడువుముగించే ముహూర్తానికి—"శాంతధర్మపద్ధతులమీద సంపూర్ణస్వరాజ్యసంపాదనమే కాంగ్రెసుసూత్ర"మని తీర్మానించింది. బ్రిటిషుసామ్రాజ్యముతో క్రిందిచేయుగా సంబంధము ఉండనక్కరలేనిపద్ధతి, స్వతంత్రదేశాలతో సమానమైన హోదాగల రాచకీయస్థితి సంపూర్ణస్వతంత్రం. ఈఆదర్శం యువకులలో నూతనోత్సాహమును జనింపజేసింది. ప్రపంచంలో కాంగ్రెసుకు గౌరవాన్ని కలుగజేసింది.

పిమ్మట రాజప్రతినిధికి ప్రభుత్వహృదయం ప్రజాశయములపట్ల మార్పు చెందితే, పెద్దపెద్దజీతాలు, బీదలగంజిఅన్నంలోని ఉప్పుపన్ను, సేనఖర్చు మొదలైనవి తగ్గించమనిన్నీ, త్రాగు

ఈ మానిపించవలెననిన్నీ, అలా జరుగనియెడల స్వరాజ్యపోరా టం తిరిగి సాగక తప్పదనిన్నీ గాంధిగారు నోటీసిచ్చారు. 1930 సం॥ జనవరి 26 వ తేదీ "సంపూర్ణస్వరాజ్య"పు రోజుగా యేర్పరచి దేశమంతా పూర్ణస్వరాజ్యప్రమాణసభలు జరిగినవి. ఆనాడే శాసనసభలలోని కాంగ్రెసు పార్టీవారు లేచివచ్చారు. పిమ్మట ఆయననాయకత్వమున జరిగినఉప్పుసత్యాగ్రహాదులు దిగంతవిశ్రాంతమైన యశస్సును పొందాయి. లక్షలకొలది స్త్రీలు, పురుషులు, బాలురు, బాలికలు జైళ్ళకు పోయారు. లాటీదెబ్బలు తిన్నారు. ఆస్తులు గోల్పోయారు. ప్రాణార్పణం చేశారు.

ఈస్థితిలో 1930 సం॥లో సైమనుకమిషనువారు తమ రిపోర్టును ప్రకటించారు. మితవాదులసహకారంకంటె కాంగ్రెసు వారి బహిష్కారంవలననే ఆరిపోర్టులో కొన్నిపెద్దమాటలు వేసుకైనా పడ్డాయని అంటారు. వారిముఖ్యసూచనలు. (1) భారతదేశానికిచ్చే రాజ్యాంగము దానంతటది (అధినివేశప్రతిపత్తిపరంగా అని తాత్పర్యం) వికసించే యేర్పాట్లుండాలి. అనగా యికముందుపరీక్షించడం, మోతాదులవారీగా సంస్కరణ లివ్వడం ఉండకూడదు. (2) సమాఖ్యావిధానమే భారతసమస్యకు పరిష్కారం. (3) ఒకరిద్దరినిమాత్రమే శాసనసభకు వెలుపలి వారిని రాజప్రతినిధిమంత్రులుగా ఏర్పరచాలి. (4) సమాఖ్య శాసనవర్గపుక్రిందిసభలో కొంచెము నామినేషను లుండాలి. (5) ప్రత్యేకబాధ్యతలతో రాష్ట్రస్వతంత్రం యివ్వాలి.

కాంగ్రెసువారు జైళ్లలో నుండేకాలముందే 1925 లో శాసనసభవారు తీర్మానించిన రౌండుటేబిలుసభపేరుతో లండనులో మితవాదులు, మహమ్మదీయాదిసాంఘికనాయకులు పిలువబడ్డారు. ఇదియే మొదటిరౌండుటేబిలుసమావేశము. ఇదివరలో దేశీయులు నిరసించినసైమనుకమిషనురిపోర్టు సభలో ప్రధానముగా నుండదనియు, సమానహోదాలతో చర్చలు చేసుకొనవచ్చుననియు తెలిపిరి. సమాఖ్యవిధానం, ఆర్థికం, నియోజకవర్గాలు, అల్పసంఖ్యాకులు మొదలైనవిషయాలకు ఉపసంఘాలు, చర్చలు, రిపోర్టులుమొదలైనకర్మకాండ చాలా జరిగింది. కాని, కాంగ్రెసుప్రాతినిధ్యం లేనియీసమావేశం నిర్వహించగలరా యీమితవాదులు, యీసాంఘికనాయకులు అనేప్రశ్న వచ్చింది. 'శాంకే' గారే "బైబిలులో తూర్పునుంచి విజ్ఞానులు పశ్చిమానికి వచ్చారని ఉన్నది. మీరు విజ్ఞానులే గాని యింకా చాలమంది విజ్ఞాను లీసభకు రావలసినవాళ్లు (కాంగ్రెసు, గాంధీలనుద్దేశించి) అక్కడ ఉన్నారు." అని అక్కడఉన్నవాళ్ల ప్రజాప్రతినిధిత్వాన్ని శంకించారు. మితవాదులు కూడా శంకించారు. సదరుసభచివర అప్పటిలేబరుప్రధానామాత్యుడు 'మాక్డనాల్డు' గారు భారతీయుల ఆశయములను గౌరవించుచు కాంగ్రెసు నాహ్వానించుచు గంభీరమైన ఉపన్యాసము నిచ్చారు. హిందూదేశంలో 'ఇర్విన్' గారు ఉండడం అక్కడ లేబరుమంత్రివర్గం ఉండడం కూడా గాంధీగారితో సమాధాన

యత్నం చేయడానికి కారణ మంటూవు కొందరు. 1931 మార్చి 5 తేదీని ప్రకటించబడిన 'గాంధి-యిర్విన్' రాజీనామా భారతరాజ్యాంగ చరిత్రలో గొప్పవిషయమే కాక ప్రథమదఫా ప్రభుత్వంతో సమానహోదాతో రాజీనామా చేసుకొనేగౌరవం కల్గింది కాంగ్రెసుకు. గాంధి-యిర్విన్ సంధిక్రింద రాజ్యాంగాన్ని గురించి మూడుషరతులు. (1) సమాఖ్యపద్ధతిని (సంస్థానాధిపతులకు-బ్రిటిషురాష్ట్రాలకున్న కలయికతో) ప్రభుత్వవిధానం మారుట. (2) కేంద్రప్రభుత్వంలోకూడా ప్రజాబాధ్యతను ప్రవేశపెట్టుట. (3) హిందూదేశక్షేమముకొరకు కొన్నిరక్షణలు మినహాయింపులు రాజప్రతినిధికప్పగించుట యనునవి.

కాని ఉరి తీయబడుటకు సిద్ధముగయున్న భగత్సింగు, రాజగురు, శుకదేవుగార్లను యావద్భారతదేశం యేకకంఠంగా వద్దని కోరింది గనుక అధమం ద్వీపాంతరశిక్షతోనైనా ప్రాణం నిలపకపోతారా, అనుకున్నారు. కాని సివిలుసర్వీసువారిపట్టుదలమీద వారిని ఉరితీస్తారనేవార్త గాంధిగారు వెళ్లబోయే రౌండుటేబిలుకు అపశకునంగా విషాదాన్ని జనింపచేసింది.

ఈషరతులప్రకారము రెండవరౌండుటేబిలుసభ సమావేశమైనదనుకోక తప్పదు. గాంధిగారు కాంగ్రెసుయొక్క యేకైకప్రతినిధిగాయెన్నుకోబడి సీమకువెళ్ళిరి. ఇంతలో యెందుచేతనో విధానం మారింది. ఇర్విన్ గారికిగడవు అయిపోయి 'విల్లిం

గ్డన్'గారు రాజప్రతినిధిగా వచ్చారు. లేబరుమంత్రివర్గంకూడా మారేస్థితి వచ్చింది. ఈసభలో (7-9-31 ప్రారంభము) గాంధి-యిర్విన్ సంధిషరతులకు విపరీతవ్యాఖ్యానం చెప్పారు బ్రిటిషు రాజకీయవేత్తలు. చివరకు మేము మీకిచ్చేహక్కులు మీదేశములో భిన్నవర్గములు, మతస్థులు అల్పసంఖ్యాకులు యెలాపంచుకుంటారో ముందు తేల్చవలసినట్లుగా మాట్లాడారు. అల్పసంఖ్యాకులబాధ్యత మాకు చాలా పవిత్రమైనదన్నారు. కాంగ్రెసేతరసభ్యులు కొందరిలో యిది స్వార్థపరత్వాన్ని మరింత పురికొల్పింది. ఐకమత్యం కుదుర్చుకోలేక వెల్తి అయే స్థితివచ్చింది. గాంధీగారు కనిపెట్టారు. లేచారు. సభలో కాంగ్రెసుకు గమ్యమైన సంపూర్ణస్వరాజ్యాదర్శాన్ని సత్యాగ్రహికి సహజమైన నిర్భయత్వంతో, పరదూషణలేని మృదుమధుర వాక్కులతో, సరసపదగుంభనాలతో ప్రతిపాదించారు. "కాంగ్రెసుమతప్రకారం సంపూర్ణస్వతంత్రం అనగా బ్రిటిషు భారత దేశాలకు యిప్పుడున్న పైచెయ్యి, క్రిందిచెయ్యి సంబంధము పోయి భాగస్వామిత్వముగా మారాలి. ఉభయపార్టీలున్ను వుభయులకు లాభదాయకంగా నున్నంతకాలం కలిసి వుండడం, యేపార్టీకిష్టం లేకపోయినా యీభాగస్వామిత్వం వదులుకోవడముకు హక్కుండడమే మాకాంగ్రెసుసూత్రముయొక్కతత్త్వార్థము. దీనికి లోబడి భారతజాతికి సేన, విదేశవ్యవహారాలు, ధనం, ఆర్థికనీతిమీద హక్కుండేటట్లుగాను విధానం నిర్మించాలి. భార

తద్దేశంపైన మోపబడిన ఋణంవిషయంలో నిష్పాక్షికపువిచారణ చేసితేల్చడానికి అవకాశం ఉండాలి. ఈసందర్భంలో పైవాటికిలోబడి భారతదేశక్షేమాని కవసరమైన ఋద్ధిపుచ్చుకోవడాలు బ్రిటిషువారితో జరిగించుకోవచ్చుననిన్నీ, కాంగ్రెసు నాకిచ్చిన ఆజ్ఞ" అని స్పష్టప్రతిపాదనము చేసి యీదృష్టితో సభయెదుట ఉన్న సూచనలను సభ్యులు దిగ్భ్రమచెందునట్టి సూక్ష్మబుద్ధితో విషయపరిచయంతో విమర్శించారు. "కమిటీలు పెట్టి మాసాలకొలది తెక్కించి—మీ ఆతిథ్యం మా కెంత సుఖకరంగా నున్నను—మాపనిపాటలు పాడుచేయకండి. ఇక్కడకు మీరు మా కివ్వబోయే రాజ్యాధికారాన్ని గూర్చి మమ్ములను పిలిపించారు గాని మాలో మేము యెల్లాపంపకము చేసుకొంటామో తెలుపడానికి పిలువలేదు. ధర్మం తప్పుతున్నారు మీరు. మీరు అల్పసంఖ్యాకుల ప్రతినిధు లనేపేరుతో దేశక్షేమం గుర్తెరగనివారిని పిలవబట్టే యీసమస్య చిక్కుల్లోకి దిగింది. ఈవ్యాపారం నా కనుమానంగా ఉంది. కాంగ్రెసు మాత్రం ప్రత్యేకనియోజకవర్గానికి, ప్రత్యేకప్రాతినిధ్యానికి వప్పుకోదు. కాంగ్రెసుసంస్థయే భారతదేశంలో నూటికి 95 గురు ప్రజలకు ప్రతినిధి అని నేను ప్రతిజ్ఞ చేస్తూన్నాను. మాకాంగ్రెసుసభ్యులపట్టీలు, మాకాంగ్రెసువారిజైళ్ళలిష్టు యీసంగతులు ఋజువుపరుస్తాయి." అని తెగేసి మాట్లాడారు. చివర "యింతకంటె నాకు బాధాకరమైనది పంచములనుకూడా ప్ర

త్యేకనియోజకవర్గముక్రింద చీలదీయుచున్నారు. ఈసూచనను నాప్రాణము నొడ్డియైన నిరోధిస్తాను" అని అప్పుడు ఆయన చేసినశపథంయొక్క శక్తి పిమ్మటగాని లోకానికి తెలియలేదు. గాంధీగారు రౌండుటేబిలుసభలో నిర్మాణాత్మకమైన రాజ్యాంగసూచనలు కూడా కొన్ని చేశారు. "ప్రతిగ్రామములో వయస్సువచ్చినవా రందరు ఒకప్రతినిధిచొప్పున భారతదేశపు ఏడులక్షల గ్రామములలో ఎన్నుకోబడిన ప్రతినిధులే శాసనసభ్యుల నెన్నుకోవాలి. శాసనసభ కెన్నికలైనతర్వాత అవసరమైన కొందరు సమర్థులను నామినేషను చేయుటకంటె శాసనసభయే ఎన్నుకోవాలి. బీదభారతదేశానికి డబ్బు దుబారా అయ్యేవిధానం అక్కరలేదు. రాష్ట్రస్వతంత్రం యిచ్చామని చెప్పుచున్నారు. బంగాళాదేశములో యూనాడు పోలీసులు చేయుచున్నఅక్రమాలను తొలగించుటకు మంత్రులకు హక్కుంటుందా చెప్పండి. ఇదీ నాపరీక్ష" అని ప్రశ్నించారు.

ఈసందిగ్ధస్థితిలో రెండవసభ పూర్తిఅయినది. గాంధీగారు యింటికి వచ్చినవెంటనే సంధి రద్దుకావడం, తిరిగి ఉద్యమం అత్యధికంగా విజృంభించడం, కొంతకాలమునకు తగ్గడం మొదలైనచరిత్ర అందరకు తెలిసినదే.

ఈలోపుగానే అనగా 17-8-32 తేదీని యీదేశంలోని జనులను మతము, వృత్తి, జాతి (స్త్రీపురుష) ని బట్టికూడా నియోజకవర్గాలక్రింద విభజించి ఆప్రకారం వారియిష్టంవచ్చిన

రీతిగా శాసనసభలకు స్థానాలు నిర్ణయించిన 'సాంఘికపరిష్కారం' ఒకటి బ్రిటిషుప్రభుత్వంవారు ప్రకటించారు. ఇందులో పంచములుకూడా ప్రత్యేకనియోజకవర్గంక్రింద హిందువులలోనుంచి విడదీయబడ్డారు. హిందూసంఘానికి జరుగబోయే శాశ్వతఅపకారాన్నిగూర్చియే గాంధిగారు జైల్లోనుండి ప్రాయోపవేశం చేశారు. ఇందువల్లనే ఉభయనాయకులు రాజీపడ్డారు. ఈరాజీప్రకారం మొదటిఎన్నికలో స్థానం 1కి నలుగురు చొప్పున పంచమఓటర్లే ఏర్పాటు చేసుకుంటారు. పిమ్మట రెండవఎన్నికజరిపి ఇందులోనుంచి ఒకస్థానాన్ని పంచములు, సవర్ణులతోకూడుకొన్న సాధారణనియోజకవర్గంవారు ఎన్నుకుంటారు. ఈప్రకారం బ్రిటిషుగవర్నమెంటువారు అంగీకరించవలసివచ్చింది. ఈఅవర్ణ సవర్ణ నాయకులసంధి పూనాలో ది 29-9-32 తేదీని జరిగింది. ఈసంధివల్ల పంచమస్థానాలుకూడ హెచ్చినవి.

పిమ్మట మూడవరౌండుటేబిలుసభ ఒకటి జరిగింది. ఈ సభలో అసలుసమాఖ్యవిధానాన్నిగురించే ఎత్తకుండా కేవలం రాష్ట్రస్వతంత్రంతోటే ప్రస్తుతసంస్కరణాలను సమాప్తి చెందించడానికి హోరుగారు యత్నించారు. ఇది మితవాదులకుకూడా విసుగుకల్గించి తీవ్రఅసమ్మతికి కారణమైంది. తిన్ని సద్దుబాటు జరిగిందన్నారు. ఈసభావ్యవహారములతో తృప్తిచెందక సప్రూమొదలైనవారు తమసూచనలతో ఒకమెమోరాండము యిచ్చారు.

పిమ్మట శ్వేతపత్ర మనుపేరుతో రౌండు టేబిలుసారాంశా లంటూ ఒకనివేదిక బ్రిటిషుప్రభుత్వమువారిచే ప్రకటించబడింది. ఇందులో కాంగ్రెసువారిమాటటుంచి మితవాదుల యొక్కగాని ఆఖరుకు జిన్నా, మోడీ, సేత్నా వంటిపరమరాజభక్తిపరాయణుల సూచనలైనా అందులో లేవు. ఈశ్వేతపత్రం మీద పెద్దవిచారణంటో ఒకపార్లమెంటుకమిటీని వేశారు. ఇందులో భారతీయులకు సమానహోదా లేదని మితవాదులు మొదలైనవాళ్లు కినిశారు. అందుచేత కొందరు భారతీయులను 'అసెసర్లు'గా వేశా మన్నారు. ఈకమిటీయెదుట ఒకసంవత్సరం తిరిగి సాక్ష్యసంపన్నాలు జరిగాయి. దీనిఫలితంగా 1934 నవంబరు 11 తారీఖున 'జాయింటుపార్లమెంటుకమిటీనివేదిక' అని ప్రకటించబడింది. ఈసూచనలే 1935 జూలై నెలాఖరుకు 'కాన్స్టిట్యూషన్ చట్టం' మని ఉభయశాసనసభలద్వారా పార్లమెంటులో గబగబ అంగీకరింపబడినవి.

కాంగ్రెసుఆశయముల సంతృప్తిపరచుట అసలీవిధానం యొక్క సంకల్పం కాదు. మితవాదులసంకల్పంకూడా సంపూర్ణంగా విఫలమైందని సప్రూ, జయకరుగార్లు చివరకి జిన్నాగారుకూడా అంగీకరించారు. ఇంతే కాదు. ఒకసభకంటె మరియొకసభ, ఒకసంఘముకంటె మరియొకసంఘం, ఒకరిపోర్టు కంటె మరియొకరిపోర్టు క్రమంగా ఇందులోని అంశాలు బ్రిటిషు సామ్రాజ్యాధికారపరంగా బిగించబడినట్లు ప్రసిద్ధరాజ్యాంగ

శాస్త్రపండితులైన 'కెయితు, లాస్కీ' పండితులుకూడా అంగీకరించారు. ఈఅంశాలు ఆప్రకరణాలో వస్తాయి.

1936 సం॥ మార్చిలో లక్నోలో సమావేశమైన కాంగ్రెసుమహాసభ స్వయంనిర్ణయసూత్రానికి భంగకరమైనట్టియు, బ్రిటీషుసామ్రాజ్యతత్త్వాన్ని ఘనీభవింపజేయసమకట్టినట్టియు, ఇప్పుడున్నవిధానంకంటె కొన్నిసందర్భాల్లో వెనక్కు పోయినట్టియు, దేశాన్ని మత, సంఘ, వర్గాలక్రింద చీల్చినట్టియు, భారతదేశదారిద్ర్యము, నిరుద్యోగము పోగొట్టుకొనుటకు ఎంత మాత్రము సహాయపడనట్టియు ఈచట్టమును తిరస్కరింపవలె నని తీర్మానించింది. తిరస్కరించినా రాష్ట్రశాసనసభలలో కాంగ్రెసు ప్రవేశించి నిరోధకార్యక్రమమువలన సమాఖ్యవిధానము కూడ అమలుకు రాకుండునట్లు చేసి స్వయంనిర్ణయప్రకారము నూతనచట్టమునకై యత్నించుట కాంగ్రెసువారి ఆశయమని పిమ్మట ప్రకటించిన కాంగ్రెసుకార్యక్రమప్రణాళిక తెల్పుచున్నది. ఇంతేకాక, భారతజనసామాన్యమును బాధించుచున్న ఋణభారమును పన్నుభారమును తగ్గించుట, జమీందారీసహా భూమిపన్నువిధానములను సంస్కరించుట, కార్మికులకు తగు కూలి, విశ్రాంతి లభించునట్లు చేయుట, అనునవి కాంగ్రెసు వారు యిప్పుడు కాకపోయినను తగినఅధికారము వచ్చిన తక్షణం జరుగుటకై కృషి సల్పుదురని తెలుపబడినది.

ఇంతేకాక ఒకభారతప్రతినిధిమహాసభను జరిపి అందు భారతఆశయములను, అవసరములను బట్టి అనువైన ఒకరా

జ్యాంగవిధానమును తయారుచేసి, ప్రకటించి, దానిని అమలు పరిచేశక్తిని సంపాదించుకొని, తనస్వయంనిర్ణయాన్ని వ్యక్తపరుచుకొనచూస్తోంది యీ కాంగ్రెసుమహాసభ. మొన్న ఫెయిజుపూరులో కేవల గ్రామస్థులమధ్య జరిగిన యీ కాంగ్రెసుమహాసభలో యీతీర్మానమునకు జవహర్లాలుఅధ్యక్షుడు గొప్పఊంత మిచ్చాడు. ఫెయిజుపూరులోనే చట్టనిరసనతోపాటు భారతీయుల స్థిరంగా చీలికలుచేసే బ్రిటీషుసాంఘికనిర్ణయం కూడా తిరస్కరించబడింది. మంత్రిపదవుల స్వీకారాన్నిగూర్చి యెన్నికలఅనంతరం, అ. భా. సంఘు, శాసన,సభ్యులతోగూడిన సమావేశంలో నిర్ణయింప తీర్మానించబడినది.

న వ్య ప రి ణా మం.

1932 సం॥ కరాచీకాంగ్రెసులో జనసామాన్య శ్రేయస్కరమైన విషయాల్లోకూడా కాంగ్రెసు స్పష్టాభిప్రాయాలను ప్రకటించాలని జవహర్లాలునెహ్రూ ఒకఉద్యమం లేవదీసి గాంధీగారిచేత ఒప్పించాడు. అయితే యిది కాంగ్రెసుకు క్రొత్త అనుకోకూడదు. 1890, 1906 ఆప్రాంతాలు యిప్పటివలెనే ఆర్థికదుస్థితిరోజులు. రైతాంగపు స్థితిగతులనుగూర్చి విచారణ, ఋణవిముక్తికి సాధనాలు చేయవలసినదనిన్ని భూమిపన్నువిధానం మార్చాలననిన్ని,మితవాదదృష్టిలో అప్పుడున్న కాంగ్రెసు తీర్మానాలు చేసేది. కాని ప్రపంచపరిస్థితులనుబట్టి జనసామాన్యపరంగా కాంగ్రెసును వికసింపజేసే నవీనపరిణామం కరాచీ

కాంగ్రెసుతో ప్రారంభించింది. ఉద్యోగులజీతాలు రు 500/- లకు మించకుండుట, పౌరహక్కులు, భూమిపన్ను తగ్గుట, జమీందారీశిస్తులు తగ్గుట, కార్మికులకు కనీసపుకూలి లభించుట మొదలైనతీర్మానాలు కరాచీకాంగ్రెసు చేసింది. అంతకు పూర్వం కాంగ్రెసుసంఘాల్లోనున్న వ్యక్తులు కార్మిక, కర్షకసామ్యవాదఉద్యమాలు నడుపుతూన్నా యింతటినుంచే యీనూతన సంస్థలు కాంగ్రెసుకు యించుమించు అనుబంధసంఘాలులాగ బయలుదేరుతున్నాయి. 1934 సం॥ అక్టోబరులో యావద్భారత సామ్యవాదమహాసభ మొదటిపర్యాయం బొంబాయిఅవసరకాంగ్రెసుతోపాటు సమావేశమైనది. శాఖాసంఘాలు ఏర్పచుకుంటున్నది. కాంగ్రెసుసూత్రమైన పూర్ణస్వరాజ్యాన్ని సామ్యవాదపరంగా నిర్వచింప వీరు ఉద్యమించుచున్నారు.

ఇల్లాగే దేశములోని కర్షకోద్యమములు ఇదివరకు లక్నోలోను మొన్న ఫైజుపూరుకాంగ్రెసుమహాసభతోపాటు జరిగినయావద్భారత కిసాన్‌మహాసభలోను ఏకోన్ముఖానికి వచ్చాయి. ఆంధ్రులు యీకర్షకోద్యమంలో ముందంజవేయుట సంతోషకరమైనవిషయము. ఆంధ్రకిసాను నాయకుడు అధ్యక్షుడు కావడం ఆంధ్రులకు భావిభారతోద్యమములలోకూడ స్థానముగలదని తెలుపుతుంది. అఖిలభారతట్రేడుయూనియన్ కాంగ్రెసువారుకూడ కాంగ్రెసుతో కలిసి పనిచేయడానికి అంగీకరించారు. అయితే సామ్యవాదులు, కర్షకకార్మికపక్షములవారు కాం

గ్రెసుసంస్థలో తమసంఘాలద్వారా ప్రాతినిధ్యం కావాలంటారు. సామ్యవాదంపట్ల వీరిలోవీరికి యేమైన నభిప్రాయభేదములున్నను సామ్రాజ్యతత్త్వవ్యతిరేకపోరాటమునకు కాంగ్రెసుసహా వీరందరు ఒకటే అవా లంటారు. ఈ ఉద్యమానికి ప్రపంచపరిస్థితులు, ఆర్థికదుస్థితి దేశములోని జమీందారీ, రైత్వారీ, సాహుకారుపద్ధతులు, ప్రభుత్వంవారి ప్రజాభిప్రాయనిరసనం కూడా కారణాలు. రష్యాలో కార్మికకర్షకాభ్యుదయమునకై జరిగినచక్కటివిధానయుతమైనకృషి(Planned Economy) యువకులలో మరింత ఉద్దీపన కలుగజేసింది. అయితే భారతదేశానికి ఒకప్రాచీననాగరికత, విజ్ఞానం, వ్యక్తిత్వం ఉన్నదనిన్నీ, దానివిలువ నేడుకూడా ప్రపంచానికి ఉన్నదనిన్నీ, అంగీకరించేవారు. "రష్యాయే మాకు కాశీరామేశ్వరాలు" అనేవారితో ఏకీభవించరు. భారతదేశపు భౌతిక, ఆర్థికసమత్వం భారతపరిస్థితులనుబట్టి ప్రతిష్ఠించాలి. స్వాత్మలో విశ్వాత్మని చూపించే భారతవిజ్ఞానపీఠంమీద ఆర్థికసమత్వముయొక్క రూపురేఖలు రచించాలి.

1920 లో గాంధీజీ, తట్టి లేపినయీభావశక్తి యీవిధంగా అతితీవ్రగతిని ప్రయాణం చేస్తూంది. కాంగ్రెసు తొలిరోజులలో తీర్మానాలు, చర్యలు, యిప్పటివాటితో పోల్చుకుంటే భారతస్వతంత్రోద్యమం ఎంతవికసించిందో, ఎంతఅపూర్వసరళిని నడుస్తూందో గోచరిస్తుంది. ఎట్టిఅవరోధాలను లక్ష్యము

చేయని భావస్వేచ్ఛ, ఆదర్శోద్దీపనమాత్రం—కార్యశక్తి దీనికి తగినంతగా వృద్ధికావలసిఉన్నా—యీపదహారుసంవత్సరాలలో అద్భుతంగా లభించింది. బహుశా యింతభావవికాసం యింతత్వరగాయేదేశచరిత్రలోను కలుగలే దనుకొంటాను. జనసామాన్యశక్తులను యీ కాంగ్రెసు తనలో యిముడ్చుకుంటూ కార్మికకర్షకబలంతో శక్తిమంతంగా ఉద్యమించేసూచనలు కనుపించుచున్నవి. గాంధీగారు కాంపుటేబిలుసభలో జవాబిచ్చినట్లే జవహర్లాలుపండితుడు సంఘాలక్రింద దేశాన్ని చీల్చేసేవాళ్ళకు జవాబు చెప్పాడు.

"దేశమంతా కార్మికకర్షకమయమే. మహమ్మదీయరైతుకు హిందూరైతుకు ఏమిటి తేడా? వానిఆకలిదప్పికలకు, వీనిఆకలిదప్పికలకు ఏమిటి తేడా? ఈమతసాంఘికోద్యమాలు కొందరునాయకు లనుకొనేవాళ్లు తమస్వార్థం, భేషజాలకోసం బయలుదేరదీసి జనసామాన్యములోని అజ్ఞానాన్ని అవకాశంగా తీసికొని బాధిస్తున్నారు. నిజంగా ఎవరైతే యీరోజున జనసామాన్యముయొక్క దారిద్ర్యము, నిరుద్యోగము, అజ్ఞానాన్ని బాపి వారిని సంపూర్ణస్వతంత్రోద్యమపరంగా నడిపిస్తారో వారే నాయకులు. అట్టిది కాంగ్రెస్. అట్టికాంగ్రెసు కధ్యక్షుడనైన నేనే మహమ్మదీయులనాయకుడను. నువ్వుకావ"న్నాడు జిన్నాగారిని నిర్భయంగా. "ఆరువేలమైళ్లదూరములోనున్న బ్రిటిషురాజకీయవేత్తలున్ను, భోగలాలసులైె జనసామాన్యం

కోసమని ఎట్టిత్యాగమును చూపలేని యీసాంఘిక నాయకులా అల్పసంఖ్యాకులను రక్షించేది? వీరిమాటలు వారిలో కలతను వృద్ధిచేయుటకే సహాయపడుచున్నవి". అని సత్యాన్ని వచించాడు. ఇవన్నీ కాంగ్రెసుముందు నడవబోయేదాని సూచిస్తున్నాయి. జనసామాన్యముయొక్క ఆర్థికోద్ధరణపరంగా తీర్మానాలు చేయడమే కాకుండా కాంగ్రెసు స్వయంగా ప్రవర్తించాలనే ఉద్యమం కాంగ్రెసుచేత ఆమోదింపచేయగలిగినది జవాహర్లాలునెహ్రూ. ఇందులకు ప్రపంచరాజకీయాల్లో ఆరితేరి వాటిని నడుపడంలో అనుభవంగల ఎమ్. ఎన్. రాయి వంటి వాడుకూడ కాంగ్రెసులోకి వచ్చి తోడ్పడ్డాడు.

ఈగ్రంధం పూర్తిఅయ్యేనాటికి దేశంలో దృశ్యమానమైన అఖండఎన్నికలవిజయం, కాంగ్రెసు ఉద్యమాన్ని సభాపర్వంలోనికి తాత్కాలికంగా ప్రవేశపెట్టగలదు.

---

# విషయప్రవేశము-3.



## ఈస్టిండియాకంపెనీ మొదలు, మాంటెగూసంస్కరణాలవరకూ భారతరాజ్యాంగం యేలానడిచింది.

## (1765—1919)

1765 సం॥లో 'యీస్టిండియాకంపెనీ' వారు ఢిల్లీచక్రవర్తిఅయిన 'షాఆలం' వద్ద బెంగాలు, బీహారువగైరా ప్రాంతాలలో ఆయనతరఫున పన్నువసూలుచేయుటకై పొందినఫర్మానాతో భారతదేశములోని బ్రిటిషురాజ్యాంగచరిత్ర ప్రారంభమైనది. కంపెనీవారు అనగా బ్రిటిషుపార్లమెంటు ఆమోదంతో హిందూదేశంతో వర్తకముచేసుకోడానికివచ్చిన ఆంగ్లేయుల సంఘము. ఈసంఘపు 'డైరెక్టర్లు' సీమలోఉండి యిచ్చేఉత్తరువుల ప్రకారం యీకంపెనీవారు భారతదేశములోని ఆయాస్థలముల లో వర్తకస్థలాలు నిర్మించుకొని వ్యాపారం చేసుకొనుచుండిరి. వర్తకానికొచ్చిన యీసంఘానికి రాజ్యలాభం యేలాకలిగిందీ విదితమే కనుక రాజ్యాంగపరిణామాన్ని తెలిపే యీగ్రంథంలో అది అనవసరం. పార్లమెంటు వర్తకంచేసికోడానికి వీరికిచ్చే అధికారపత్రాన్ని 'ఛార్టరుచట్టము' అంటారు.

ఆంగ్లన్యాయశాస్త్రప్రకారం వ్యక్తి లోకదేశంలో శాంతమార్గాలమీద ప్రదేశం సంపాదించినా అందులో ఉండే ప్రజలు పార్లమెంటుతో గూడిన రాజుగారి అధికారంలోనివారే

ఇక యుద్ధాల్లోజయిస్తే దేశం, ప్రజలూకూడా రాజుగారివే. ఈసిద్ధాంతాన్నిబట్టే భారతదేశంలో కంపెనీసంపాదించిన ప్రదేశాల్లోనిప్రజలమీదిపాలనలో జోక్యంపుచ్చుకుంటుంది బ్రిటిషు పార్లమెంటు. ఇంతేకాకుండా పార్లమెంటు ఫర్మానాలేకుండా కంపెనీవారికి యీవిదేశంలో రక్షణ ఉండదు. సదరు ఫర్మానా కావలసిన కంపెనీవారు పార్లమెంటుషరతులకులోబడాలి. పార్లమెంటువారు కంపెనీ కొకసారియిచ్చినఫర్మానా గడువుఅయిపోయినప్పుడు తిరిగి గడువును కంపెనీవారు కోరేవారు. కంపెనీపాలనలో కొన్నిమార్పులు సూచించి తిరిగి గడువుయిచ్చేవే ఛార్టరుచట్టాలు. ఇవికాక పార్లమెంటుదృష్టిలోనికివచ్చిన కంపెనీపాలనలోని అక్రమాలను సరిజేస్తూ పార్లమెంటువారే కొన్నిశాసనాలు చేసేవారు. ఇవి 'రెగ్యులేటింగు చట్టాలు' ఒకప్పుడు కంపెనీవారే పార్లమెంటును ఋణం, ధనసహాయం కోరేవారు. ఆ అవకాశం పుచ్చుకునికూడా పార్లమెంటు కంపెనీపాలనలో జోక్యం పుచ్చుకొనుచుండేది.

బ్రిటిషుకంపెనీవారికి యీదేశంలో రాజ్యాలు చిక్కిన మొదటిలో కంపెనీడైరెక్టర్లు కేవలం తమప్రాపకులినే అధికారులుగా పంపించేవారు. వారు ప్రజలపై చేసేవత్తిడి, అధికారం చెప్పనలవికాదు. గవర్నరు, గవర్నరుజనరలు పేరునకున్నా వ్యక్తినిరంకుశప్రభువులు వీరు. ఇక యింటివద్ద కంపెనీడైరెక్టర్లకు ఒకప్రెసిడెంటుండేవాడు. ఈయన అక్కడ సర్వా

ధికారి. ఎక్కడికక్కడ చీలికలై పోయి కేంద్రప్రభుత్వబలంలేని ఆనాటిభారతదేశంలో ప్రజలబాధలు తీర్చేవా రెవరు? అప్పు డు ఆందోళన యేది? కాంగ్రెసు యేది? ఆనాటిదీనభారత దేశాన్నిగురించి కంపెనీవారు చేసేఅక్రమాలు పార్లమెంటులో యే 'జాన్ బ్రైటో' ఏ ఫాక్సో' వెల్లడిస్తే తప్ప అసలు లో కానికి తెలియడానికే వీల్లేదు.

1773 సం॥ రిగ్యులేటింగుచట్టంక్రింద "హిందూదేశము లోని కంపెనీపాలనం చాలఅక్రమాలతో నిండియున్నందున" పార్లమెంటు జోక్యము పుచ్చుకోవలసి వచ్చింది. ఈచట్టము మొదలు పార్లమెంటుక్రిందకు యీదేశం వచ్చేవరకు (1858) ఆయాదశలలో పొందినమార్పులకు లోబడి అప్పటిరాజ్యాంగం యీక్రిందివిధంగా ఉంది—బంగాళాగవర్నరే గవర్నరుజనరలు. ఇతడు యిద్దరుసభ్యులతోగూడిన సమాలోచనసంఘంతో చట్ట ములను చేయును. వాటికి అప్పుడు 'రిగ్యులేషను'లని పేరు. ఈ గవర్నరుజనరలుకు లోబడి మదరాసు, బొంబాయి, రాష్ట్రములలో గవర్నరులు ఆలోచనసభ్యులసంఘంతో పాలిం చుచుండిరి. వీటిని 'కార్యవర్గా'లంటారు. 1853 సం॥ చట్టప్ర కారం శాసనాలు చెయ్యవలసి వచ్చినప్పుడుమాత్రం యీకా ర్యవర్గానికి ఒకన్యాయశాస్త్రజ్ఞుని సభ్యునిగా చేర్చుకొనుచుం డిరి. అప్పటినుంచియే "శాసనసభ" అనేది వచ్చినది. కాని యీగవర్నర్లకు గవర్నరుజనరలుకు తమఆలోచనసభ్యులను,

సేనాధిపతినికూడా త్రోసిపుచ్చే అధికారం ఉండేది. కొంత కాలముకు యీఆలోచనసభ్యులు కంపెనీవారి యిష్టమువచ్చినట్లుగాక కంపెనీసేవానుభవముగలవారిని వేయవలసివచ్చింది. పైగా క్రిందిఉద్యోగస్థులు దేశాన్ని పీడించి స్వంతంగా వ్యాపారాలు చేసుకుంటూ, లాభాలు పొందుచుండిరి. ఎందుకూ పనికిరాని సీమదేశంలోని పర్బాయిలుకుకూడా ప్రాపకంమీద హిందూదేశంలో ఉద్యోగా లివ్వడమే యిందులకు ముఖ్యకారణం. అప్పు డొకపద్ధతి యేర్పడెను. 500; 1500; 3000; 4000 పౌనులు (సాలుకు) జీతంపొందేవారు 3, 6, 9, 12 సంవత్సరాలు వరుసగా యిదివరలో కంపెనీసర్వీసులో ఉండాలి. ఈ జీతాలు వారి కప్పుడు గిట్టేలంచాలపరిమితికి పెట్టబడ్డాయేమో!

సీమలో డైరెక్టర్లు యిష్టమువచ్చినవారిని గవర్నర్లు, గవర్నరుజనరలుగాను, అధికారులుగాను పంపించడం క్రమేణా తగ్గించబడింది. 1853 సం॥కు పరీక్షలుకూడా పెట్టబడవి. కంపెనీ డైరెక్టర్లపైన తనఖీకి ఒకసంఘం (కంట్రోలుబోర్డు) యింతకు పూర్వమే పార్లమెంటువారు నియమించారు.

స్థానికపాలనము:- అప్పటిమదరాసురాజధానిలోని పాలనాపద్ధతిని కొద్దిగా విశదపరుస్తాము. దిండిగల్, బారామహాల్ లు కంపెనీవారు సంపాదించినది మొదలు క్రమమైనపాలన ప్రారంభించింది. ఆసమయంలో యీసర్కారుల (తూర్పు, పశ్చిమ, కృష్ణా, గుంటూరు వగైరాలు) పాలన చాలాఅవినీతి

గా నుండెను. 1786 సం॥లో రివిన్యూబోర్డు ఏర్పడింది. 1794 సం॥లో యీబోర్డుక్రింద జాగీరుకలెక్టర్లని నియమింపబడ్డారు. (ఏరాజు, జమీందారుదగ్గిర పొందినభాగం, ఆపేరుతో జాగీరని పిలిచేవారు). ఈకలెక్టర్లు రైతులతో స్వయంగా సంబంధం పెట్టుకోవలసిందని సూచనలు అప్పటికున్ను కలవు. కాని, బెంగాలులో కారనువాలీసు పెట్టినపద్ధతే యిక్కడకూడా అనుసరించాలని ఉత్తరువులు పుట్టాయి. అందుచేతనే 1802–4 లోగా యీ రాజధానిలోకూడా 'పెర్మనెంటు సెటిలుమెంటు' పైన జమీందారీపద్ధతి వచ్చింది. జల్లాజడ్జీలకే పోలీసు, మేస్ట్రేటుఅధికారాలు యివ్వబడ్డాయి. (ఆకాలంలో సీమదేశంలో పద్ధతికూడా యిట్లే ఉండేది.) వారిమీద సంచారంచేసే రాజధానిన్యాయస్థానాలు-అప్పీలుఅధికారం కలిగి ఉండేవి. అప్పుడు జమీందారులు మొదలగువారివలన రైతులకు కలుగుచున్న బాధల నుంచి రక్షించుటకై చేయుబడిన నిబంధన లేమీ పనికిరాలేదు. కాని కంపెనీవారియొక్క రాజ్యక్షేమానికి, పరిపాలనయొక్క న్యాయసౌకర్యాలకు పైపద్ధతులు సరిపడలేదు. కొంతకాలం గ్రామకవులుపద్ధతి జమీందారీపద్ధతిస్థానే ప్రవేశపెట్టబడినది. చివరకు 'మన్రో'గారి రైత్వారీపద్ధతి రివిన్యూవిధానములో అంగీకరించబడినది. మధ్యవాళ్లను తప్పించి, రైతుకు, గవర్నమెంటుకు సరాసరీగా సంబంధ మేర్పడింది దీనివల్ల. జిల్లాలో రివిన్యూఅధికారిఅయిన కలక్టరుపరంగా యింతటినుంచి అధి

కారమంతా మొగ్గడం ప్రారంభించింది. మేజస్ట్రీటు, పోలీసు అధికారాలు జడ్జీలనుంచి కలెక్టరుల కిచ్చారు. కంపెనీపాలన వచ్చినక్రొత్తలో దేశంలో ఉన్నగ్రామపంచాయితీలను పూర్తిగా నిరసించిరి. అందువలన పాలనకు ఖర్చు లెక్కువగుట, వీరు యేర్పరచినజిల్లాజడ్జీలకు యీదేశన్యాయం తెలియకపోవడం జరిగింది. తిరిగి పంచాయితీలద్వారా విచారణం అంగీకరించారు ముఖ్యవిషయాల్లో తప్ప వీరిపైన అప్పీలుఅధికారముకూడా జిల్లాజడ్జీలకు లేదు (1816) ఇంతకుపూర్వం తాలూకాలలో అధికారులుగా పోలీసు "దారోగా"లుండేవారు. ఆస్థానాలను రద్దుచేసి జిల్లాకలెక్టరుల రివిన్యూసిబ్బందివారే గ్రామఉద్యోగులద్వారా వ్యవహరించుట మొదలుపెట్టారు. ముఖ్యస్థలాల్లో మునసబుకోర్టులు రు 200-లవరకు కిమ్మతుచేసే కేసులను తీర్చుటకు నియమించబడెను. గ్రామమునసబు చిన్నదావాలను గ్రామపంచాయితీలు పార్టీలంగీకరిస్తే ఎంతవిలువైనదావాలైనను విచారించవచ్చును.

1843 సం॥ లో రాష్ట్రసంచారన్యాయస్థానాలు రద్దుచేయబడ్డాయి. జిల్లాలలో సివిలు సెషన్సుజడ్జీలు యేర్పడ్డారు. అప్పటిఆఖరున్యాయస్థానంకు సివిలుహోదాలో సద్దర్ అదాలత్ అనిన్నీ క్రిమినలుహోదాలో 'సద్దరుఫౌజుదారీ అదాలత్' అనిన్నీ పేరు. ఇందులో గవర్నరుసభలోని ఒకసభ్యుడు అధ్యక్షుడుగాను కొందరు జడ్జీలు ఉండిరి. 1827 సం॥ నుంచి 'నేటి

వు'లను జడ్జీలుగా నియామకం సివిలు క్రిమినలులో జరుగుతుం డేను. 1801 సం॥ మదరాసుఛార్టరుప్రకారం 'సుప్రీముకోర్టు' వచ్చింది. ఇది అంతకుపూర్వపు 'రికార్డరు కోర్టు'స్థానే వచ్చింది.

1853 వ సం॥ రములో జరిగినసంస్కరణములప్రకారము "పార్లమెంటు యింకోవిధంగా యేర్పాటుచేసుకొనేవరకు" కంపెనీచేతుల్లోనే చాలమట్టుకు సాధ్వీనమైనభారతదేశపరిపాలనను ఉంచుకోవలసింది అని శాసించబడింది. ప్రథమదఫా శాసనసభఅనేది అమలులోనికి వచ్చింది. కలకత్తాలో గవర్నరుజనరలు, ఆయన మామూలు ఆలోచనసభ్యులు నలుగురుగాక సేనాధిపతి; బంగాళాన్యాయాధిపతి, సుప్రీముకోర్టు జడ్జి, కంపెనీ సేవకులలో నలుగురు—వీరు శాసనసభగా వ్యవహరింపబడుచుండిరి. ఈసభకు కాలపరిమితి రెండుసంవత్సరములు. వీరు లేకుండ కేవలం గవర్నరుజనరలు మామూలుసమాలోచన సభ్యులు కలిసి కార్యవర్గం. శాసనసభవారిసభలు బహిరంగంగా జరగడం, వృత్తాంతం ప్రచురించడం కూడాయిప్పటినుంచే. ఇప్పటినుంచే అధికారులు కేవలం ప్రాపకాలనుబట్టి యేర్పడడం పోయింది. పరీక్షలువచ్చాయి. కాని పెద్దఉద్యోగాలకింకా భారతీయుల కర్హతలేదు. రాచకీయం, నిత్యపరిపాలన, సైనికవిషయాల్లోయీప్రభుత్వానికి పార్లమెంటుశాసనాధికారంయిచ్చింది

1854 సం॥ లో కంపెనీవారి పాలనలోనే 'సిపాయిలవిప్లవం' వచ్చింది. 1854 సం॥లో బ్రిటిషుపార్లమెంటువారే పరి

పాలనా బాధ్యతను గైకొనిరి. పిమ్మట 1858 సం॥లో వచ్చిన ఇండియా ప్రభుత్వ చట్టప్రకారం, స్వదేశసంస్థానాధిపతుల రాజ్యాధికారం, వారితో పూర్వం జరిగిన సంధి, ఒడంబడికలు అంగీకరించబడినవి. మతసహనము, వ్యక్తిస్వాతంత్ర్యము ప్రకటించబడినది. పూర్వపు రాజులిచ్చిన దానాలు, సాంప్రదాయములు, గౌరవించబడతాయని ప్రకటించబడింది. తెల్ల, నల్లభేదాలు, మతభేదాలులేవని, అందరు బ్రిటిషు పౌరులుసమానార్హతగలవారని ప్రకటించబడింది. పూర్వపుకంపెనీ రద్దుచేయబడి వారిఅప్పులన్ని భారతదేశంమీద మోపబడ్డాయి. కంపెనీకంట్రోలుబోర్డుస్థానే 15 గురు సభ్యులతోకూడిన 'యిండియామంత్రి' ఏర్పడ్డాడు. ఈయన భారతపరిపాలనకు చెందిన అన్నిపగ్గాలను తనచేత నుంచుకొని పార్లమెంటుకు జవాబుదారీ వహించాలి. కాని ఆసభ్యులమాటలను త్రోసివేయవచ్చును.

1861 సం॥రపు భారతకౌన్సిల్సు చట్టము:—పార్లమెంటువారు పిమ్మటచేసిన యీచట్టప్రకారం గవర్నరుజనరలుయొక్క కార్యవర్గం అయిదుగురు. దేశీయ, శాసన, ఆర్థిక, వ్యవసాయం పబ్లికువర్క్సు, పరిశ్రమలు, విద్య, సేవ అనే శాఖలక్రింద పరిపాలన విభజింపబడింది. క్యాబినెట్టుపద్ధతి అనుసరింపబడుచుండెను. కాని గవర్నరుజనరలు వారిని తిరస్కరింపవచ్చును. ఈ రోజులలో ఉద్యోగకాలంలో గవర్నరుజనరలు భారతదేశాన్ని వదలుటకు వీలులేదు.

శాసనసభ:—శాసనకార్యములనిమిత్తం రెండుసంవత్సరములవరకున్ను ఆరుగురకు తక్కువకాకుండా పన్నెండుగురకు మించకుండా పైనుండి సభ్యులను గవర్నరుజనరలు ఏర్పరచవచ్చును. కార్యవర్గమున్ను వీరున్ను కలసి శాసనసభగా ఏర్పడేవరు. చట్టప్రకారం భారతీయులనునియమించవలెనని లేకపోయినను యిప్పటినుంచియే భారతీయులకు శాసనసభలలో స్థానంకలిగింది.

రాష్ట్రప్రభుత్వము:—గవర్నరు, పన్నెండుసంవత్సరాలసర్వీసుఅనుభవంగల యిద్దరుసభ్యులు కలసి కార్యవర్గం. నలుగురకు తక్కువకాకుండా యెనమండుగురకు మించకుండాపైనుండి సభ్యులను గవర్నరుగారు నియమించాలి. కాలపరిమితి రెండు సంవత్సరాలు. ఇందులోసగం అధికారేతరులుండాలి. ఈసభ్యులు కార్యవర్గముకలిసి రాష్ట్రశాసనసభ అనిపేరు. ముఖ్యంగా యిది మన మదరాసులోని పద్ధతి.

1885 సం॥రంలో కాంగ్రెసుపుట్టింది. 1890 సం॥రంలో 'చార్లెసుబ్రాడ్లా'గారుపార్లమెంటులో ఇండియా హోమురూలుబిల్లుపెట్టి గౌరవప్రదమైన ఓటమి నెదుర్కొన్నారు. ఈకాలములో రాజప్రతినిధి 'రిప్పన్'గారు. ఈయనకాలంలోనే స్థానిక పరిపాలన భారతీయులవశంకావడంప్రారంభం. మదరాసు, బొంబాయి, కలకత్తా కార్పొరేషనులకు ఎన్నికలు ప్రారంభం. జిల్లాబోర్డులు, తాలూకాబోర్డుల నిర్మాణం ప్రారంభం.

1892 సం॥రం చట్టము:—సామ్రాజ్యశాసనసభలోని పైనుండి నియమింపబడే సభ్యులసంఖ్య 16 గురవరకు పెంచబడింది. ఇందులో పదిమంది అధికారేతరులు. ఇందులో అయిదుగురిని మదరాసు, బొంబాయి, బంగాళం, సంయుక్తరాష్ట్రం పశ్చిమోత్తరరాష్ట్రముల శాసనసభలు ఎన్నుకొంటాయి. మిగతావి నామినేషనువల్ల పూర్తిచేయబడును. సభలో బడ్జెటు విమర్శించడాని కవకాశం యిప్పుడు కలిగింది. "ప్రభుత్వాని కిబ్బంది కలుగకుండా చూచుకుంటూ" ప్రశ్నలుకూడా సభ్యులడుగవచ్చును.

ఇకరాష్ట్రములలో:—అధికారేతరులసంఖ్య 20 వరకు పెంచబడినది. రాజధానినగరమునకు, వర్తకసంఘానికి ఒక్కొక్కస్థానం వచ్చింది. మిగతాస్థానాలు మునిసిపాలిటీలు, జిల్లా బోర్డులు సూచించినవారిని గవర్నరు నామినేషను చెయ్యాలి. ఒకవిధమైన యెన్నికపద్ధతి ప్రథమతః యిప్పుడే విధానములోనికి ప్రవేశించింది. కార్యవర్గముపైని శాసనసభ కెట్టి అధికారమును లేదు. ప్రశ్నలు, ఉపప్రశ్నలు అడుగవచ్చును. బడ్జెటు ప్రభుత్వము శాసనసభలో ప్రవేశపెట్టుట, వాటిమీద ప్రశ్నించడం, చర్చించడముకు కూడా అవకాశం వచ్చింది.

అప్పటిపద్ధతియేమనగా ఆర్థికవిషయాలన్నీ కేంద్రప్రభుత్వంలోనివే. ఇండియాప్రభుత్వంతో చెప్పకుండా రాష్ట్రంవారు ఏశాసనం చేయకూడదు. ఇండియాప్రభుత్వంనా రిండియా

మంత్రితో యోచించాలి. రాష్ట్రబడ్జెట్టులుకూడా ఇండియా మంత్రికార్యాలయంలో తయారయ్యే కాలమది.

## 1909—1912 'మింటోమార్లే' సంస్కరణములు:—

ఇవి మూడు సూత్రాలపై నిర్మించబడ్డాయి. బాధ్యత అనేది ఇండియా మంత్రి చేతుల్లోంచి నికరంగా కేంద్రప్రభుత్వమునకు దిగింది శాసనసభలు కార్యవర్గవశంలో ఉండాలి. పరిపాలనకు ఆఖరుబాధ్యత బ్రిటిషుపార్లమెంటుది. శాసనసభవారితీర్మానాలు మొదలైనవి తిరస్కరించే అధికారం యింతవరకు గవర్నరునకు గాని, కార్యవర్గమునకుగాని అంతగా లేదు. ప్రజాప్రతినిధుల సంఖ్య శాసనసభలలో ఒకమూల వృద్ధిచేస్తూ, మరియొకమూలనుంచి అధికారం కార్యవర్గం చేతుల్లో ఘనీభవిస్తూంది.

ఈసంస్కరణాలప్రకారం గవర్నరుజనరలు కార్యవర్గమునకు ఆరుగురు సభ్యులు. శాసనసభకు 69 గురు సభ్యులు— 9 గురు అధికారులు, 33 గురు నామినేషను, 27 గురుఎన్నికవల్ల రావాలి. ఇందులో 13 గురు రాష్ట్రశాసనసభలోని అధికారేతరసభ్యులచేత ఎన్నుకొనబడుదురు. భూస్వాములు, వర్తకసంఘములకు, మహమ్మదీయులకు, ప్రత్యేక నియోజకవర్గాలు కల్పించబడ్డాయి యిప్పటినుంచే. ఆప్రకారం ఆరుగురు భూస్వాములపక్షమున, అయిదుగురు మహమ్మదీయులపక్షమున, ఒకరు మహమ్మదీయభూస్వాముల పక్షమున, ఇద్దరు వర్తకసంఘపక్షమున ఎన్నుకోబడాలి.

రాష్ట్రములలో:—పైనుండి వచ్చేసభ్యులు 30 కి తక్కు వకాకుండా ఉంటారు. పెద్దరాష్ట్రములలో 50 వరకున్ను యీ సంఖ్యగలదు. గవర్నరునామినేషను అక్కరలేకుండా స్థానిక సంస్థలు వగైరాలు యింకను నియోజకవర్గాలు. రాష్ట్రశాసన సభలలో అధికారేతరులమెజారిటీ యీచట్టమువలననే కలిగిం చబడింది.

కేంద్రశాసనసభలో ఆర్థికవిషయాలుకు చర్చావకాశం యేర్పడింది. గవర్నరుజనరలు సాలుసరి జమాఖర్చు అంచనాలు శాసనసభకు నివేదించాలి. సభ్యులు చర్చించవచ్చును. క్రొత్త పన్నులు, ఋణాలునుగూర్చిసూచనలు, ఎగతీతలు, దిగతీతలు ను చేయవచ్చును. స్థానికప్రభుత్వాలు గ్రాంటులను కోరవచ్చు ను. శాఖాసభ్యుడు సమాధానం చెప్పాలి. కాని, యీతీర్మా నాలు కేవలం సలహాలుమాత్రమే. మొత్తం బడ్జటంతా చర్చిం చవచ్చును గాని, ఓటుకు బెట్టరాదు. ఈచర్చలలోనుంచి సేన, రాచకీయ, రాష్ట్రవ్యవహారాలు, ఆదాయపుపద్దుక్రిందవచ్చే, స్టాంపులు, కష్టమ్సు, పన్నువిధింపులు, కోర్టులనుగూర్చిన్నీ, ఖర్చుపద్దుక్రిందవచ్చే కంపెన్ సేషన్లు, భారతఋణముపై వడ్డీ క్రైస్తవమతం, ప్రభుత్వపురైళ్ళు, వీటినిగూర్చిన్నీ, చర్చ పనికి రాదు. ఇంతేకాక గవర్నరుజనరలు స్వతంత్రంగా వ్యవహరించి నఅంశాలు (చట్టబద్ధం కాకుండా ఆలా వ్యవహరించడానికి అవ కాశం ఉన్నది.) విదేశవ్యవహారాలు, సంస్థానాలు, కోర్టులలో

పెండింగుగానున్న అంశాలనుగూర్చి శాసనసభ్యులు తలపెట్టరాదు. ఏదైన ఒకవిషయమును ప్రజాక్షేమానికి భంగకరమని గాని, రాష్ట్రసభలో పెట్టదగినదని గాని శాసనసభలో ప్రతిపాదించకుండా గవర్నరుజనరలు అడ్డవచ్చును.

రాష్ట్రాల్లోపద్ధతి:—చిత్తుబడ్జెట్టు ముందు యిండియా ప్రభుత్వంతో చర్చించి నిర్ణయించాలి. 5000 లకుపైబడ్డ క్రొత్తప్రాజెక్టులు వారి ఆమోదం పొందాలి. పిమ్మట ఆబడ్జెట్టు సగంమంది ఎన్నికసభ్యులు గల ఉపసంఘంలో యోచించాలి. ఆప్రకారం తేల్చబడినబడ్జెట్టు యిండియాప్రభుత్వంవారు తమ బడ్జెట్టులో కలుపుకుంటారు. అనగా రాష్ట్రబడ్జెట్టులంటూ యింకా కేటాయింపు కాలేదు. ఇండియాగవర్నమెంటువారేదైనా అందులో మార్పులు చేస్తే ఆమార్పులు రాష్ట్రాలుకూడా చేసుకుంటాయి.

పైప్రకారమే రాష్ట్రశాసనసభ్యులు తీర్మానాలు వగైరా ప్రవేశపెట్టవచ్చును. శాసనసభాధ్యక్షుడు తీర్మానాలు నిరాకరింపవచ్చును. రాష్ట్రశాసనసభలో ఉపప్రశ్నలుకూడా వేయవచ్చును. ప్రాముఖ్యవిషయములు తటస్థించినపుడు వానిని యోచించుటకు సభను తాత్కాలికముగా వాయిదా వేయమని తీర్మానాలు పెట్టవచ్చును. (అడ్జర్నమెంటుతీర్మానాలు.)

మదరాసు, బొంబాయిలలో కార్యవర్గసభ్యులసంఖ్య 4 గురువరకు పెంచబడినది. శాసనసభల కుపాధ్యక్షులుకూడ నియమించబడ్డారు.

స్వపరిపాలనగాని, పార్లమెంటరీపద్ధతిగాని, ప్రవేశపెట్టాలనే ఉద్దేశం తనకు లేదని యీసంస్కరణాలకాలంలో మంత్రి 'మార్లే'ప్రభువుగారు ప్రకటించారు. అతివాదులు, అరాజకులను అణచడానికిన్ని పైతరగతులవారియొక్కయు, మతాభిమానులయొక్కయు సహకారము పొందడానికిన్నీ మాత్రమే యీసంస్కరణాలు యిచ్చామన్నారు.

1911 సం॥లో బ్రిటిషురాజుగారు చక్రవర్తిగా భారతదేశానికి వచ్చారు. స్థిరం అయిపోయిం దనుకున్న బంగాళా విభజన రద్దుచేశామని ప్రకటించారు. రాజధాని ఢిల్లీకి మార్చారు. మహమ్మదీయులకు ప్రత్యేకనియోజకవర్గాలు పెట్టిం దీసంస్కరణాలే. హిందూమహమ్మదీయభేదానికి యివి మొలకల్లా ఉపచరించాయి. దీనిని రద్దుపరచుమని 24 1-1911 తేదీని సామ్రాజ్యశాసనసభలో వచ్చినతీర్మానం మహమ్మదీయుల అసమ్మతిని పెంచింది. ఈసంస్కరణాలు కేవలం సభ్యులసంఖ్యను వృద్ధిచేయుటతప్ప క్రియలో 1892 సం॥పు సంస్కరణలకంటె అభివృద్ధిని చూపలేదు. అందు చేతకూడ అతివాదపక్షం ప్రబలింది. కాని, 'గోక్లే' మహాశయునివంటివారు "ఉదారమైన సూచనలు" అని వీటిని ప్రేమించినరోజు లివి. ఈసమయములోనే రాష్ట్రగవర్నరుల కార్యవర్గములోను, గవర్నరుజనరలు కార్యవర్గములోను, ఇండియామంత్రిసభలోను, ఒక రిద్దరు నల్లవాళ్ళనుకూడా నియమించారు.

1919 సం॥పు ఇండియాగవర్నమెంటు చట్టము:— ఈచట్టమునకు పూర్వము 1917 సం॥ ఆగస్టులో "క్రమసోపానములపైన బాధ్యతాయుతపరిపాలనను భారతదేశానికి యివ్వడం, యిందునిమిత్తం భారతీయులకు ప్రభుత్వంతో సంబంధం ఎక్కువగా కలుగజేయడం," అనేమొదలైనసంగతులతో భారతరాజ్యాంగచరిత్రలో కాంగ్రెసేకాక బ్రిటిషువారుకూడ స్వపరిపాలనయే యీదేశముయొక్క గమ్యమని ధ్రువపరచి ప్రకటన చేశారు. దీనిప్రకారం 1918 సం॥లో రాజప్రతినిధి 'చెలమ్సుఫర్డు'ప్రభువు, ఇండియామంత్రి 'మాంటేగూ'గారు కలిసి యీ ప్రకటన వారిమతంలో ఎల్లా అమలు జరుపదలచినారో తెలుపుచు ఒకనివేదిక తయారుచేశారు. ఆనివేదికపైన కాంగ్రెసువారు తదితరపక్షాలు విమర్శలుచేస్తూ తమసూచనలు చేశారు. వీరంతా సీమదేశం పోయి పార్లమెంటుకమిటీయెదుట సాక్ష్యాలిచ్చారు. ముఖ్యమైనస్థలాల్లో వీరిసూచన లేవి గమనింపబడలేదు. ఇవే ఇంకా కొంత సంకుచితపరచబడి 1919 సం॥ ఇండియాచట్టముగా పార్లమెంటువారిచే అంగీకరించబడ్డాయి.

ఈబాధ్యతాయుతపాలనం స్థానికపాలనంలో పూర్తిగాను రాష్ట్రములలో కొంతవరకున్ను, కేంద్రశాసనసభలో ఎన్నికసభ్యుల మెజారిటీ వచ్చునట్లున్ను, యిండియామంత్రి ప్రత్యక్షంగా చలాయించే కొన్నిఅధికారాలు కేంద్రరాష్ట్రప్రభుత్వముల పరంగా తగ్గించుట; ఆమంత్రి, అతని ఆలోచనసభ్యులజీతములు,

బ్రిటిషుప్రభుత్వం భరించుట, మూలముగా ప్రవేశపెట్టబడినది. ఆదాయశాఖలను కేంద్రముకు, రాష్ట్రములకు విభజించుట, ఇదిగాక రాష్ట్రములు కేంద్రానికి తమఆదాయంలోనుంచి కొంతభాగం కట్నాలక్రింద యివ్వడం కలిగింది. ఇల్లే పరిపాలనాశాఖలు కేంద్రశాఖలనిన్నీ రాష్ట్రిశాఖలనిన్నీ ప్రథమదఫా విడదీశారు. ఈరాష్ట్రిశాఖలు స్వాయత్తశాఖలనిన్నీ ప్రజాయత్తశాఖలనిన్నీ విడదీసి మొదటివి గవర్నరుగారు నియమించిన కార్యవర్గసభ్యులు గవర్నరుగారికిమాత్రమే బాధ్యులై పాలించునట్లున్నూ రెండవది గవర్నరుగారు శాసనసభలోనుంచి యేర్పరచినమంత్రులు శాసనసభకు బాధ్యత వహించి పాలించేటట్లున్నూ, యేర్పరచారు. అయితే సిద్ధాంతంలో యీమంత్రులుకూడ రాజుగారిప్రతినిధియైన గవర్నరుగారి సలహాదారులే.

సివిలుసర్వీసును యావద్భారతరాష్ట్రిశాఖలక్రింద విభజించుట, శాసనసభలో 'స్టాండింగుకమిటీ' లనుపేరుతో శాసనసభ్యులకు పరిపాలనా శాఖలతోసంబంధము కల్పించుట, శాసనసభ్యులను సభాకార్యదర్శులనుగా నియమించుట, మొదలైన ప్రజాబాధ్యత, ప్రజాసంబంధము సూచించేమార్పులు జరిగినవి.

దీనితోపాటు శాసనసభవారిపైనను, శాసనసభాధ్యక్షునిపైనను, రాష్ట్రిమంత్రివర్గంపైనను వారిసూచనలు మార్చుచేయుట, త్రోసివేయుటఅనే అధికారాలున్నూ ప్రత్యేకఅవసరములకు ఆర్డినెన్సులు చేయుటఅనే అధికారాలున్నూ, గవర్నరులకు,

గవర్నరుజనరలులకు మరింతపదిలంగా యివ్వబడ్డాయి. సివిలు, మిలిటరీసర్వీసువారి పెన్షన్లు, జీతాలు వగైరాలలో మార్పు జరుగకుండా కట్టుబాట్లు చేయబడ్డాయి.

బెంగాలు, ఒరిస్సా, మధ్యపరగణాలు, సంయుక్తరాష్ట్రాలు, పంజాబు, పశ్చిమోత్తరరాష్ట్రములు గవర్నర్లరాష్ట్రముల క్రింద ఏర్పర్చబడ్డాయి. వీటికిన్నీ శాసనసభలు, మంత్రివర్గాలు ఏర్పడ్డాయి. ఇవి ఇందలి సారాంశాలు.

## రాష్ట్రములలో

ఈచట్టప్రకారం రాష్ట్రిశాసనసభలకు నియోజనాధికారం యిలాఉంటుంది. వచ్చుబడిపన్ను, ఏవిధమైనస్థానికపుపన్ను యిచ్చినా ఓటు. స్త్రీలకుమాత్రం రాష్ట్రిపరిస్థితులనుబట్టి ఆప్రభుత్వాలు ఓటింగుహక్కు ఏర్పరచాలి. పెన్షనుసహా సేనలో నున్నా, తదితర ఉద్యోగంలోఉన్నా ఓటింగుహక్కు.

భూస్వాములు కార్మికులు, విశ్వవిద్యాలయం, కాఫీతోటలు, వర్తకం మొదలైన యితరవిద్యా, వృత్తి నియోజకవర్గాలు కలవు. మహమ్మదీయ, క్రైస్తవ, ఆంగ్లో, హైందవ,యూరోపియన్, సిక్కు మొదలైన సాంఘికనియోజకవర్గాలున్ను కలవు. బ్రాహ్మణేతరులకుమదరాసులాంటిచోట్ల ప్రత్యేకస్థానాలున్ను (నియోజకవర్గంకాదు) ఇవ్వబడ్డాయి. నియోజకవర్గాలు బహుస్థానాలు (Plural member constituencies) బ్రిటిషుపౌరుడుగా ఉండడం, 120 రోజులు నియోజకప్రదేశం

లో కాపురం, 21 సం॥ నిండినవయస్సు కలిగి ఉండడం, యీమూడున్ను ప్రతివానికిని ఉండవలసిన సాధారణ అర్హతలు.

రాష్ట్రశాసనసభలనిర్మాణం-అధికారబాధ్యతలు :—

శాసనసభలో 100 కి 20 కంటె నామినేషను లుండకూడదు. మిగతావి ఎన్నిక. శాసనసభ్యులసంఖ్య బాగా పెంచబడింది. మదరాసులో 127. బెంగాలు 111. బొంబాయి 139 సంయుక్త రాష్ట్రములు 123. పంజాబు 93. బీహారు 103. మధ్యపరగణాలు 70. అస్సాము 50. శాసనసభ కాలపరిమితి 3 సం॥లు. గవర్నరు దానిని మరియొకసంవత్సరం పొడిగించవచ్చును. క్రొత్తసభ సమావేశపరచడానికి గవర్నరుజనరలు అనుమతితో 6 నెలలు, ఇండియామంత్రిఅమోదంతో 9 నెలలు ఆలస్యంచేయవచ్చును. సభను సమావేశపరచుట, సమాప్తి చేయుట, గవర్నరుకే చెల్లును. అధ్యక్షుడు ప్రత్యేకం యేర్పడతాడు. ఈచట్టముకు పిమ్మట 4 సం॥ల అనంతరం అధ్యక్షుడు సభవారిచేత ఎన్నుకోబడాలి. అధ్యక్షునికి సభను వాయిదావేయుటకు హక్కుగలదు. ఈఅధ్యక్షుణ్ణి గవర్నరు అనుమతితో సభవారు తీసివేయవచ్చును.

సభవారు తమవశంలో ఉన్న శాఖల్లో గాక పైగా క్రొత్త పన్నులు విధించుట, భారతీయఋణం, కష్టమ్సు, కేంద్రప్రభుత్వంవారు విధించేపన్నులు, ఢిల్లీశాసనసభవారు శాసించవలసినరాష్ట్ర లేక కేంద్రవిషయాలు, సేన, నౌక, వాయువిమానా

లు—ఈవిషయాల్లో గవర్నరుజనరలు అంగీకారం పుచ్చుకోకుండా బిల్లుప్రవేశపెట్టకూడదు. ఇప్పుడున్ను, పూర్వమున్ను ఉన్న శాసనాలను గవర్నరుజనరలు ఆమోదమునకు లోబడి మార్చే అధికారం ఉన్నది.

బడ్జెటు శాసనసభలో ప్రవేశపెట్టబడును. ఇందులో ఓటుచేయుదగ్గవి, చేయుతగనివి అని రెండువిధాలు. కేంద్రప్రభుత్వకట్నాలు, 'సింకింగు'నిధిమీదవడ్డీ, శాసనబద్ధమైనఖర్చులు, జీతాలు, పెన్షనులు, హైకోర్టుజడ్జీలజీతాలు- ఇవి ఓటుకే పెట్టరు. ఇక స్వాయత్తశాఖలకు సంబంధించిన పద్దులు శాసనసభ త్రోసివేసినా, సవరణచేసినా గవర్నరుగారు దానిని యథాప్రకారం సమర్థించవచ్చును. ప్రజాయత్తశాఖలకు సంబంధించిన పద్దులలోమాత్రం తిరస్కరణాసకీ, సవరణకు శాసనసభకు సామాన్యంగా హక్కు ఉన్నది. కాని సిద్ధాంతంలో గవర్నరుగారు యీపద్దులనుగూడ తనకు ధర్మమని తోస్తె సమర్థించవచ్చును. "గవర్నమెంటును నడిపేవానికే దానికి కావలసినవ్యయప్రతిపాదన (Appropriation of Expenditure) చేయాలనే" సూత్రమును బట్టి శాసనసభ్యులకు స్వతంత్రంగా వ్యయప్రతిపాదనకు హక్కు లేదు.

గవర్నరుగారు ఏబిల్లుమీదగాని, క్లాజుమీదగాని ప్రజాశాంతికి భంగకరమనిన్నీ, తనకుగల పార్లమెంటుకీబాధ్యతకు అవసరమనిన్నీ, తోస్తె చర్య ఆపుచేయవచ్చును. కొన్నిబిల్లు

లు ఆయన అంగీకారం లేకుండా ప్రవేశమే కావు. శాసనసభ వారు చేసినశాసనాలు గవర్నరు ఆమోదించాలి. అటుపిమ్మట గవర్నరుజనరలు ఆమోదమునకు పెట్టవలెను. అనంతరం రాజు గారి ఆమోదముతో అది శాసనమగును. గవర్నరు యేశాసనమైన తిరస్కరించ (Veto) వచ్చును. లేదా కొన్నిసవరణలు చేయుమని సిఫారసుతో శాసనసభకు త్రిప్పివేయ (return) వచ్చును. లేక పైవారి ఆమోదమునకు నిలిపి యుంచ (reserve) వచ్చును. శాసనసభావ్యవహారములనుగురించిన నిబంధనలు గవర్నరుగారే చేయుదురు. నిబంధన పొందుపరచని అంశాలొస్తే వాటికి శాసనసభవారు గవర్నరు అనుమతిని 'స్టాండింగుఆర్డరు'లను చేయవచ్చును. శాసనసభ్యులకు సభలో వ్యక్తిస్వేచ్ఛ, వాక్స్వాతంత్ర్యము సంపూర్ణంగా కలదు.

రాష్ట్రప్రభుత్వంలో ప్రజాయత్తశాఖలు, స్వాయత్త శాఖలుగా ఏవేవి పంపకము చేయబడినవో తెలిపి పిమ్మట మంత్రివర్గాన్నిగురించి తెలుపుతాం.

ప్రజాయత్తశాఖలు:—స్థానికపరిపాలన (బోర్డులు, మునిసిపాలిటీలు, పంచాయితీలువగైరా), వైద్యం, ఆరోగ్యపారిశుద్ధ్యాలు, వానినిగూర్చినలెక్కలు, దేశంలోపలి యాత్రాస్థలాలు, విద్య (యూరోపియన్, ఆంగ్లో-హైందవవిద్య, కాశీ విశ్వవిద్యాలయంలాంటివిమినహా), పబ్లికువర్కులు, వ్యవసాయం, పశువులఆరోగ్యం, చేపలు, సహకారసంఘాలు, బాం

బాయి, బర్మారాష్ట్రాల్లో అడవులు, ఎక్సైజు, దస్తావేజుల రిజిష్ట్రేషను, దేవధర్మ ఆదాయాలు, జననమరణాలు, పరిశ్రమలవృద్ధి, పరిశోధన, సాంకేతికవిద్య ఈశాఖలకు కావలసినవిలువసరకు, కార్యాలయసామాను, భోజనదినుసులకర్తి, తూకాలు, కొలతలు, ప్రదర్శనములు, జంతుశాలలు, జంతుహింసను నివారించుట-రక్షించుట, నాటకాలు-సినీమాలు (కాని ఫిలిం ప్రదర్శనాన్నిగురించి కేంద్రశాసనసభవారిదే అధికారం), బందెలదొడ్లువగైరా.

<u>స్వాయత్తశాఖలు:</u>—నీటిసరఫరా, కాల్వలు, భూమిపన్ను, కరవునివారణ, భూమిసంపాదన, న్యాయపరిపాలన సివిలుక్రిమినలుకోర్టులసలహా (క్రిమినలువిషయాల్లోను, హైకోర్టులవిషయములోను భారతశాసనసభవారు చేసేవాటికిలోబడి) లాఠిపోర్టులు, అడ్మినిస్ట్రేటరుజనరలు, అఫిషియలుట్రస్టీలు, భారతప్రభుత్వం శాసించే కోర్టుఫీజుకు సంబంధించని స్టాంపులు, హైకోర్టుప్రథమవిచారణాధికారంలో పనికివచ్చే అట్టిస్టాంపులు, లోహపుగనుల ఫలహరముట, ఫ్యాక్టరీలు- కార్మికతగాదాల పరిష్కారం, విద్యుత్తు, బాయిలర్లు, ఆవిరిపొగవల్లకలిగే అనారోగ్యం, కార్మికక్షేమం (ప్రావిడెంటు ఇన్సూరెన్సుకార్మికగృహాలసహా; ఇందులో చాలాఅంశాల్లో కేంద్రమునకు లోబడి), పెద్దపెద్ద రేవులుగాక తక్కినవి, దేశంలో నీటిరహదారి, (కేంద్రశాసనానికి లోబడి) పోలీసు, పందెములు-జూదములు-జంతు

హింస-విషద్రవ్యములనిరోధము, మోటార్లు (కేంద్రాధికారానికిలోబడి), సినీమాలు (ఫిలిములనుగూర్చిన ఉత్తరువులు కేంద్రంయివ్వాలి), పుస్తకాలు- పత్రికలు- అచ్చాఫీసులపై నిరోధం (కేంద్రశాసనానికిలోబడి), శవపంచాయితీ, కేటాయించబడినభాగాలు, నేరస్వభావంగలగుంపులు, ఐరోపియన్ సంచారకులు (కేంద్రశాసనానికిలోబడి), ఖైదులు (కేంద్రశాసనానికిలోబడి), బందెలదొడ్లు, నిధినిక్షేపాలు, రాష్ట్రప్రభుత్వముల అచ్చాఫీసులు, రాష్ట్రకేంద్రశాసనసభల యెన్నికలు, లోకల్ ఆడిటుఫండు, ప్రభుత్వపక్వీసులకంట్రోలు, ఇతరపద్దులక్రింద రానిఆదాయనిలయాలు, ఋణంచేయుట, గవర్నరుజనరలుపై ప్రైవేటుస్థానికవిషయములక్రింద ప్రకటించినఅంశాలు, గెజెట్లు, ప్రజలబాగోగులనుగూర్చినసంఖ్యాగణము, ప్రాచీనప్రాతగ్రంథాలు, ఇవిన్ని చట్టప్రకారం స్థానికప్రభుత్వానికివ్వబడిన యితరాంశాలు.

స్వాయత్తశాఖలచట్టం ప్రజాయత్తశాఖలచట్టాన్ని (ఎవరిఅధికారం ఎంత అనే సంశయంవచ్చినప్పుడు) త్రోసివేస్తుంది. ఇల్లాంటిహక్కులే భారతశాసనసభవారిచట్టానికి ఉన్నాయి.

<u>కార్యవర్గసభ్యులు, మంత్రులు:</u>—గవర్నరే కార్యవర్గమునకు రాజుగారి తరఫున అధిపతి. స్వాయత్తశాఖల పాలనను కార్యవర్గసభ్యులను ముగ్గురను తానే నియమించును. వారు గవర్నరుగారికే సిద్ధాంతములోను, క్రియలోనుకూడ బాధ్యత

వహింతురు. ప్రజాయత్తశాఖలకు "మంత్రులను" ముగ్గురును శాసనసభ్యులు కాకపోయినాసరే. తనయిష్టమువచ్చినవారిని గవర్నరు నియమించవచ్చును. అట్టివారు ఆరునెలలలోగా శాసనసభకు ఎన్నికవలన రావాలి. కాని క్రియలో ఎన్నికసభ్యులలో నుండియే గవర్నరు నియామకం జరుగుతుంది. ఈనియామకమునుగూర్చి చట్టంలో ఏమిన్నీ లేకపోయినా క్రియలో సభలోని మెజారిటీపక్షనాయకుని పిలిచి అతనిని ప్రధానమంత్రిగా ఉండి, తనయిద్దరుసహచరులను ఏరుకొని తెలుపమని గవర్నరు చెప్పును. ఇట్టివారినే గవర్నరు తనమంత్రులుగా ప్రకటించును. సిద్ధాంతంలోను, చట్టప్రకారమున్ను వీరు గవర్నరుయొక్క "సహాయసలహాదారు"లైనను క్రియలో మంత్రులు శాసనసభకు బాధ్యత వహించును పాలించెదరు. వారిజీతములు శాసనసభవారు ఆమోదించాలి. ప్రజాయత్తశాఖలకు సంబంధించిన శాసనాల్లో మంత్రులపై శాసనసభవారిపెత్తన మున్నది. స్వాయత్తశాఖలసభ్యులకు శాసనసభవారికి బాధ్యత వహించ నవసరం లేదు. వారిజీతాలమీద సభకు పెత్తనం లేదు. ఈవిధంగా కొంతభాగం ప్రజాబాధ్యత గలదిగను మరికొంతభాగం ప్రజలకు బాధ్యత వహించనిదిగాను ఉండే "ద్వంద్వపరిపాలన" రాష్ట్రికార్యవర్గంలో ఏర్పడింది. ప్రజాయత్తశాఖలమంత్రులతో శాసనసభకు క్యాబినెట్టుసంబంధం ఏర్పడింది.

కాని ప్రజాయత్తశాఖలన్నీ దేశాభివృద్ధికరములైన ఖర్చుశాఖలు. స్వాయత్తశాఖలలో ఆదాయం వచ్చేవి చాలా ఉన్నాయి. ఉభయభాగాలుకూడా కలిసిసంప్రదింపులు చర్చలు చేసికొనవచ్చురు. కాని మంత్రులు స్వాయత్తశాఖపైన వత్తిడి ఏమియు కలుగచేయరాదు. ఈద్వంద్వప్రభుత్వ విధానము 'లమోనియల్ కర్టిస్' అనే ఆయన పలికం ఈశాఖావిభజన, ధనవిభజనలలోను ఎప్పుడూ చిక్కులే కలుగుచున్నాయని అనుభవజ్ఞులైన మంత్రులే అంగీకరించారు. కార్యవర్గంలో పరిపాలనా సౌష్ఠవము, సామరస్యం చెడింది. ఈవిధంగా కూడా యీద్వంద్వ ప్రభుత్వవిధానం అపజయం పొందిందని సైమను సంఘంసహా అంతా అంగీకరించారు.

ఇదికాక ఆర్థికవర్గం ఒకటి రాష్ట్రప్రభుత్వంలో కలదు. దీనికి ఆర్థికసభ్యుడే అధిపతి ఏశాఖకర్చైనా వీరిసమాధానం లేకుండా చేయరాదు. ఇందులో రెండువంతు లధికారేతరసభ్యులుందురు. ఏకర్చునైనా ఏసమస్యనైనా వీరామోదించి జమాఖర్చులకమిటీకి పంపెదరు. అప్పుడే అది మంజూరు అవుతుంది. ఆర్థికసభ్యుడే యిందులో సర్వాధికారి.

రాజప్రతినిధికి రాష్ట్రప్రభుత్వముతో సంబంధము:—

---

ఈయనకు ఈరాష్ట్రప్రభుత్వంమీద తనిఖీఅధికారం ఉన్నది. కేంద్రశాఖలపాలన రాష్ట్రంలో సరిగా జరుగుచున్నదీ లేనిదీ చూచుట, రాష్ట్రములమధ్య వివాదాలు పైకమీసనను

కార్యాలయధర్మాలు, సివిలుసర్వీసు, యిండియామంత్రి చేసిన పాలునయొక్క అమలు- ముఖ్యంగా వీటిలో.

రాష్ట్రీయాదాయాలు :—చట్టంనాటికి రాష్ట్రములకు రావలసినఆదాయాలు, రాష్ట్రశాఖల ఆదాయాలు, వచ్చుబడి పన్నులో కొంతభాగం, యిచ్చినబుణాలు, పెట్టుబడులు, రాష్ట్రీ పన్నులు— ఇవి ఆదాయాలు. కేంద్రప్రభుత్వానికి సాలీనా యివ్వవలసినకట్నాలు, రాష్ట్రమునకు అప్పజెప్పబడిన 'ఇరిగేషన్ప్రాజెక్టు'లపైన కేంద్రం పెట్టినపెట్టుబడికి వడ్డీ, కేంద్రకరువు నివారణ వగైరాలకు సాలీనా కట్టుబడి— ఇవి కేంద్రప్రభుత్వానికి రాష్ట్రం యివ్వవలసిన పద్దులు. హిందూదేశములో రాష్ట్రములు చేసేబుణానికి కేంద్రంవారియొక్కయు, పైనచేసేవానికి యిండియామంత్రియొక్కయు అంగీకారం వుండాలి. జూదం, ఆటలు, మొదలైన వ్యసనభోగాలమీదనే రాష్ట్రప్రభుత్వాలకు అదనపుపన్నులను, కొత్తపన్నులను విధించేఅధికారం కలదు. కేంద్రప్రభుత్వంవారి శాఖలు కార్యాలు రాష్ట్రములలో నిర్వహించడాని కయ్యేఖర్చు యిండియాప్రభుత్వమే యిస్తుంది. ఏశాఖనుగూర్చి అయినా కేంద్రఅధికార మెంత? రాష్ట్రఅధికార మెంత? అని భేదాభిప్రాయములు వస్తే పరిష్కారాధికారం గవర్నరుజనరలుది.

ఢిల్లీలో కేంద్రప్రభుత్వం.

కేంద్రశాసనవర్గం:—ఈశాసనవర్గానికి రెండుసభలు. స్టేటుకౌన్సిలు, అసెంబ్లీ అని, క్రిందిసభకు ఎన్నికదారుల అహ్వా

తలు రాష్ట్రికౌన్సిళ్ల అర్హతలవంటివే. కాని చెల్లించే పన్ను వగైరాల మొత్తములు హెచ్చుండాలి. రాష్ట్రిసభకు పదిరూపాయిలపట్టాదారు అర్హుడైతే యీసభకు ఓటరు రు. 50 ల పట్టాదారుగా వుండాలి. నియోజకవర్గము ఏకస్థానముగలది. (single member constituency) రాష్ట్రిసభకువలె సాంఘిక, వ్యాపార, వృత్తి నియోజకవర్గాలుకూడావున్నాయి. మొత్తంస్థానములలో $\frac{5}{7}$ కు తక్కువకాకుండా ఎన్నికవల్లను మిగతావి నామినేషనువల్లను భర్తీ అగును. మొత్తంస్థానాలు 143 లో 25 గురు అధికారులు, 15 గురు అనధికారులు, నామినేషనువల్లను, 51 మంది సాధారణనియోజకవర్గాల్లోను, 30 మంది మహమ్మదీయనియోజకవర్గాల్లోను, ఇద్దరు సిక్కు, 7 గురు భూస్వామి, 9 గురు యూరోపియన్, 4 గురు వర్తక సంఘనియోజకవర్గాలనుండి ఎన్నుకోబడాలి. సభాకాలపరిమితి 3 సంవత్సరములు.

పైసభఅయిన స్టేటుకౌన్సిలుకు పెద్దభూస్వాములు, ధనవంతులు, హోదాగలవారుమాత్రమే ఓటర్లు. నియోజకవర్గాలు బహుస్థానాలుగలవి(Plural member constituencies) ఇచ్చేఓటు ఒకటైనా ఓటరు గౌరవంలోనున్న అభ్యర్థులందరకు ఆగౌరవానుగుణ్యంగా సదరుఓటులాభం కలిగేందుకు పెట్టబడిన "బహుఅభ్యర్థుల కుపయోగించే ఏకఓటుపద్ధతి" (single transferable Vote with first Preference) ని (పైసభకువలె యిక్కడ మెజారిటీవోటింగుపద్ధతి లేదు.) ఎన్నిక

జరగాలి. సభయొక్క మొత్తముసంఖ్య 59. ఇందులో 19 గురు అధికారులు, 6 గురు అనధికారులు, నామినేషనుకావాలి; 20 సాధారణస్థానాలు, 10 మహమ్మదీయస్థానాలు, 1 సిక్కు, 3 యూరోపియనుస్థానాలు, ఎన్నికవల్ల పూర్తికావాలి. ఈసభాకాలపరిమితి 5 సంవత్సరములు.

ఉభయసభలకాలాన్ని గవర్నరుజనరలు పొడిగించవచ్చును. (1930 లో ముగియవలసిన అసెంబ్లీని 1934 వరకును పొడిగించినట్లుగా) క్రిందిసభకు అధ్యక్షుని, చట్టంతేదీలగాయితు 4 సంవత్సరముల అనంతరం సభవారే ఎన్నుకొందురు. పైసభాధ్యక్షుడు నామినేషను చేయబడును. ఉభయసభలను రాజప్రతినిధి పిలుచుటకు, సమాప్తిచేయుటకు హక్కుదారుడు. అధ్యక్షుడు సభామధ్యమున వాయిదాలుమాత్రం వేయవచ్చును. ఉభయసభలకు వ్యవహారనిబంధనలు ఏకరీతివే. ప్రతిశాసనం ఉభయసభవారిచేతను అంగీకృతం కావాలి. అభిప్రాయభేదం వచ్చినప్పుడు గవర్నరుజనరలు సమిష్టిసమావేశం జరిపి తీర్మానం చేయుమనవచ్చును. రాష్ట్రగవర్నరువలెనే శాసనముకు అంగీకారతిరస్కారపుహక్కులు, త్రిప్పివేయుట, ఆర్డినెన్సులుచేయుట, చర్చలు ఆపుచేయుటవగైరాలు గవర్నరుజనరలు చేయవచ్చును. సభ్యులకు వాక్స్వాతంత్ర్యము వ్యక్తిస్వాతంత్ర్యము కలదు. శాసనసభలకు ఉపాధ్యక్షులుకూడా యుందురు. అధ్యక్షుని శాసనసభ తొలగించవచ్చును. ఉభయసభలలోను ఏకవ్యక్తియే సభ్యుడుగా నుండరాదు.

బడ్జెట్టు:—సాలుసరిజమాఖర్చు అంచనా ఉభయసభలకు నివేదించాలి. వ్యయప్రతిపాదనపుహక్కు గవర్నరుజనరలుదే. జీతాలు, పెన్షనులు, భారతఋణంమీాద వడ్డీ, సింకింగు నిధి, రాచకీయం, సేన, మతశాఖలకు సంబంధించిన ఖర్చుల మీాద ఓటింగుహక్కు లేదు. ఇందులో కొన్నిటిమీాద చర్చ కూడా చేయుటకు వీలులేదు. శాసనసభ ఆమోదించినా తిరస్కరించినా ప్రతిఅంశమున్నూ గవర్నరుజనరలు అనులు పరచవచ్చును. ప్రజాబాధ్యత అనేది యెక్కడా కేంద్రంలో వుండకూడదనే ఉద్దేశ్యంతోనే అల్లా యేర్పడ్డది.

కొన్నిశాసనాలు చేయవలసినదిగా గవర్నరుజనరలు శాసనసభను కోరవచ్చును. వారు చేయకపోతే తానే దానిని ధ్రువపరిచి (certify) శాసనంగా ప్రకటించును. ఒకప్పుడు అలా కోరకుండాకూడా చేసేచట్టాలు కొన్నివున్నాయి. అవే 'ఆర్డినెన్సు'లు. ఇవికాక శాసనసభవారి శాసనాలు మరియొక రకం. ఈవిధంగా మూడురకాలచట్టా లుంటాయి. మూారకం రేటు, ఎగుమతిదిగుమతిపన్నులువగైరాలలో ఏవిట్లైనా ముందుగానే గవర్నరుజనరలు అంగీకారం పొంది శాసనసభలో ప్రవేశించాలి. ఈపతకప్రకారం ప్రజాప్రతినిధులకు కేంద్రప్రభుత్వంలో "విమర్శనావకాశం" మాత్రం లభించింది.

కార్యవర్గం:—కార్యవర్గమునకు సంఖ్యా నియమము లేదు. కార్యవర్గసభ్యులందరు శాసనవర్గంలో పైసభకో క్రింది

సభకో నామినేషను చేయబడతారు గవర్నరుజనరలే అధ్యక్షుడు. వీరిని తనయిష్టమువచ్చినవారిలోనుండి గవర్నరుజనరలే ఏర్పాటు చేసుకుంటాడు. వీరిజీతాలు నిర్ణయించేది యీయనే. వీరికి శాసనసభాబాధ్యత లేదని వేరే చెప్పనక్కరలేదు. కాని కౌన్సిలుకార్యదర్శులుగా శాసనసభ్యులనుమాత్రమే యీయన యేర్పరచాలి. ఈక్రిందివి కేంద్రపరిపాలనాశాఖలు—దేశరక్షణ, నౌక, సేన, విమానదళము, లేక భారతదేశములో నిర్మించబడిన రాజుగారియేసేనాదళమైనా (స్థానికప్రభుత్వములసేన, సాయుధపోలీసుదళములు గాక) నౌక, సైనికనిర్మాణాలు, కంటోన్మెంట్లు, భారతదేశమునకు వెలుపలియాత్రలు, పైదేశస్థులకు పౌరత్వం యివ్వడంసహా విదేశసంబంధాలు, భారతసంస్థానసంబంధాలు, రాజకీయబాధ్యతలు, యీక్రిందిపరిమితికి లోబడిన ప్రయాణమార్గాలు—రైళ్లు, మునిసిపాలిటీలలోనివి కాని ట్రాములు, విమానాలు, వాటికి సంబంధించిన అన్నివిషయాలు దేశంలోపలి నీటిరహదారీలు, ఓడలప్రయాణం (దేశములోపలి ఓడలప్రయాణములోకూడా కేంద్రఆవరణలోనిదిగా యెంచబడినంతవరకు కేంద్రమునకు అధికారముంది), లైటుహౌసులు (including ther approaches and beacons), Light Ships, buoys, పోర్టులు, క్వారంటైనులు, నౌకాస్పత్రులు, మేజరుపోర్టులు, పోస్టుటెలిగ్రాములు, తంతిలేని వార్తలు, టెలిఫోనులు, ఓడరేవుపన్నులు, ప్రత్తితో చేయబ

డినసరుకులపై పన్ను, ఆదాయపుపన్ను, ఉప్పుపన్ను, తదితర ఆదాయనిలయాలు, కరెన్సీ, నాణెముల రచన, భారతబుణం, లెక్కలతణిఖీ, సివిలులా, బ్యాంకింగు, ఇన్సూరెన్సు, వర్తకకం పెనీలు, యితరసంఘాలసహా, వ్యాపారం, ప్రజాక్షేమముకొరకు కేంద్రప్రభుత్వనిబంధనలప్రకారం ఉత్పత్తిసరఫరాలను హద్దు పద్దులలో నుంచవలసినద్రవ్యములు, పరిశ్రమలఅభివృద్ధి (కొన్ని పరిస్థితులలో), నల్లమందు ఉత్పత్తి యెగుమతులనిరోధం, కేంద్ర శాఖల కవసరమయ్యే స్వదేశీవిదేశసామానులు, పెట్రోలు మొదలైన ప్రేలుడుసామానులనిరోధం, భూగర్భ పరిశోధనం, గనుల అభివృద్ధి (ఇండియామంత్రి ఉత్తరువుప్రకారం గవర్నరు జనరలుకు ప్రత్యేకించబడినవి), గనులపని సరిగా జరుగుట, వృక్షపరిశోధన, క్రొత్తనమూనాలు, క్రొత్తవస్తువులను కనిపెట్టుట, కాపీరైటు, దేశములోకి పైకి వలసపోవుట, క్రిమినలు ప్రొసీజరు సహా క్రిమినలులా, కేంద్రపోలీసు, మందుగుండు, ఆయుధములనిరోధం, కేంద్రపరిశోధనస్థలాలు, (విద్యా, శాస్త్రం వగైరాలవిషయాల్లో), క్రైస్తవమతసమాధులపాలన, భారత సర్వే, ప్రాచీనవస్తు-మృగ-వాతావరణశాస్త్రములు, జనాభా లెక్కలు, యావద్భారతసర్వీసులు, భారతశాసనసభవారి వర్ధి లోనున్న రాష్ట్రశాఖలు, అట్టివాటిలో గవర్నరుజనరలుకు అధికారం ప్రత్యేకించబడిన విషయాలు, భూభాగాల మార్పులు (రాష్ట్రాలమధ్యగాక), వాటినిగూర్చినశాసనాలు ప్రకటించుట,

మర్యాదలు, బిరుదులు, సివిలుయూనిఫారము, ఆస్తిసంపాదన, పబ్లికుసర్వీసుకమీషను, రాష్ట్రశాఖలలో చేరనట్టిగాని శాఖల నుండి స్పష్టముగా కేటాయించబడినట్టిగాని అన్నివిషయాలు.

ఇండియామంత్రి:—ఆలోచనసభ్యులసంఖ్య 10—14 నుండి 8—12 కు తగ్గించబడింది. కాలపరిమితి 5 సం॥లు. సభ్యులు 10 సం॥ల సేవానుభవమును కలిగియుండాలి. సాలు 1 కి జీతాలు, భత్యాలు సహా సభ్యుని 1 కి రు 1800 పౌనులు. ఈసభవారికి చట్టబద్ధమైన హక్కులుకొన్ని ఉన్నను మంత్రిగారి క్రిందిచెయ్యివారే. ఇండియామంత్రిగారు బ్రిటిషుమంత్రివర్గము లోసభ్యులు. పార్లమెంటుతోకూడినరాజుగారి యేజెంటు. శాసనసభ, కార్యవర్గం ఏకీభవించినచోట్లను, ప్రజాయత్తశాఖలలోను సాధారణంగా జోక్యముపుచ్చుకోరు. చట్టంక్రింద ముఖ్యవిషయాల్లో నిబంధనలన్నీ యీయనఅనుమతితో గవర్నరుజనరలు చెయ్యాలి. అవి పార్లమెంటుయెదుట వీరు నివేదించాలి. శాసనసభవారి చట్టాలయొక్క ఆమోదతిరస్కారాలనుగురించి రాజుగారిసలహాదారు డీయనే.

హైకమీషనరు :—ఈచట్టంక్రింద ఏర్పడినకొత్తస్థానం యిదొకటి. ఇదివరలో యిండియామంత్రి భారతవర్తకవ్యాపారాలకు, భారతీయులకున్ను విదేశంలో చేసే యేజంటుగిరీవగైరాలు విడదియ్యబడ్డాయి. ఈపనులకొరకే యీహైకమీషనరుపదవి కల్పించబడింది. భారతదేశానికీ యితరదేశాలకీ మధ్య

గలవర్తకం, ఎగుమతిదిగుమతుల పన్నులువగైరాలలో ఒడంబడికలు ఉభయదేశాలు చేసికొనవచ్చును. ఇట్టివన్నీ యీయన ద్వారానే జరుగును. వీటినే 'కన్వెన్షనులు' 'ప్యాక్టు'లు అంటారు.

సివిలుసర్వీసు:—చట్టము వచ్చేనాటికి ఉన్నసివిలుసర్వీసునింబధనలన్నీ యేఅధికారి చేసినవైనా స్థిరపర్చబడ్డవి. వారిని యీమకం జీతం, షరతులువగైరాలకు నిబంధనలు చేసేఅధికారం సాధారణంగా సభాయుతుడైన యిండియామంత్రిగారిది. ఈఅధికారం సభాయుతుడైన గవర్నరుజనరలుగారికిన్నీ, కేంద్ర రాష్ట్రిశాసనసభలకున్నూ, గవర్నరులకున్నూ యీయనఅప్పజెప్పవచ్చును. ఉన్నపెన్షనులు, జీతాలు మార్చకూడదు. ఉన్న హక్కులకు భంగం ఉండకూడదు. ప్రతిసివిలుఉద్యోగిన్నీ చక్రవర్తిగారి ఆమోదం ఉన్నంతకాలమే ఉద్యోగంలో ఉండును. ఉద్యోగిని నియమించిన అధికారాకంటె క్రిందివారిచేత బర్తరఫుకాకూడదు. ఇండియామంత్రి అట్టివారిని తిరిగి ప్రవేశపెట్టవచ్చును. తనకు జరిగినఅక్రమాన్ని తొలగించకోరుటకు సివిలుఉద్యోగికి హక్కుగలదు. 5 సం॥ కాలపరిమితిగల ఒక 'పబ్లిసు సర్వీసుకమిషను' రాష్ట్రములలోను, యావద్భారతదేశంమీదను యేర్పడింది. అయిరోపియన్ల నియామకసంబంధమైన నిబంధనలు యిండియామంత్రిసభలో మెజారిటీసభ్యులు ఆమోదించాలి. భారతఉద్యోగుల నింబధనలు పార్లమెంటు అంగీకరించాలి. ఇండి

యాలో ఏఅధికారవర్గమున్ను ఉన్నసివిలుసర్వీసుఉద్యోగాలను హెచ్చించకూడదు. జీతబత్తెములు మార్పు చేయకూడదు, తత్సంబంధమైన అధికారి ఆమోదించకుండా. ఈసందర్భాలోను యితరసందర్భాలలోను చేసే నింబధనలన్ని యిండియామంత్రి సమాలోచకవర్గంలో అధికసంఖ్యాకు లామోదించాలి. ఇండియామంత్రి లెక్కలతనిఖీదారునికూడా(Auditor general) నునియమిస్తారు.

శాసనసభలు లేకుండా పరిపాలించబడే కొన్నిరాష్ట్రాలు యీచట్టమునాటికి గలవు-చిన్నరాజధానులు, వెనుకబడ్డభాగాలు అని. అజమీరు, మర్వారా, మదరాసులోని ఏజన్సీభాగాలు ఇల్లాంటివి. పంజాబుమొదలైనవాటికి యీచట్టంక్రింద శాసనసభ లేర్పడ్డాయి. అజమీరు, మార్వారా వంటివి కమిషనుపాలనక్రిందిరాష్ట్రాలుగా ఏర్పడి వాటిపైన గవర్నరుజనరలుకు సరాసరి అధికారం యివ్వబడింది. ఇక యీవెనకబడ్డభాగాలకు రాష్ట్రగవర్నరే స్వయంగా శాసనాలు చేస్తారు. రాష్ట్రశాసనాల్లో ఆయనకు తోచిన భాగాలనే అమలు జరుపుటకు హక్కుకలదు. ఈచిన్నరాష్ట్రములలో బర్మా శాసనవర్గంగలదిగా చేయబడింది. 1932 సంIIలో పశ్చిమోత్తరరాష్ట్రముకు శాసనవర్గం యివ్వబడింది.

సంస్థానాధిపతులు:—నరేంద్రమండలి స్థాపించబడింది. సంస్థానములకు, బ్రిటిషుప్రభుత్వానికి మధ్యగల సంబంధములు,

అధికారములు, యేర్పడ్డ పూర్వపుమామూళ్లు, పూర్వపుసంధి షరతులనుబట్టి అర్థము చేసికోవాలి. సంస్థానములమీద మోపబడే నేరములువగైరాల విచారణకు ఒకపద్ధతి యేర్పడింది. అట్టివిచారణాసంఘంలో సంస్థానాధిపతులప్రతినిధికూడా యుండును.

ఈచట్టప్రకారం సంస్కరణాలు భారతదేశములో ఎల్లా అమలుజరిగినది, విద్యాభివృద్ధి యెంతవరకు జరిగినది, యిచ్చిన సంస్కరణాలను బాధ్యతాయుతపాలనపరంగా హెచ్చించడమూ, లేక తగ్గించడమూ. అని యోచించుటకున్ను, రాష్ట్రములలో ద్వితీయశాసనసభానిర్మాణ అవసరాన్నిగురించి యోచించడానికిన్నీ, పదిసంవత్సరముల ఆఖరున ఒకబ్రిటిషువారి విచారణసంఘం నియమించవలెనని కూడ చట్టబద్ధం చేయబడింది.

విఫలమైన, రాష్ట్రములలోనిద్వంద్వప్రభుత్వవిధానం, ప్రజాప్రతినిధులకు విమర్శనామాత్రపు అవకాశముగల కేంద్రవిధానము, భారతీయుల అర్హతలను పరీక్షించే తెల్లవారిపరీక్షాసంఘం, యీమూడే జాతీయవాదులదృష్టిలో గోచరించే అప్పటి సంస్కరణాలు. కాని, చట్టపుమూలపురుషులు తమ రిపోర్టులో వ్రాసిన ఒక్కఅంశాన్నిమాత్రం జ్ఞాపకం చేసి యిచ్చట ముగిస్తాను. ప్రస్తుతం రాష్ట్రములో ద్వంద్వప్రభుత్వం ప్రవేశపెట్టినామనిన్నీ (అనగా కొంతభాధ్యతాయుతపరిపాలనము భారతీయుల కిచ్చినామనిన్నీ), పిమ్మటివాయిదాలో

సంపూర్ణరాష్ట్రస్వతంత్రమున్ను, సామ్రాజ్యక్షేమానికి అవసరమైనకట్టుబాటులతో యావద్భారతవ్యవహారములను "కంట్రోలు" చేసే అధికారమున్ను భారతీయుల కిచ్చుటయే సమంజసమని తెలిపిరి. (చూ. మాంటెగూ-ఛెలమ్సుఫర్డురిపోర్టు) 18 సంవత్సరముల క్రితం వారు తెలిపిన యీ ఆశయమైనా 1935 సంవత్సరం యిండియా చట్టము సఫలపర్చిందేమో పాఠకులు గమనించాలి.

రాజ్యాంగపరిణామచరిత్ర దిఙ్మాత్రముగా తెలుపుటకు పూనుకొన్న యిచ్చట గతమునకు సంబంధించిన యీ చట్టమునుగూర్చి పెద్దప్రొద్దు గడపుట అనవసరము. ద్వంద్వపరిపాలనలో ఏర్పడ్డ తోటికోడలిపోర్లు, సవితితల్లిప్రేమలు, అనుభవజ్ఞులైన గవర్నర్లు, మంత్రులే ఒప్పుకొన్నారు. పైన కాంగ్రెసు ఉద్యమం ఉండబట్టిగాని లేకపోతే మంత్రులశాఖలకు స్వాయత్తశాఖవారు యీమాత్రం పోషణము చూపేవారు కారు.

---

# నేటి భారతరాజ్యాంగము.

## మొదటి అధ్యాయము.

1935 సంవత్సరపు ఇండియా రాజ్యాంగచట్టము.

ఈచట్టమునకు 321 సెక్షనులు, 9 అనుబంధాలు గలవు. దీనిక్రిందచేసేనిబంధనలు చాలా ఉంటాయి. ఇవి కాక యీచట్టంక్రింద తమతరఫున పరిపాలన జరపడాన్నిగూర్చి గవర్నరుజనరలుకున్ను, గవర్నరుకున్ను రాజుగారుయిచ్చిన ఆజ్ఞాపత్రాలు (Instruments of instructions) ప్రచురించబడ్డాయి. ఇవికూడా పార్లమెంటుసభవారిమెదుట నివేదించబడతాయి. వీటిమీాద కోర్టుల కధికారంలేదు. ఇదికాక యీచట్టప్రకారం రాజుగారికున్నహక్కులన్నీ తమఆలోచనసభలో చేయుబడిన వుత్తరువులు (orders in council) ద్వారా అమలు జరుపవలెను. సదరుఆర్డరు లిప్పటికి 30 వరకు జరిగినవి. ఈఆర్డరులు ముందు యిండియామంత్రిగారివలన పార్లమెంటుకు నివేదించబడి వారిద్వారా రాజుగారు వానిని మంజూరుచేయకోరబడతారు.

చట్టముయొక్క విషయసూచిక :—14 భాగాలు. 9 అనుబంధాలు. మొదటిభాగం:—చట్టంపేరు, రాజుగారిపేరుతో ప్రభుత్వం గవర్నరుజనరలుకు రాజప్రతినిధిగా సంస్థానాల

తో ప్రత్యేకసంబంధం. రెండు:—సమాఖ్యవిధానం. మూడు:—రాష్ట్రవిధానము. నాలుగు :—చీఫ్‌కమీషనరు రాజధానులు. అయిదు:—శాసనాధికారాలు, వాటిపంపకం. ఆరు:—సంస్థానములు, రాష్ట్రములు, సమాఖ్యప్రభుత్వం-వీటిమధ్యగల పరిపాలనాసంబంధాలు. ఏడు:—ఆర్థికం, ఆస్తిసంపాదించుట, కంట్రాక్టులు, దావాలు (ఋణాలుచేయడమును గూర్చి సహా). ఎనిమిది:—సమాఖ్యరైల్వేఅధికారవర్గం. తొమ్మిది:—సమాఖ్య న్యాయస్థానం, న్యాయశాఖ. పది:—భారతదేశములోని రాజుగారి ఉద్యోగులు. పదకొండు:—ఇండియామంత్రి ఆయనసలహాదార్లు. పన్నెండు:—వివిధవిషయాలు. పదమూడు:—క్రొత్తచట్టముపూర్తిగా అమలులోనికివచ్చేలోగా నడుపవలసిన పద్ధతులు. పదునాలుగు:—చట్టప్రారంభాన్నిగురించిన్నీ, యీ చట్టంవల్ల రద్దయ్యే పూర్వశాసనాలనుగురించిన్నీ.

<u>అనుబంధాలు</u>:—(1) సమాఖ్యశాసనవర్గనిర్మాణం. (2) సంస్థానముల 'అంగీకారపత్రం' (Instrument of accession)లో మార్పు అవసరంలేకుండా యీచట్టంలో మార్పుచేయదగినఅంశాలు. (3) గవర్నరు, గవర్నరుజనరలుగార్ల జీతభత్యాలు. (4) రాజభక్తిప్రమాణానికినమూనా. (5) రాష్ట్రశాసనసభలనిర్మాణము. (6) వోటింగుహక్కులనుగూర్చి. (7)సమాఖ్య-రాష్ట్రములు పరిపాలించవలసినశాఖలపంపకము. (8) రైల్వేఅధికారవర్గం-నిర్మాణం-కార్యములు. (9) సమాఖ్య

వచ్చేవరకు అమలులో నుండవలసిన పూర్వపుయిండియా గవర్నమెంటుచట్టములోని (1919) భాగాలు.

సాధారణవిషయాలు.

ఈచట్టముపేరు "1935 సం॥ యిండియాగవర్నమెంటు చట్టము." ఇది ఒకమూల సమాఖ్యప్రభుత్వానికిన్నీ, మరియొక మూల రాష్ట్రి, సంస్థానాలకున్నూ గలసంబంధాన్ని నిబంధనా రూపంగా నిర్వచింపదలుచుకుందిగనుక "కాన్స్టిట్యూషన్ ఆక్టు" అనికూడా అంటారు.

ఇదివరలో హిందూదేశప్రభుత్వానికి సంబంధించినట్టిన్నీ, యిండియాప్రభుత్వంకు అవసరమైనట్టిన్నీ, రాజుగారికి చెందిన హక్కులు, అధికారములు, ఆచరణ, (ఇల్లాగే హిందూదేశం లోకి మరికొన్నిరాజ్యాలతాలూకున్నూ) యివిరాజుగారు చట్ట ప్రకారం యితరుల పరంచేసినవిన్నీ లేక రాజుగారు యితరత్రా వినియోగించినవిన్నీ తప్ప మిగతావి రాజుగారు తనతరఫున వ్యక్తుల నేర్పాటుచేసికొని తాను చెలాయించవచ్చును. చక్రవర్తిగారికి గలచట్టప్రకారం యావత్తుభారతదేశపరిపాలనాధికారమున్నూ, సంస్థానాధిపతులపై గలఅధికారసంబంధములు అనే యీరెండుహోదాలున్నూ ఒకవ్యక్తే పొంది నిర్వహించవచ్చును. ఆయనే గవర్నరుజనరలు, రాజప్రతినిధి అనే పేర్లతో ఉండును. రాజుగారు తమముద్రతో సర్వసేనాధిపతిని కూడా నియమిస్తారు. (సె 2)

సింధు, ఓఢ్రరాష్ట్రాలు క్రొత్తగా నిర్మించబడ్డాయి. బర్మా భారతదేశమునుండి విడదీయబడింది. 'ఏడెను' కూడా భారత దేశపు పరిపాలననుండి తప్పించబడింది. కాని భారతీయన్యాయ స్థానానికి యిచ్చటికోర్టులనుండి అప్పీలుఅధికారం ఉంచబడింది. ఉన్నరాష్ట్రముల సరిహద్దుమార్పులు, నూతనరాష్ట్రముల నిర్మాణము కౌన్సిలుఆర్డరుల మూలముగా రాజుగారు చేయనచ్చును. ఇట్లుచేయుటకు ముందుగా కాబోయేనూతనరాష్ట్రాలకు సంబంధించిన రాష్ట్రశాసనసభలు-ప్రభుత్వము, సమాఖ్యశాసనవర్గము-ప్రభుత్వములతో సంప్రదించాలి. కాని యేఆంధరాష్ట్రమేనా నిర్మాణంకావాలంటే శాసనసభ స్వతంత్రంగా తీర్మానం చేస్తే దాన్ని మన్నించాలనే విధి చట్టంలో కనబడదు. (సె. 288-89-90లు).

---

# రెండవ అధ్యాయము.



## రాష్ట్రపరిపాలనము.

ఈచట్టంక్రింద యేర్పడే రాష్ట్రపరిపాలనాపద్ధతిమాత్రం 1937 సం॥ ఏప్రిలు 1 వ తేదీనుండి అమల్లోకి వస్తుంది. బెంగాల్, బొంబాయి, మదరాసు, సంయుక్తరాష్ట్రములు, బీహారు, అస్సాము రాష్ట్రములలో శాసనవర్గమునకు రెండుసభలుంటాయి. పైరాష్ట్రములును, పశ్చిమోత్తరపరగణాలు, ఒరిస్సా, సింధు, బీరారుసహా మధ్యరాష్ట్రములు గవర్నర్లరాష్ట్రములుగా యీచట్టంక్రింద యేర్పడ్డాయి. బ్రిటిషుబెలూచిస్థానం, ఢిల్లీ, అజమీరు, మార్వారా, కూర్గు, అండమానునికోబార్ లంకలు, పాంతాపిప్లోడాలున్ను ప్రధానకమీషనర్లరాష్ట్రాలు. బీరార్లమీద నైజామునకు కొంతహోదా యివ్వబడింది. నైజాముగారి పెద్దకుమారునికి 'బీరారు యువరాజని' బిరుదిచ్చారు. బీరారుపౌరులవోటింగుహక్కు విషయంలోను, సదరుప్రాంతముల ఆర్థికములగూర్చియు, నైజామునున్ను బ్రిటిషుప్రభుత్వానికిన్నీ, కొన్ని ఒడంబడికలుకూడా జరిగి అవి కౌన్సిలుఆర్డర్లక్రింద పొందుపర్చబడ్డాయి. (సె. 46-47 లు)

రాష్ట్రనియోజకవర్గములు.—భూస్వామి, కార్మికుడు, విద్యాలయం, వర్తకం అని వృత్తి, విద్యా, వ్యాపారపరంగానే గాక కొండజాతులు, సిక్కులు, మహమ్మదీయులు, ఆంగ్లో

హైందవులు, యూరోపియనులు, భారతక్రైస్తవులు అని మత సాంఘికంగాను, తెల్లనల్లపరంగాను, స్త్రీలు-పురుషులు అని జాతిపరంగానుకూడా దేశమునంతా నియోజకవర్గాలక్రింద విడదీసింది. స్త్రీనియోజకవర్గాలను తిరిగి మతసాంఘికపరంగా అంతర్విభాగం చేయడం మరింత ఆశ్చర్యమైనవిషయం. ఇక పంచములను (షెడ్యూల్డువర్ణములు) స్థలాంతరమున చెప్పిన 'ప్యాక్టు' పద్ధతికి లోబడి సాధారణ నియోజకవర్గంలో గాంధీగారి ఉపవాసఫలంగా కలుపుటకు అంగీకరించింది. మత సాంఘికములమీద యేర్పడిన ప్రత్యేకనియోజకవర్గములలోని ఓటర్లు సాధారణవర్గంలో ఓటు చేయకూడదు. వివరములు సదరు అనుబంధంలో ఉంటాయి. రెండుసభలుగల రాష్ట్రము లలో పైసభపేరు 'లెజిస్లేటివుకౌన్సిలనిన్నీ, క్రిందిసభ 'అసెంబ్లీ' అనిన్నీ అంటారు. పైసభకు నామినేషనులు కొలదిగాఉం టాయి. (చూ. అనుబంధము) క్రిందిసభకు పట్టాదార్లు. (ఎంత, ఏవిధమైనపన్నిచ్చినాసరే), వీరిభార్యలు, రిజిష్టరుకౌలుదార్లు, తనఖాదార్లు, మైనర్లగార్డియన్లు ఓటర్లు. ఇదికాక ఏవిధమైనవృత్తి పన్నుగాని, యూనియన్ వగైరాలపన్నుగాని ఎంతిచ్చినా అట్టి వారంతా ఓటర్లే. వీరందర్నిదరఖాస్తు అక్కర్లేకుండా రిజిష్ట్రే షను ఆఫీసరే చేర్చుకోవాలి. ఇక స్వయంగా దరఖాస్తు వ్రాయ గలిగినంత చదువువచ్చిన ప్రతిపురుషుడు స్త్రీకూడా స్వంతదర ఖాస్తు మీద ఓటర్లౌతారు. స్త్రీలు తమబంధువుల చేత దరఖా

స్తును పంపుటకు అవకాశముగలదు. పాచనులలో 20 x 22 అంగుళములుగల మట్టిగోడపాకలు గలవారికిని, 18×18 అంగుళలు ఇటికగోడలుగలవారికిన్నికూడా వోటింగుఅధికారంయిచ్చారు. ఇది మదరాసు రాజధానిలోని క్రిందిశాసనసభ (అస్సెంబ్లీ) కైన సాధారణ నియోజకవర్గంలోగల ఓటర్ల కొన్ని ప్రత్యేక అర్హత లుమాత్రమే. ఇంకనుగూర్చిన వివరాలతో ఎక్కువగా పుటలు నింపడం యిష్టంలేదు. కార్మికనియోజకవర్గానికి రిజష్టర్డు ట్రేడు యూనియన్ సంఘసభ్యుడుగా ఉంటే వోటు. లేక నిబంధనలప్ర కారంఫ్యాక్టరీలకూలీగా ఉన్నా ఓటు. ఈచట్టంక్రింద ఓటర్లుగా ఉం డేసభ్యులుగల ట్రేడుయూనియను వోటర్లజాబితా తయారయ్యే నాటికి 2 సం॥రాలపూర్వంనుంచీ పనిచేస్తూండాలి. అథమం ఒక సంవత్సరం పూర్వమే సదరుసంఘం రిజష్టరుఅయిఉండాలి. అం దులో చందాలిచ్చిన సభ్యులు 250 కి తక్కువుండకూడదు. 1926 సం॥ ట్రేడుయూనియన్ చట్టప్రకారం లెక్కలతణిఖీలు వగైరాలు జరగాలి. ఈషరతులు అమలుజరిగాయనిచెప్పి సదరు ట్రేడుయూనియన్ (కార్మికసంఘము) గవర్నరుగారివలన ధ్రువ పత్రమునుపొందాలి. ట్రేడుయూనియన్ సంఘగౌరవ సభ్యులు, ఉద్యోగులుగా ఉండేవారుకూడాయీనియోజకవర్గంలో ఓటర్లు! ఇక ట్రేడుయూనియన్ సభ్యులు కాని కార్మికులవిషయం. చట్ట నిబంధనలప్రకారం కార్మికనియోజకవర్గంగా యేర్పరచబడిన ప్రాంతములోని కర్మాగారాలలో నెలకు రు 300/- లకుమించ

నివసించి కలిగి ఓటరు లిస్టుతయారగుటకుపూర్వం 180 రోజులు నియమితమైన కర్మాగారంలో కూలీగా ఉంటే అట్టివారికిన్నీ ఓట్లుంటాయి. అట్టి కర్మాగారంలోనిగుమాస్తాలకు మేనేజర్లకు వోటుండదు. ఒకనియోజకవర్గంకంటె ఎక్కువగా వోటుచేస్తే ఆవోట్లన్నీ రద్దవుతాయి.

'కౌన్సిలు' అనిచెప్పబడే రాష్ట్రములోని పైసభకు (1) రు 7500 లకు తక్కువకాని ఆదాయంమీద పన్నిస్తే, (2) రు 1500 లకు తక్కువకాని సాలుసరి ఆదాయంగలభూమి ఉంటే, (3) రు 300 లకు తక్కువకాని పన్ను లేక శిస్తుగల యినాంపట్టాదారు, రైత్వారీ, జమీందారీపట్టాదారుగాని అయితే, (4) రు 500 లకు తక్కువకాని 'మాల్ఖానా' భృతిగలవారైతే, (5) బిరుదులు, బిళ్లలు మొదలైనగౌరవాలు కలిగిఉంటే (6) శాసనసభలో సభ్యులుగా ఉండినవాళ్లు, ఉన్నవాళ్ళు, మంత్రులు, (7) విశ్వవిద్యాలయసభ్యులు, అధికార్లు, (8) ఫెడరలు న్యాయాధిపతులు (9) మేయర్లు, సెంట్రలు బ్యాంకుఅధ్యక్షులు, జిల్లాబోర్డు మునిసిపాలిటి అధ్యక్షులు, గాని అయితే వోటుంటుంది. ఇందులో (2), (3) పద్దులక్రింది ఓటర్లలో రు 3000 లు ఆదాయంగాని రు 1500 లు శిస్తుగాని కలిగినవారి భార్యలకు కూడా ఓటుంటుంది. ఇల్లాగే రు 20000 ల మీద ఆదాయపు పన్ను యిచ్చేవారిభార్యలకును వోటుంటుంది.

పై ప్రత్యేకఅర్హతలకులోబడి ప్రతీఓటరుజాబితా తయారయ్యేనాటికి 21 సం॥లకు తక్కువకాని వయస్సుకలిగియుండుట 120 రోజులకు తక్కువకాకుండా సదరు నియోజకవర్గంలో నివాసముండుట, బ్రిటిషుపౌరుడుగానుండుట, అన్నితరహాల, అన్ని సభల ఓటర్లకున్న అన్నిరాష్ట్రములలోను ఉండవలసిన సాధారణఅర్హతలు. ప్రత్యేకఅర్హతలు అన్నిరాష్ట్రములలోను ఏకవిధంగాలేవు. ఈప్రకారం మొత్తం బ్రిటిషుభారతదేశంలోగల 27 కోట్లమంది పౌరులలోను 3 కోట్ల 60 లక్షలు స్త్రీపురుషులు ఓటర్లుగా చేర్చబడ్డారు. 1919 సం॥ చట్టంప్రకారం 87 లక్షల 44 వేలు మాత్రమే యుండిరి. అందులో స్త్రీలు 3 లక్షల 98 వేలు మాత్రమే.

<u>శాసనవర్గం-నిర్మాణం, అధికారబాధ్యతలు</u>:—పైనతెలుపబడిన ఓటర్లు ఉభయసభలకు ప్రతినిధుల నెన్నుకొంటారు. నియోజకవర్గాలు బహుస్థానాలు కలవి. వృత్తి, వ్యాపార, సాంఘికవర్గాలుమాత్రం ఏకస్థానం కలవి. సాధారణనియోజకవర్గ ఓటరు తనకున్న ఓట్లనన్నింటిని ఒక్కరికే యిచ్చినను యివ్వవచ్చును. ఇందువలన ఒకపార్టీలోనే స్పర్థాలుపుట్టి ఒకరినొకరు వంచించుకొనుటకు అవకాశముకలుగుతుంది. వోటువేసేపత్రం మీద ఓటరుగాని అతనిపక్షమున ఆఫీసరుగాని మార్కు చేయడం పోయింది. రంగులపెట్టెలుపద్ధతివచ్చింది. వోటింగు రహస్యపద్ధతిని జరుగును.

పైసభ స్థిరమైనది. కాని యింకొండి ప్రతిమూడుసంవత్స రములకొకసారి మూడవవంతుసభ్యులు తగ్గిపోయి వారు తిరిగి ఎన్నికవలన భర్తీఅవుతారు. అసెంబ్లీకాలపరిమితిలోపుగా క్రింది సభను పైసభనుకూడ గవర్నరు రద్దుచేయవచ్చును.

రాష్ట్రశాసనసభ లేక సభలు సాలున కొక్కసారైనా పిలవబడాలి. ముగించినవెనుకటిసమావేశమునాటికి ప్రారంభిం చిన మరుసటిసమావేశంనాటికి మధ్య పన్నెండుమాసాలు నిండ కూడదు. సభాస్థలనిర్ణయంచేసే, సమావేశం (summoning) చేసే, సమాప్తి (prorogue) చేసే హక్కు గవర్నరుగారిది. ఈచట్టంలోని యీభాగం అమలుకువచ్చిననాడు మొదలు ఆరు మాసాలలోగా శాసనవర్గం సమావేశంకావాలి. గవర్నరుకు పూర్వంలాగ కాలపరిమితి ముగిసినపుడు తర్వాతకూడా యిం కా సభను పొడిగించేహక్కు లేదు. గవర్నరు తనకు ముఖ్యమని తోచిన విషయములను గూర్చి శాసనసభను ఉద్బోధించ (address) వచ్చును. ఏవిషయంమీదనైనను ప్రత్యేకం సభ్యు లను హాజరుపరచవచ్చును. లేక సభకు సందేశాలు (mes_ sages) పంపవచ్చును. సదరుప్రకారం గవర్నరుగారి బిల్లులు, ఉద్బోధన, సందేశాలనుగూర్చిన విషయాలు సభవారు విధిగా యోచించాలి. ప్రతీమంత్రిన్నీ, అడ్వొకేటుజనరలున్నూ సభలలో పాల్గొనవచ్చును. వోటుచేయరాదు.

అధ్యక్ష, ఉపాధ్యక్షులు :— అసెంబ్లీకి 'స్పీకరు', 'డిప్యూటిస్పీకరు' అనిన్నీ, కౌన్సిలుకు అధ్యక్ష, ఉపాధ్యక్షుల నిన్నీ ఆయాసభలవారిచేతనే ఎన్నుకోబడతారు. వీరు తమరి నెన్నుకొన్న సభలవారిచేతనే తొలగించబడవచ్చును. కాని అట్టి తొలగింపు తీర్మానాన్ని గూర్చి 14 రోజులు ముందుగా నోటీసుం డాలి. అధ్యక్షుని తొలగించుటకుకూడా పూర్వపు చట్టంప్రకారం గవర్నరు ఆమోదించాలి. కౌన్సిలు అధ్యక్షపదవి అతనికాలపరి మితితో రద్దగును. అసెంబ్లీ అధ్యక్షుతి నూతనసమావేశం వర కును రద్దుకాదు. అధ్యక్షస్థానం ఖాళీగాఉంటే, ఉపాధ్యక్షు డున్నూ, ఉపాధ్యక్షస్థానంకూడా కాళీగానుంటే సభలోనుంచి గవర్నరుచే యేర్పరుపబడినవారొకరున్ను అధ్యక్షపదవిని చెలా యించెదరు. సమావేశాలమధ్య అప్పటప్పటవచ్చే ఖాళీనిసభ్యు లు పూర్తిచేయవచ్చును. అధ్యక్షులెవరును వోటు చెయ్యగూ డదు. సమానపువోట్లవల్ల సమస్యలు తెగనప్పుడు ఏదోఒకవైపు తీర్మానం తెగడానికి వోటివ్వాలి (casting vote).

శాసనసభకు, సభ్యులకుసంబంధించిన విషయాలు:— సభలో స్థానాలు ఖాళీగానున్న హేతువుచేగాని, సభ్యుడుగానుం డుట కర్హతలేనివ్యక్తి సభ్యుడుగా నుండెననిగాని పిమ్మట రుజు వైనను సభవారిచర్య అశాస్త్రీయముకాదు. అసెంబ్లీసభా సమావేశానికి కనీసపుసంఖ్య ఆరవవంతును కౌన్సిలుకు పది మందిన్నీ ఉండాలి.

చట్టంలో అన్యధా చెప్పబడిన తప్ప అన్నిసమస్యలూ మెజారిటీవోటునుబట్టి నిర్ణయించబడాలి. ప్రతిసభ్యుడు రాజభక్తిప్రమాణాన్ని తీసుకోవాలి. ఉభయసభలలోను ఒకరే సభ్యులుగా నుండరాదు. అల్లాగే రాష్ట్రసభ లేక సభలలో వారు సమాఖ్యశాసనసభలలోకూడ సభ్యులుగా నుండరాదు. సభవారిఅనుమతిలేకుండా 60 రోజులకాలములో జరిగినసభలలో ఒకదానికిని హాజరుకానిసభ్యుడు తనస్థానమును గోల్పోవును. సభ్యుడు చట్టం మినహాయించినవితప్ప తదితరలాభసాటి ఉద్యోగంలో ఉన్నను, ప్రవేశించినను స్థానమును గోల్పోవును. మంత్రిపదవి, కౌన్సిలుకార్యదర్శిపదవి లాభసాటిఉద్యోగాల క్రిందరావు. జైల్లోగాని, ద్వీపాంతరవాసంలోగాని ఉన్నవాళ్లను ఎన్నుకోవీలులేదు. ఇదివరలో బ్రిటిషుకోర్టులోగాని, సమాఖ్యలోచేరిన సంస్థానపుకోర్టులోగాని యావజ్జీవితశిక్ష లేక రెండేండ్లకు తక్కువకానిఖైదు విధింపబడినవారు అభ్యర్థులుగా ఉండాలంటే వారు విడుదలైనతర్వాత అయిదుసంవత్సరాలకాలం అభ్యర్థిగా ఉండేనాటికి గడవాలి. కాని గవర్నరు ప్రత్యేకవిషయాల్లో యీగడువును తగ్గించవచ్చును. అనగా రెండుసంవత్సరాలకంటె పైగా జైలువేయబడిన రాచకీయఖైదీలు గవర్నరుగారిని కోరితేగాని దరఖాస్తుపెట్టుకోవడానికి వీల్లేదన్నమాట. సభ్యుడుగాఉండగా శిక్షింపబడి నిర్బంధంలోనికివెళితే ఆస్థానం మూడునెల్లవరకు ఉంటుంది. అర్హతలేకుండాయేవ్యక్తిఅయినా

సభ్యునిగా కూర్చుని వోటుచేస్తే రోజునకు రు 500-లు జరిమానా.

శాసనసభలో చెప్పిన ఉపన్యాసానికి, ఉపన్యాసకునికి సంపూర్ణ స్వేచ్ఛ ఉన్నది. ఎవరూ ఎట్టిచర్యను జరుపరాదు. శాసనసభ్యులకుగల యితరఅవకాశములనుగూర్చి అప్పుడప్పుడు శాసనసభయే చట్టపూర్వకంగా నిర్వచనం చేయుచుండును. అంతవరకు యీచట్టం అమలులోనికి వచ్చేనాటికి ఉన్నఏర్పాట్లే అమలుజరుగుచుండును. శాసనసభవారికి యెట్టిన్యాయనిర్ణయాధికారంగాని శిక్షణాధికారంగాని లేదు. కాని శాసనసభ కమిటీలయొద్ద సాక్ష్యమపన్నాలిచ్చుటకై (కోర్టులలోవలె) వ్యక్తులను నిర్బంధించేశాసనాలు చేయవచ్చును. ఇట్టినిబాధనలలో ప్రభుత్వోద్యోగీయులహాజరుకు ప్రత్యేకపుటేర్పాట్లు చేయుట, వారు ప్రభుత్వరహస్యాలను బయటపెట్టకుండునట్లు తగుఅవకాశముండునట్లును చూడవలెను. శాసనసభ్యులకు శాసనసభానిర్ణయప్రకారం జీతములు, భత్యములు ఉండును. (సె. 67-71 లు).

## శాసనసభావ్యవహారములు.

(ఇందునుగూర్చి చట్టములోని అంశములను వివరించుటకుముందు మొత్తం శాసనసభావ్యవహారాలు ఎల్లాఉంటాయో ఒకసారాంశాన్ని పొందుపరుస్తాం. ఇందువల్ల ముందు తెలిపే

విషయాలు బాగా తెలుస్తాయి. ఈచట్టప్రకారం శాసనంచేసే విధానం మూడువిధములు. శాసనసభవారుచేసేవి గవర్నరుగారే చేసేవి. గవర్నరుగారు శాసనసభను చేయమనికోరిన చట్టమును శాసనసభవారు నిరాకరిస్తే గవర్నరుగారిచేతనే చట్టంగా ప్రకటింపబడి అమలుజరిగేవి. ఇక గవర్నరుగారే స్వంతంగా చేసేవి చట్టాలనిన్నీ, ఆర్డినెన్సులనిన్నీ రెండురకాలు. ఈఆర్డినెన్సులు 6 వారాలవి 6 నెల్లవి అని రెండురకాలు. ఇక శాసనసభవారు శాసించవలసిన విషయాలకుకూడా చాలాసంకెళ్లున్నాయి. చట్టప్రకారం గవర్నరుగారి "ప్రత్యేక బాధ్యత"లకు సంబంధించినవిషయాలమీదను, అంతాగాని కొంతగానిశాసనాధికారంలోనుంచి కేటాయించబడిన భూభాగాలకు (excluded areas) సంబంధించినఅంశాలమీదను శాసనసభకు అధికారం లేదు. ఇక తతిమ్మాఅంశాల్లోకూడా కొన్నిబిల్లులు గవర్నరుగారి అంగీకారంతోగాని ప్రవేశంకావు. ఆవిధంగా ప్రవేశించినను చర్చ మధ్యలో మళ్లీ గవర్నరుగారి కిరకోవిధంగాతోస్తే అంతటితో వాటిని రద్దనవచ్చును. అవేకాదు. ఏచర్చనైనా ఆపవచ్చును. ఇక బిల్లు శాసనవర్గం అంగీకరించడందాకా వచ్చిందనుకుందాం. కాని అది చట్టమౌతుందని నమ్మకంలేదు గవర్నరంగీకరించేదాకా. దానిని ఆయన అంగీకరించవచ్చును. త్రోసివేయవచ్చును. త్రిప్పివేయవచ్చును. లేక గవర్నరుజనరలు ఆమోదానికి నిలిపిఉంచవచ్చును. గవర్నరుజనరలుగారున్నూ ఆలా

గేచేయవచ్చును. లేక చక్రవర్తిగారి ఆమోదాన్ని అన్వేషించవచ్చును.)

పైన తెలిపినవిధినిషేధాలకు లోబడి ఉభయసభలుగల రాష్ట్రములలో యేబిల్లుఅయినా ఉభయాంగీకారము పొందితేనేగాని శాసనార్హత వాటికిలేదు. ఇట్టిశాసనాలు గవర్నరుయొక్క అంగీకారం పొందితేనేకాని చట్టాలుకావు. గవర్నరుగారు శాసనవర్గంవా రంగీకరించిన యేబిల్లైనా తనవివేచన (Discretion) ననుసరించి రాజగారిపేరిట అంగీకరించవచ్చును. తిరస్కరించవచ్చును. లేక గవర్నరుజనరలుయొక్క అంగీకారానికి నిలుపుదల (Reserve) చేయవచ్చును.[1] ఇంతేకాక గవర్నరుగారు సదరుబిల్లుగాని, అందులో యేనిర్దిష్టభాగంగాని పునర్విమర్శనము చేయుమనిన్నీ, తాను యిచ్చినసవరణలు యోచించవలసిన దనిన్నీ శాసనసభకు త్రిప్పివేయవచ్చును. అప్పుడు శాసనవర్గమువారు తిరిగి యోచించవలెను. గవర్నరుజనరలు ఆమోదానికి గవర్నరునిలిపి యుంచినపక్షములో ఆయన తనస్వంతయోచన ననుసరించి (individual discretion)

1. సామ్రాజ్యముయొక్క చట్టాలకు వ్యతిరేకంగా ఉంటే హైకోర్టులయొక్కస్థితికి వ్యతిరేకిస్తే, జమీందారీ పెర్మనెంటు సెటిల్మెంటు విధానానికి సంబంధించినదైతే, జాతులకు, వ్యక్తులకు మధ్యపక్షపాతాలు చూపిస్తుందని తోస్తే, అల్లాంటి చట్టాలను గవర్నరుజనరలుగారి ఆమోదానికి నిలుపుదలచేయవలెనని రాజుగారి ఆజ్ఞాపత్రంలో ఉంది.

రాజుగారితరఫున ఆమోదించవచ్చును, తిరస్కరించవచ్చును, లేదా రాజుగారి ఆమోదానికి పెట్టవచ్చును, లేదా అవసరమని తోస్తే తానే పైనతెల్పినప్రకారం రాష్ట్రశాసనసభకు త్రిప్పివేయమని గవర్నరు నాజ్ఞాపించవచ్చును. అప్పుడుకూడా శాసన సభ్యులు యోచించాలి. గవర్నరుజనరలు ఆజ్ఞానుసారం గవర్నరు త్రిప్పివేసినబిల్లులు శాసనవర్గం యేరూపంలో అంగీకరిస్తుందో ఆవిధంగా తప్పక గవర్నరుజనరలు ఆమోదాన్ని పొందాలి. ఇక గవర్నరుజనరలు రాజుగారి ఆమోదానికి పెట్టిన పక్షంలో గవర్నరు కాబిల్లు శాసనసభవారిచే పంపబడిన తేదీలగాయితు 12 మాసములవరకు చట్టంకాదు. ఆప్రకారం 12 మాసాలు రాజుగారు మౌనంగావుంటే, ఆపిమ్మట రాజుగారు అంగీకరించినట్లు ప్రకటిస్తారు. గవర్నరుగాని, గవర్నరుజనరలుగాని అంగీకరించిన యేబిల్లునైనా సదరుఅంగీకారం తేదీమొదలు 12 మాసాలలోగా రాజుగారు దానిని తిరస్కారము చేయవచ్చును. గవర్నరు అందునుగూర్చి వెంటనే ప్రకటించాలి. ఆతేదీలగాయితు ఆచట్టంరద్దు. అనగా గవర్న రంగీకరించినబిల్లు తక్షణమే చట్టమగుతుంది, లాంఛనార్థమైన రాజుగారి ఆమోదానికి లోబడి. గవర్నరు పైకి పంపించినసందర్భాలలోనే యీపరిస్థితు లేర్పడతాయి. 1919 సంవత్సరం చట్టప్రకారం యిల్లాకాక ప్రతిబిల్లూ గవర్నరుజనరలు ఆమోదానికి గవర్నరు పంపాలి.

పైషరతులకు లోబడి ఉభయసభలు (ద్రవ్యసంబంధమైన కొన్నితప్ప) సవరణలతోగాని, లేకగాని ప్రతిబిల్లును అంగీకరించాలి. కాని వీరిలో అభిప్రాయభేదంవస్తే? అసెంబ్లీవారంగీకరించి కౌన్సిలుకు పంపినబిల్లు కౌన్సిలువారు 12 మాసాలలోగా, గవర్నరుగారికి, తమరామోదించి పంపాలి. ఆలా పంపకపోతే 12 మాసాలఅనంతరం గవర్నరుగారు అందునుగూర్చి యోచించడానికి ఉభయసభలను కలిపి సమావేశం చేయవచ్చును. ఆసభలో పైసభవారు కొన్నిసవరణలతో జాయింటు మీటింగుకు పూర్వం ఆబిల్లును అంగీకరించి తిరిగి దాన్ని అసెంబ్లీకి పంపించిఉంటే సదరుజాయింటుమీటింగులో ఆసవరణలే చర్చకువస్తాయి. పైసభవా రంగీకరించనివిషయాలకు సంబంధించిన సవరణలుకూడా ఉపపాదించవచ్చును. కౌన్సిలువారు యీ 12 మాసాలు కేవలం బిల్లునే అంగీకరించక త్రొక్కిపెట్టినపక్షంలో (Suspensive Veto) కాలాతీతంవల్ల అవసరమయ్యేసవరణలుతప్ప మరియితరసవరణలు ఆబిల్లుకు ఉపపాదించకూడదు. [1] అనగా బిల్లు ఉన్నదున్నట్లుగా ఓటుకు పెట్ట

1 కామన్సుసభవారి శాసనంపైన ప్రభువుల సభవారికి తిరస్కారాధికారంలేదుగాని కొంతకాలం దీనిని త్రొక్కిపెట్టి ఉంచే అధికారంకలదు. ఆకాలపరిమితి అయిపోయినతర్వాత అది చట్టమైపోతుంది, యీలోపుగా కామన్సుసభవారు పునర్విమర్శచేస్తేతప్ప. అంతేకాని ప్రజాభిప్రాయానికి చాలాదగ్గరగాయుండే క్రిందిసభ శాసనాలమీద నిర్ణయాధికారం పైసభకు ఉండదు. కౌన్సిలుసభకంటె ఎస్సెంబ్లీసభ ఆరురెట్లు ప్రజాభిప్రాయానికి దగ్గర

బడుతుంది. అయితే ఆర్థికానికిగాని తనప్రత్యేకబాధ్యతకుగాని యిట్టిబిల్లులుసంబంధించినవని తన "వివేచన"లో తోస్తే గవర్నరు 12 మాసాలలోగానే యీజాయింటుమీటింగును పిలువవచ్చును. (సె 73-77 లు)

శాసనసభనిబంధనలు:— ఉభయసభలకు నిబంధనలు సాధారణంగా యేకరీతిని ఉండును. ఈక్రిందివిషయాలనుగూర్చి గవర్నరే శాసనసభాధ్యక్షులతో సంప్రదింపులుమాత్రంచేసి నిబంధనను చేయాలి: ఈచట్టంక్రింద తాను స్వంతవివేచన, స్వంతనిర్ణయం (Individual Judgement) తో ప్రత్యేకం నిర్వహించవలసిన కార్యములకు చెందిన శాసనసభాచర్యలు యెల్లా ఉండాలో; సకాలములో ఆర్థికవ్యవహారాలు ముగించేటట్లుగా; సంస్థానములను గురించి ప్రశ్నలు, చర్చలు లేకుండాను; (బ్రిటిషుపౌరునికిగాని, రాష్ట్రములకుగాని సంబంధిస్తాయిగనుక అంగీకారము యివ్వవచ్చును అని గవర్నరంటే తప్ప,) రాజుగారు గవర్నరుజనరలుకున్ను, విదేశములు సంస్థానములతోనుండే సంబంధాలనుగూర్చి చర్చను ప్రశ్నలనునిషేధిస్తూన్నూ;

---

గాఉన్నది. (చూ. ప. గో. జిల్లా రెండుసభల ఓటర్లసంఖ్య) పైగా యీసభ ఒకవిధంగా స్థిరమైనది. ఇల్లాంటి కౌన్సిలుకు క్రిందిసభవారి శాసనాన్ని అంగీకరించకపోతే జాయింటుమీటింగుకు హక్కివ్వడం న్యాయంకాదు. అందువల్ల పైసభ సహాయంతో క్రిందిసభలోని కొందరిని చేర్చుకొని ప్రభుత్వంవారు ధనికవర్గమున్ను జనసామాన్య అభిప్రాయక్షేమానికి వ్యతిరేకంగా ప్రవర్తించడానికి వీలౌతుంది.

(తాను ముందామోదిస్తేతప్ప;) కొండజాతులనుగూర్చినట్టియు, కేటాయింపబడినట్టియు (Excluded areas) ప్రాంతాల పరిపాలనగూర్చి చర్చ, ప్రశ్న లేకుండాను (ఇట్టిపరిపాలనాసంబంధమైన ఖర్చులమీదమాత్రం చర్చ ఉండవచ్చును) సంస్థానాధిపతియొక్క వ్యక్తిని, చర్యను, హోదానుగూర్చి చర్చ, ప్రశ్న లేకుండాను.

పైనతెలిపిన జాయింటుమీటింగుల చర్యను గూర్చి కూడా నిబంధనలు గవర్నరుగారే పై ప్రకారం చేయవచ్చును. హైకోర్టు, సంస్థానంకోర్టు, జడ్జీలచర్యను శాసనసభవారు ప్రశ్నించరాదు. ఇంతేకాక శాసనవర్గంలో ప్రవేశముయ్యేముందు చెప్పబోయేకొన్ని బిల్లులు గవర్నరు ఆమోదంలేకుండా ప్రవేశమే కారాదు. ఇక యేబిల్లైనా చర్చలో ఉన్నప్పుడు సదరుబిల్లుగాని, చర్చగాని (ఇంతకుపూర్వం తాను ప్రవేశామోదంయిచ్చిందైనా,) అందులో క్లాజుగాని, అందునుగూర్చి ఉపపాదింపబడిన-బడనున్న సవరణలుగాని, తనప్రత్యేకబాధ్యతలకు, లేక రాష్ట్రములోని యేభాగములోనైనా శాంతిసామరస్యాలకు ప్రమాదముకలుగజేసే పని తన 'వివేచన'కు తోస్తే తక్షణంవాని నాపుజేయవచ్చును.

ఈషరతులకు లోబడి పై క్రిందసభలవారు తమవ్యవహారనిబంధనలు తాము చేసికొనవచ్చును. పై ప్రకారం గవర్నరుచేసిన నిబంధనలకున్ను, తమవాటికిన్ని ఏదైనా అంశం

మీాద తేడావస్తే గవర్నరుగారిదే చెల్లుతుంది. నూతనచట్టంక్రిందనిబంధనలు తయారయ్యేదాకా పూర్వనిబంధనలే అమలుజరుగుతాయి. పైనతెలిపిన జాయింటుసమావేశాలకు కౌన్సిలు సభాధ్యక్షుడే అధ్యక్షుడు. సభావ్యవహారమంతా యింగ్లీషులోనే జరగాలి. "ఇంగ్లీషురానివారుగాని, సరిగా రానివారుగాని (insufficiently acquainted) మరియొకభాషలోమాట్లాడవచ్చును. శాసనసభలో జరిగేచర్యలను (సభానిబంధనలను అతిక్రమించిన వనేకారణాం వల్లకూడా) కోర్టులకెక్కించుటకు వీలులేదు. శాసనసభలోని ఉద్యోగులు, యితర సభ్యులు చట్టంయిచ్చిన, చట్టంక్రిందఉన్న అధికారాలనుబట్టి సభావ్యవహారములను సరిచేయవచ్చును, ఆర్డరుకాపాడవచ్చును. ఇట్టి అధికారాలపైన కోర్టుకు పెత్తనంలేదు. (సె 84-87 లు).

ఆదాయవ్యయపత్రము:—"సాలుసరి ఆర్థికప్రకటనం" అనే పేరుతో జమాఖర్చు అంచనాను గవర్నరు శాసపసభలకు నివేదింపచెయ్యాలి. అందులో రాష్ట్రఆదాయముల హామీా మీాద జరిగేఖర్చులు, యితరఖర్చులు అని రెండుపద్దులు ఉంటాయి. ఇంతేకాక గవర్నరు తన ప్రత్యేకబాధ్యతలను (Special responsibilities) బట్టి అవసరమని అంచనా వేయించిన పద్దొకటి—యీామూడుపద్దులక్రింద ఆదాయవ్యయపట్టిక తయారగును. మొదటిపద్దు క్రింద గవర్నరుకార్యాలయం, జీతభత్యాలు, (ఇవి కౌన్సిలుఆర్డరువల్ల నిర్ణయమా

తాయి); రాష్ట్రిబాధ్యతగల ఋణములమీదవడ్డీ, సింకింగునిధి, Redeemption charges వగైరా, మంత్రులు అడ్వొకేటుజనరలు వగైరాల జీతభత్యములు, ఆలాగే హైకోర్టుజడ్జీల బాపతు, కేటాయింపబడిన భాగాలఖర్చు, కోర్టులిచ్చినతీర్పు, డిక్రీలవల్ల, కోర్టు లేక పంచాయితీలపరిష్కారాలవల్ల కలిగే తగులుబళ్లు; యీచట్టంక్రిందగాని, మరియేరాష్ట్రిచట్టంక్రిందగాని అయ్యేఖర్చులున్న వచ్చును. ఒక అంశము ఒకటవపద్దుక్రిందదా, కాదా అనే విషయం గవర్నరు 'వివేచన'నుబట్టి తేల్చబడుతుంది. ఇక యితరపద్దులక్రింద కావలసినఖర్చు గ్రాంటుల డిమాండ్లక్రింద కోరబడును.

ఈప్రకారం తయారైన బడ్జెట్టు—రెండుసభలూ ఉన్నచోట—క్రిందిసభకు నివేదించబడును. సదరు అసెంబ్లీ వారు మొదటిపద్దుక్రింది అంశాలమీద చర్చచేసినా వోటుచేయుటకు వీలులేదు. మిగతాపద్దులక్రింద డిమాండులను ఆమోదింపవచ్చును; తిరస్కరించవచ్చును: నిర్దిష్టమైన తగ్గింపుతో అంగీకరించవచ్చును. అసెంబ్లీచేసిన సవరణలతోకూడిన డిమాండుల (రెండు, మూడు పద్దులు)న్నూ, మొదటిపద్దుక్రింద వేయబడిన అంచనాలు (ఆదాయపుశాఖలు హామీవహించవలసిన ఖర్చులు) గలదిన్నీ—వీటిని తెలిపే జాబితాను తయారుచేయించి గవర్నరు ధ్రువపరచును (Authentication). కాని అసెంబ్లీవారు త్రోసివేసినట్టియు, తగ్గించినట్టియు, డిమాండులను తన

ప్రత్యేకబాధ్యతలకు అవసరమని తోస్తే మొదటకోరినప్రాప్తికి సదరుమొత్తములను గవర్నరు భర్తీచేయవచ్చును. ఆలా ధ్రువపర్చిన ఆదాయవ్యయపత్రం తిరిగి అసెంబ్లీకి నివేదిస్తారు. దానిమీద చర్చగాని, ఓటుగాని పనికిరాదు. సభ్యులకు ప్రభుత్వమువారు సూచించిన డిమాండులను తగ్గించే హక్కేగాని స్వతంత్రంగా ఒకఖర్చుపద్దును ప్రతిపాదించ (Appropriation of expenditure) వీలులేదు.

సాలుమధ్యలో అవసరంవచ్చే జమాఖర్చునుగూర్చి:— ఇదిగాక సాలుమధ్యలో ఆదాయశాఖలఖర్చులక్రింద బడ్జెట్టు అంచనాకంటె హెచ్చుకావలసివస్తే పైప్రకారమే గవర్నరు పత్రాన్ని ప్రవేశపెట్టించి అమలు జరుపవచ్చును.

క్రొత్తపన్నులు:— ఉన్నపన్నులు హెచ్చించుట, క్రొత్తపన్నులువేయుట, ఋణములను చేయువిషయంలోను, రాష్ట్రంవారు యితరులతో పెట్టుకున్న—పెట్టుకోబోయే ఆర్థికసంబంధములలో వారికి గలిగే నష్టాలనుగూర్చి హామీపడడం విషయంలోను, ఏదైనాఖర్చు ఆదాయపు హామీమీదిఖర్చు అనిప్రకటించుట(expenditure charged to Revenue) లేక దానిని హెచ్చించుట—వీటినిగూర్చినబిల్లుగాని, సవరణగాని గవర్నరు సిఫారుసుచేస్తేతప్ప సభలో పెట్టరాదు. వ్యక్తిసభ్యులకు అట్టిబిల్లు ప్రవేశపెట్టే అధికారంలేదు. కాని జుమానాలు, యితరపెనాల్టీలు వేసేబిల్లులు యీ నిషేధంక్రింద

(క్రొత్తపన్ను, హెచ్చుపన్ను క్రింద) రావు. ఇప్పుడున్న ప్రభుత్వశాఖల యేఖర్చైనా అధికంచేయడంలో పర్యవసించే యేబిల్లూ కూడా గవర్నరు సిఫార్సుమూలకంగా తప్ప ప్రవేశం కాకూడదు.

ఆంగ్లో-హైందవవిద్యకు ప్రత్యేకరక్షణం:—ఈవిద్యకు బడ్జెటులో ఒకకట్టుబాటు చేయబడింది. రాష్ట్రస్వతంత్రంకు పూర్వం అనగా 1933 సం॥రంకు పూర్వం దానిమీదసాయిాని ఎంత సాలీనా ఖర్చుపడుతూందో ఆమొత్తం యేటా బడ్జెటులో వేస్తూ ఎవరూమాట్లాడకుండా అమలుజరుగుతూ ఉండవలసిందే. దానిమీంద శాసనసభవారికి ఓటుహక్కు లేదు. కాని మొత్తం అసెంబ్లీసంఖ్యలో $\frac{3}{4}$ వంతు సభ్యుల తీర్మానంమీాద యిది రద్దు కాగలదు. ఇంకాతృప్తి కలిగించదికాదు కాబోలు నిర్మాతలకు. ఈప్రకరణంలో ఆఖరున "అల్పసంఖ్యాకుల న్యాయమైన క్షేమాన్ని కాపాడ్డానికి గవర్నరుకుగల ప్రత్యేకబాధ్యత"ను యీాపైఅంశాలేవిన్నీ బాధించవన్నారు యీాఅల్పసంఖ్యాక కరుణాసముద్రులు!

సారాంశము:—రాష్ట్రస్వతంత్రమేగాక ప్రజాభిప్రాయానికి ఎక్కువ దగ్గరగాయున్న క్రిందిసభకే ఆర్థికాలమీద ఆమోదాలుతెలిపే హక్కు యిచ్చినట్లు కనుపిస్తుంది. రూపంలో యిది బ్రిటిషువారి కామన్సుసభకు ప్రత్యేకంగా ఉన్న ఆర్థికస్వతంత్రంలా భాసిస్తుంది. కాని గవర్నరువగైరాల జీతభత్యా

ములతో కూడుకున్న మొదటిపద్దుమీద హక్కు లేదు. తదితర పద్దులో గవర్నరుగారు కోరినపద్దులు అసెంబ్లీసభ వారు మార్పు చేసినా లెక్కపెట్టకుండా భర్తీచేయబడతాయి. ఆప్రకారం ధ్రువపరిచిన పత్రంతిరిగి అసెంబ్లీకి తెలుపడమేకాని దానిమీద సభ్యులు మాట్లాడకూడదు. ప్రజాప్రతినిధులకు పన్నులమీద హక్కు లేదు. పన్నులమార్పుదలహక్కు లేదు. ప్రభుత్వము వారు విదేశీయులు, విదేశపుకంపెనీలతో పెట్టుకొనేసంబంధాల లో ఒకప్పుడు వారికొచ్చేనష్టాలకు పూచీపడుతో వుంటారు. అల్లాంటి పూచీపనికిరాదని గవర్నరుగారి ఆమోదం లేకుండా ఖండించడానికి వీల్లేదు. ఆంగ్లో-హైందవవిద్యను గురించి మాట్లాడడానికి వీల్లేదు. ఇదికాక కొన్ని అనిర్దిష్టకారణాలపైన కూడా గవర్నరు శాసనసభవారికి బడ్జెట్టుమీద హక్కుగల అంశాల లోకూడా జోక్యము పుచ్చుకోవచ్చును.

## రాష్ట్రకార్యవర్గం.

రాష్ట్రముయొక్క పాలనాధికారంయావత్తూ రాజుగారి తరఫున గవర్నరుగారిది. ఆయన దానిని ప్రత్యక్షంగాను, పరోక్షంగాను చలాయించును. కాని శాసనసభవారికి ఆయాసంస్థలకు చట్టప్రకారమున్న అధికారాలను వీరు తీసివేయజాలరు. ఈగవర్నరుగారికి కామనువెల్తు సిద్ధాంతంప్రకారం రాజుగారి ప్రతినిధిగా పాలనాధికారం ఉండడం బాగానేఉంది. ఏఅధినివేశములలో లేని, యేసాంప్రదాయములలో లేని శాసనాధికారం

కూడా ఉంది. బ్రిటీషు రాజ్యాంగంలో రాజుకున్న శాసనాధి కారం పార్లమెంటు సభాయుతమైయున్నది గాని వ్యక్తిగతంగా లేదు. వ్యక్తిగతంగా తమకు లేని శాసనాధికారాన్ని రాజుగారు గవర్నరుకు యేలాసంక్రమింపజేశారు? అయితే పార్లమెంటు వారిచ్చారని సమర్థిస్తారా? కార్యనిర్వహణం చెయ్యడమే ప్రధానంగాగలవారికి శాసనాధికారం యిస్తే శాసనసభ యెందుకు? తమకు కలిగిన ఆందోళనలో యిల్లాటిజారుపాటులనైనా యోచించారు కారు యీచట్టపు ముసద్దీలు. సిద్ధాంతచర్చలకు ఇది ఆక్షేపణ కాదు.

ఈగవర్నరును రాజుగారే నియమిస్తారు. వారి జీతభత్యములకు, హోదాకు సంబంధించిన అంశాలు ఆర్డరుప్రకారంగా రాజుగారు నిర్ణయిస్తారు.[1] ఈచట్టంలోని మినహాయింపులకు లోబడి రాష్ట్రశాసనసభ వారికి శాసనాధికారంవున్న అన్నివిషయాలలోను కార్యవర్గానికి కార్యనిర్వహణాధికారం ఉంది.

ఈగవర్నరుగారి రెండు హోదాలలో మనమర్థం చేసుకోవాలి. కేవలం రాజుగారివ్యక్తి ప్రతినిధిగా పాలించవలసిందిగా చట్టం తెలిపిన మినహాలు, ప్రత్యేక బాధ్యతలు—యీ

(1) మదరాసు, బొంబాయి, బెంగాలులలో 1 ల. 20 వేలు.
సం. రాష్ట్రం, పంజాబు, బీహారు, చెరి 1 లక్ష.
మధ్యరాష్ట్రాలు 72 వేలు.
అస్సాము, సింధు, ఒరిస్సా ప. స. పరగణాలు, చెరి 66 వేలు.
గవర్నరులకు సాలీనా జీతాలు తదితరములుగాక.

చట్టంయొక్క భద్రతకు అవసరమైనహక్కులు, దేశముయొక్క శాంతికి అవసరమైన అధికారాలు, యివన్నీ యించుమించు వ్యక్తిగతంగా పాలిస్తారు. స్వతవివేచన, నిర్ణయం, అభిప్రాయం, అనేఅర్థాలతో యీచట్టములో ఒకవిషయం వివేచననుబట్టి చెయ్యాలా ? నిర్ణయాన్నిబట్టి చెయ్యాలా ? అని సంశయపరిష్కారంకూడా గవర్నరుగారే చెయ్యాలి. ఒకవిషయంలో నిర్ణయం, అనేదే ఉపయోగించాలనిగాని కూడదనిగాని, అలాగే స్వంతవివేచనే ఉపయోగించాలనిగాని కూడదనిగాని యెవరున్ను ప్రశ్నించకూడదు. ఇక కేంద్రప్రభుత్వము, ఇండియామంత్రిగారి చట్టాలను, ఆజ్ఞలను అమలుజరుపుటకూడ వీరిప్రత్యేకబాధ్యతలలోనిదే.

ఇకచట్టం శాసనసభవారి కిచ్చినహక్కులనుబట్టి చేసే శాసనాలు అమలుజరిపే కార్యవర్గానికి అధ్యక్షుడు, అధిపతిగా యీయన రెండవహోదా తెలుసుకోవాలి. ఈహోదాలోనే యీయనకు సహాయం చేయుటకు సలహాలనిచ్చుటకు (ఇది పార్లమెంటరీ సాంప్రదాయభాష) ఒకమంత్రివర్గమును నియమిస్తారు. ఈమంత్రులు శాసనసభలో సభ్యులుగా నుండనక్కరలేదు. కాని మంత్రులైనతర్వాత ఆరుమాసాలలోగా సభ్యులుకావాలి. ఈమంత్రుల జీతాలు శాసనసభవారు నిర్ణయించాలనే ఒక్కవిషయంతప్ప క్యాబినెట్టుసూత్రం ఏమియు యీచట్టంలో నిర్వచింపబడలేదు. గవర్నరుగారికి రాజుగారిచ్చే

ఆజ్ఞాపత్రంలో శాసనసభలోని మెజారిటీపక్షనాయకుని ఆహ్వా నించమనిన్నీ, అతని సలహాపైననే తోడిమంత్రులను ఏర్పర్చ మనిన్నీ, వీరికి శాసనసభపట్ల సమిష్టిబాధ్యత ఉండునన్నిన్నీ, ఉన్నది. కాని యీమంత్రివర్గనిర్మాణంలో "అల్పసంఖ్యాకులకు" కూడా కొన్ని పదవులు గవర్నరుగారు లభించేటట్టు చూడాలి. సాంఘికమంత్రివర్గం మెజారిటీపార్టీమంత్రివర్గంఏలాఅవుతుందో ! శాసనసభవారి విశ్వాసమున్నంతకాలము యీమంత్రివర్గం అధికారంలో ఉంటుంది. ఇక యీమంత్రు లిచ్చినసలహాలను బట్టి వారిమీద కోర్టులలో చర్యజరుపకుండా రక్షణఉంది. ఇది మంత్రివర్గనిర్మాణం. సాధారణముగా రాష్ట్రము 1కి మం త్రులు 8 గురు ఉంటారు.

ఈక్రిందివి గవర్నరుగారి ప్రత్యేకబాధ్యతలు. ఇందులో మం త్రులసహాయసలహాలు గవర్నరునకవసరంలేదు. రాష్ట్రంయొక్క శాంతిసామరస్యములకు తీవ్రభంగంరాకుండాకాపాడుట, అల్ప సంఖ్యాకులరక్షణ, సివిలుసర్వీసువారికి వారికుటుంబాలకు, ఉం డేహక్కులు అవకాశాలు వారికిలభించుట, వారి యోగక్షే మాలను రక్షించుట, చట్టంలోచెప్పబడిన బ్రిటీషుకంపెనీలు, వ్యాపారాలు, హిందూదేశంలో వ్యవహారంచేస్తున్న ఆంగ్లేయ కంపెనీలు ఆవ్యక్తులకు సంబంధించిన రక్షణలు, కొంతవరకు కేటాయించబడిన ప్రాంతాలనెమ్మది న్యాయపరిపాలన, సం స్థానాధిపతుల హక్కుహోదాలు, చట్టంనాలుగోభాగంలో

చెప్పబడినప్రకారం గవర్నరుజనరలు 'లా' ప్రకారంయిచ్చేఉత్తరువులఅమలున్ను. మధ్యరాష్ట్రములలో బీరారును గూర్చియు, సింధులో సుక్కూరుడామును కాల్వలనుగురించి ఆగవర్నరులకు ప్రత్యేకబాధ్యతలుగలవు. తనప్రత్యేకబాధ్యతలపట్ల గవర్నరు స్వంతనిర్ణయమునుబట్టినడచును. ఇంతేకాక పోలీసుదళము (Civil & military) యొక్కనిబంధనలు, రిగ్యులేషనులు, ఉత్తరువులున్ను చేయుట, సవరించుటలో స్వంతనిర్ణయంతోనేచేయును. శాంతిభంగమే కాక హింసతోకూడిన విప్లవోద్యమాలు తలలెత్తుతాయనిన్ని, అవి ప్రభుత్వాన్ని తారుమారుచేయ నుద్దేశించినవనిన్నితోస్తే, ఆపరిస్థితులలో మంత్రిచేయవలసిన ధర్మములుకూడా గవర్నరు తానే నిర్వహిస్తారు. ఆలాటిసమయంలో తనవిధానాన్ని గూర్చి తెలపడానికి ఒకఉద్యోగిని శాసనసభలో యేర్పరుస్తారు. తనప్రత్యేకబాధ్యతక్రింద శాంతివాతావరణం, నెమ్మదికి భంగమని తోచేపరిస్థితుల్లో జరిపేచర్య వేరేజరుపవచ్చును. ఒకటి హింసాపూరితోద్యమాలకు, మరియొకటి అహింసాపూరితోద్యమాలకు యీరెండు ప్రత్యేకాధికారాలు ఉపయోగిస్తాయి. పైన తెలిపినలాంటినేరాలుచేసే మనుష్యుల చర్యలుతెలిపే సంజాయిషీలు ఏపోలీసుఉద్యోగిన్నీ మరియొక ఉద్యోగికిగాని లేకమరియేయితరమనిషికిగాని తెలుపకూడదు. ఉద్యోగికి ఉద్యోగి తెలుపవలసివస్తే పోలీసుఇన్స్పెక్టరు జనరలు లేక కమీషనరు ఉత్తరువివ్వాలి. ఇతరమనిషికి తెలుపవలసివస్తే

గవర్నరు వుత్తరువుకావాలి(మంత్రికి తెలపవలసివచ్చినా?). ఇల్లాగే సివిలుసర్వీసులో యున్నఉద్యోగి ఇతరమనిషికి (మంత్రులు వగైరాలకు) తెలుపవలసివచ్చినా గవర్నరుయొక్క అనుమతి వుండాలి. ఈవిధంగా నిబంధనలుచేస్తారు గవర్నరుగారు.

ప్రత్యేకబాధ్యతలు, స్వంతవివేచన-నిర్ణయం, శాంతిసామరస్యభంగం, హింసా విప్లవాలు, ప్రభుత్వం తారుమారగుట, చట్టప్రకారం తానుచేయవలసిన నిబంధనలు—ఈవిషయములలోగాక మిగతావిషయములలో రాష్ట్రప్రభుత్వం వీలుగా జరుగుటకున్ను, మంత్రులమధ్య శాఖాదివిభజనం జరుగుటకున్ను నిబంధనలు గవర్నరుగారేచేయుదురు. అలాచేయుటలో మంత్రులకార్యదర్శులు తమశాఖలలో జరిగేవ్యాపారాలునిబంధనలో చెప్పినప్రకారం గవర్నరునోటీసులో పెట్టుటకున్ను, మంత్రులు కార్యదర్శులు తమశాఖలలో జరిగేవ్యాపారాలలో గవర్నరుగారి ప్రత్యేకబాధ్యతలకు సంబంధించిన అంశాలువస్తూవుంటే అవిగవర్నరుగారి వర్దిలోపెట్టుచుండవలెనని కూడా నిబంధనలుంటాయి.

ఇదిగాక గవర్నరుగారి శాసనాధికారాలు:—శాసనసభసమావేశం కానప్పుడు అవసరమనితోస్తే 'ఆర్డినెన్సు' చేయవచ్చును. ఆర్డినెన్సు అనగా అప్పటికప్పుడు గవర్నరు చేసి అమలుజరిపే అసాధారణశాసనం. సదరు ఆర్డినెన్సులోని అంశాల

తోకూడినబిల్లు శాసనసభలోపెట్టాలంటే అలాంటిబిల్లుగవర్నరు యొక్కగాని, గవర్నరు జనరలుయొక్కగాని ప్రవేశాంగీకారం పొందవలసిందై యుంటుం దనుకోండి. ఇల్లాంటిపక్షంలో చేసే ఆర్డినెన్సులు గవర్నరు స్వంతనిర్ణయంతోనే చేయవచ్చును. లేక సదరు ఆర్డినెన్సులోని అంశాలు బిల్లురూపంగా రావాలంటే గవర్నరుజనరలు ప్రవేశాంగీకారం కావాలనుకోండి. లేక అట్టిబిల్లు ప్యాసైనపిమ్మట గవర్నరుజనరలుఆమోదానికినిలిపి ఉంచదగినది అని గవర్నరు తలచేదై యుంటుందనుకోండి.ఇల్లాంటి ఆర్డినెన్సులు గవర్నరుజనరలు సలహాలేకుండా చేయకూడదు. ఈఆర్డినెన్సులు చట్టాలలాగే అమలుజరుగును. ఇది శాసనసభ సమావేశమైన ఆరువారముల అనంతరం రద్దౌతాయి, లేక యీలోగా శాసనవర్గం దాన్నినిరసిస్తూ తీర్మానంచేసినాపోతుంది. దీనిచట్టంలాగే తిరస్కరించడానికి రాజుగారికి అధికారముంది. లేక యీలోగా యెప్పుడైనా గవర్నరే ఉపసంహరించవచ్చును. ఇది ఆరువారాల ఆర్డినెన్సు.

<u>ఇంకొకరకం ఆర్డినెన్సు</u>:—6 నెలలది. పరిస్థితులనుబట్టి తనకుధర్మమని, అవసరమని తోస్తే శాసనసభసమావేశంలో ఉన్నా లేకపోయినా ఆర్డినెన్సును గవర్నరుచేసి అమలుజరుపవచ్చును. ఇది 6 నెలలుండును. అనంతరం తిరిగి 6 నెలలు పొడిగించవచ్చును. గవర్నరుజనరలు, రాజుగారియొక్క పైఅధికా

శాలకులోబడి ఇది అమలుజరుగును. ఇందులోని అంశములు శాసనరూపకంగా అంగీకరిస్తే తప్ప శాసనసభవారు దీనిని రద్దు చేయజాలరు. ఈఆర్డినెన్సు గవర్నరుజనరలుతో సంప్రదించి చేయవలెను. అత్యవసర పరిస్థితులలో సంప్రదించనక్కరలేదు. కాని గవర్నరుజనరలు దానిని రద్దుచేయవచ్చును.

ఆర్డినెన్సులేకాదు గవర్నరుగారు చట్టాలే చేస్తారు స్వయంగా:-

తనకార్యాలు తృప్తిగా నిర్వర్తించడానికి అవసరమని తోస్తే తనే ఒకబిల్లు తయూరుచేసి గవర్నరుగారు దానికి 'చట్టం' అనేహోదాను యివ్వవచ్చును. లేక దానిని చట్టంగా చేయ కోరుచు శాసనసభకు సందేశంతో పంపవచ్చును. రెండవపద్ధతిప్రకారం తాను పంపిన బిల్లు నెలరోజులలోగా శాసనసభవారు చట్టంగా చేయనియెడల గవర్నరే చేయవచ్చును. ఈలా చేయడంలో శాసనసభవారు యీలోపుగా చేసేనివేదనను గవర్నరు యోచించాలి. ఈగవర్నరుగారి చట్టమున్ను శాసనసభవారిచట్టమువలెనే అమలుజరుగును. ఇందులోని అంశములు శాసనసభాచట్టంలో చేరినంతవరకే రద్దగును. లేకపోతే ఇవి స్థిరమైన శాసనాలే. ఈవిషయంలో గవర్నరు స్వంతవివేచనతో పనిజరుపును. గవర్నరుజనరలు అంగీకారంమాత్రం పొందాలి.

అసలుచట్టమునే రద్దుచేసే అధికారం:—ఈచట్టప్రకారం పరిపాలన జరుగడానికి వీల్లేని స్థితివచ్చిందని యెప్పుడై

నా గవర్నరుతలిస్తే యీచట్టప్రకారం యావత్తుపనులు తన స్వంత వివేచననుబట్టి తానే నిర్వహిస్తున్నాననిన్నీ, రాష్ట్రశాసన సభవగైరాలహోదాలన్నీ తానే పుచ్చుకొన్నాననిన్నీ ప్రకటించును. చట్టములోని రాష్ట్రముకు సంబంధించిన అన్నీ లేక కొన్ని భాగాలను 'సస్పెండు' చేసినట్లుకూడ తెలుపును. కాని హైకోర్టులను గాని, వాటి కార్యాలనుగాని, వీటికి సంబంధించిన చట్టములనుగాని సస్పెండుచేయవీలులేదు. ఇట్టిప్రకటనను చేసినవెంటనే పైవారికి తెలుపాలి. దీనిని రద్దుచేస్తూ యింకొకప్రకటనను చేయవచ్చును. పైప్రకటన సదరు తేదీలగాయితు 6 మాసాలవరకు అమలులోనుండును. పార్లమెంటువారు మరి 12 మాసాలు పొడిగించవచ్చును. ఈప్రకటనప్రకారం శాసనాధికారములు తనస్వాధీనంలో ఉంచుకున్న కాలంలో గవర్నరుగారు చేసిన శాసనాలన్నీ యీప్రకటన రద్దై శాసనసభలు యేర్పడినను రెండుసంవత్సరము లమలులో నుండును. ఈసెక్షనులక్రింద స్వంత వివేచనతో గవర్నరు వ్యవహరించును. ఈప్రకటన చేయుటలో గవర్నరుజనరలును సమాధాన పరచనక్కరలేదు.

రాష్ట్రప్రభుత్వముయొక్క చర్యలన్నీ గవర్నరుపేరుతో జరుగును. ఆజ్ఞాపత్రం, కౌన్సిలు ఆర్డరలోని అంశములు నిబంధనలక్రింద చేయబడును. వాటిని గవర్నరు ధ్రువపర్చును. సదరునిబంధనలు ఆజ్ఞాపత్రము, ఆర్డరతోటి ఎక్కడైనా విరోధించినప్పటికీ ఎవరున్నూచర్యజరుపుటకు వీలులేదు.

శాసన, పరిపాలనకు సంబంధించినవిషయాలు(Subjects) మూడురకములు. రాష్ట్రప్రభుత్వము వారికి శాసనపరిపాలనాధికారములు కలవి; కేవల సమాఖ్య ప్రభుత్వము వారికే శాసక పరిపాలనాధికారములు కలవి; ఒక్కవిషయమునుగురించే సమాఖ్యఅవసరాలనిమిత్తంఆశాసనకార్యవర్గంవారికిన్ని రాష్ట్రఅవసరాలనిమిత్తం రాష్ట్రశాసన కార్యవర్గం వారికిన్ని పరిపాలనాధికారం కలవిన్ని. ఆఖరు రకాన్ని(Cuncurrent Legislation)అంటారు ఈమూడురకాలుగా తయారుచేయబడిన జాబితాలు 3 వ అనుబంధములో చూపనగును.

---

# మూడవ అధ్యాయము.

## సమాఖ్యభారతప్రభుత్వము.

చట్టం రెండవభాగంలో సమాఖ్యప్రభుత్వనిర్మాణం, అధికారబాధ్యతలనుగూర్చి తెలుపబడింది. ఈసమాఖ్యవిధానముకు సంస్థానములు, బ్రిటిషుభారతములోని రాష్ట్రములు అంగములు. వీరల్లకుగల అన్యోన్యసంబంధము చట్టము నిర్ణయించింది. ఇదివరలోని భారతప్రభుత్వం ఏకదేశవిధానం (Unitary system) పై నడచుటచేత సర్వరాజ్యాధికారము కేంద్రానిదే. రాష్ట్రాలకుగల రాజ్యాధికారం కేంద్రంవారు, వారిపైవారు ఒడంబడికవల్ల యిచ్చిందికాక సౌకర్యార్థము డెలిగేటు చేసినదే. అందుచేత యిప్పటివలె అన్యోన్యసంబంధముల నిర్వచనం అప్పుడంతగా అవసరం లేకపోయింది. సమాఖ్యఅనడంతోటే అంగములైన రాష్ట్రసంస్థానాలకు అంగిఅయిన సమాఖ్యప్రభుత్వానికిగల సంబంధం చట్టపూర్వకంగా నిర్వచనం కావలసివచ్చింది. అందుచేత యిదిచట్టషరతులకు లోబడి జరిగిన ఒడంబడికలాంటిది.

కాని యీసమాఖ్యప్రభుత్వంక్రింద యెప్పుడే స్టేటుకౌన్సిలుసభలోనిస్థానాల్లో 52 స్థానాలు పూర్తిచేయుదగినటువంటివిన్నీ (అనగా సంస్థానములలో సగంకు దరఖాస్తులురావాలి) మొత్తం సంస్థానాల ప్రజాసంఖ్యలో సగంసంఖ్య కలిగినట్టివిన్నీ,

సంస్థానములవారు యిందులో చేరుటకు అంగీకరించినగాని అమలుకురాదు. ఇందుకుగాను వారు సమాఖ్యప్రభుత్వమునకు తమకు సంబంధించిన యేయేవిషయాలలో శాసనం చేయమంటారో, వానిహద్దులేమిటో, యేవిషయములలో సమాఖ్య ప్రభుత్వంవారి కార్యనిర్వహణాధికారానికి ఫెడరల్ న్యాయస్థానానికి తమరు తమతరములవారు బద్ధులు కాదలచుకొన్నారో తెలుపుచు ఒకదరఖాస్తును పెట్టుకోవాలి. దానినే 'అంగీకారపత్రం' (instrument of accession) అంటారు. సమాఖ్యయేర్పడ్డానికి మునుపుగా పంపబడే యిట్టిదరఖాస్తులు పార్లమెంటువారికోరికమీద రాజుగా రంగీకరించాలి. సమాఖ్య ప్రభుత్వంయేర్పడిన 20 సంవత్సరాల అనంతరం వచ్చేదరఖాస్తులు సమాఖ్యశాసనసభవారికోరికమీద రాజుగారు అంగీకరించవచ్చును. విధిగా రాజుగారు అంగీకరించాలనిగాని, సమాఖ్య విధానానికిన్నీ, అంగీకారపత్రంలోనివిషయాలకున్న సంబంధించనికారణంచేత త్రోసివేయకూడదనిగాని నియమంలేదు. ఈ ప్రకారం ఒకసంస్థానం చేరినపిమ్మట, అది సమాఖ్యకు యింకా యేవైనాహక్కు లివ్వనంగీకరించినయెడల దానికికూడా అంగీకారపత్ర ముండాలి. అంగీకారపత్రంలోని అంశాలకు భిన్నం రాకుండాను, ఆప్రకారం ప్రభుత్వంకు గవర్నరుజనరలుకు సంస్థానాలతోవుండే సంబంధంలో మార్పులేకుండాను (అట్టి మార్పు సంస్థానాధిపతుల అంగీకారంలేకుండా జరుగదు.)

యీచట్టంగాని మరియొకశాసనంగాని మారాలి. కాని యీ చట్టం రెండవషెడ్యూలులోని అంశాలు అంగీకారపత్రంతో సంబంధంలేకుండా మారవచ్చును. ఇందువల్ల చిక్కులు కలుగ వచ్చునని 'కెయితు' పండితునిమతం.

ఈసమాఖ్యప్రభుత్వం యేర్పడేవరకు యిప్పుడున్న ఢిల్లీ కేంద్రప్రభుత్వవిధానమే అమలులోనుండును. వెనుకచెప్పిన రాష్ట్రపాలనావిధానం నడవడానికి అవసరమైనంతవరకుచట్టంలో చెప్పబడినప్రకారం ప్రస్తుతకేంద్రప్రభుత్వం మార్పుచెందుతుంది.

సమాఖ్యశాసనవర్గానికి నియోజకవర్గం:—శాసనవర్గం రెండుసభలతో కూడుకొనివుంటుంది. క్రిందిసభపేరు 'ఫెడరలు అస్సెంబ్లీ' పైసభపేరు 'ఫెడరలుకౌన్సిలు ఆఫ్ స్టేటు' క్రిందిసభ కు బ్రిటిషుభారతప్రతినిధులకు 250 స్థానాలు. సంస్థాననియమి తులు 125 గురు. మొత్తం 375 వరకు వుంటారు. పైసభకు 156 గురు బ్రిటిషుభారతప్రతినిధులు. సంస్థాననియమితులు 104 మొత్తం 260. క్రిందిసభకు బ్రిటిషుభారతస్థానాలు పూర్తిచేయు డంలోసాధారణస్థానాలన్నీ ఆయారాష్ట్రశాసనవర్గాలలోనిసభ్యు లచేత యెన్నికమూలంగా పూర్తిఅగును. స్త్రీ, యూరోపియను, ఆంగ్లో-హైందవ, క్రైస్తవస్థానాలు ఆయారాష్ట్రసభలలోని వీరిప్రతినిధులు దేశమొత్తంపైన సమావేశమై వారివారిస్థానము లను యెన్నుకొంటారు. కార్మిక, జమీందారీ, వర్తకస్థానాలు రాష్ట్రంలోని కార్మికసంఘాలు, జమీందారీబోర్డుల్లు, వర్తకసం

ఘూలచేతను పూర్తిచేయబడతాయి. మహమ్మదీయస్థానాలకు రాష్ట్రశాసనవర్గంలోని మహమ్మదీయసభ్యులే యెన్నికదార్లు. పంచమస్థానాలకు ప్రాథమికయెన్నికలలో రాష్ట్రసభ్యత్వానికి "ప్యానలు'గా యెన్నుకోబడిన (నియోజకవర్గమునకు 4 గురు చొప్పున) వారందరుకలసి ఒక్కొక్కస్థానమునకు 4 గురు చొ॥ మొదటిఎన్నిక జరుపుతారు. అటులు యెన్నుకోబడినవారిలోనుండి పంచములకు నిర్ణీతమైన సమాఖ్యస్థానములు రాష్ట్రశాసనసాధారణసభ్యులే పూర్తిచేస్తారు. స్త్రీలస్థానాలు: యిద్దరు మహమ్మదీయస్త్రీలు, ఒకహైందవక్రైస్తవస్త్రీకి ప్రత్యేకించబడును. ఇవిగాక యావద్భారతదేశంమీద కొన్నిస్థానాలున్నాయి. అవి వర్తకకార్మికస్థానాలు. ఆసంస్థలు వాటినిపూర్తిచేస్తాయి. ఇక యీసంస్థానప్రతినిధులను సంస్థానాధిపతులే నియమిస్తారు. ఆప్రజలసంబంధమునుగూర్చిచట్టము మౌనందాల్చింది.

పైసభకు మతసాంఘికస్థానములు రాష్ట్రములలో ద్వితీయసభలున్నచోట ఆసభలలోనివారిప్రతినిధులును, లేనిచోట అస్సెంబ్లీలోని అట్టిమతసాంఘికసభ్యులున్నూ పూర్తిచేయుదురు. స్త్రీస్థానాలు రాష్ట్రశాసనవర్గంలోని స్త్రీపురుషసభ్యులే ఎన్నుకుంటారు. పంచమస్థానాలు రాష్ట్రశాసనవర్గంలోని పంచమసభ్యు లెన్నుకొంటారు. ఇక సాధారణస్థానాలు సరాసరిగా ఎన్నుకోబడతాయి. ఇందులోవుండే ఓటర్ల అర్హతలు యిప్పటి స్టేటుకౌన్సిలు ఓటర్లలాంటివి. వీరిఅర్హతలు రాష్ట్రకౌన్సిలుకు

ఓటర్లకుండే అర్హతలకు దగ్గరగావుంటును. ఈ సభయొక్క ఓటర్లసంఖ్య ప్రస్తుతం లక్షకు పెంచబడింది. సంస్థానస్థానాలు సంస్థానాధిపతులచేత నే నియమితమగును. అసెంబ్లీఅభ్యర్థికి 25 సంllలు, కౌన్సిలు అభ్యర్థికి 30 సంllలు వయస్సుండాలి. బ్రిటిషుపౌరుడుగాని, సమాఖ్య నంగీకరించిన సంస్థానాధిపతి లేక అతని పౌరుడుగాగాని (ఇతరఅర్హతలతోబాటు) అభ్యర్థి వుండాలి. దీనికి మినహాకూడకలదు. ఇవి వుభయనియోజక వర్గాలకు చెందినముఖ్యాంశాలు. ఫెడరలుఅసెంబ్లీ కాలపరిమితి 5 సంవత్సరములు. స్టేటుకౌన్సిలు స్థిరమైనసభ. మూడుసంవత్స రముల కొకసారి మూడవవంతుచొప్పున సభ్యులు తగ్గిపోవు దురు. తిరిగి ఆభాగాని కెన్నికలు జరుగును.

(చూ. 2 వ అనుబంధము.)

శాసనవర్గనిబంధనలు, వ్యవహారాలు:— రాజభక్తిప్ర మాణం, సభ్యులహోదాలు, విధులు, జీతభత్యములు, అధ్య క్షులనియామకము, భాష, మొదలైనవన్నీ రాష్ట్రశాసనసభ్య లకువలెనే యుండును. గవర్నరుజనరలుకు శాసనసభాచర్యలు ఆపుచేసే అధికారంకలదు. శాసనసభానిబంధనలను గూర్చి గవర్నరుగారికివలెనే, గవర్నరుజనరలు అధికారాలున్నా. గవ ర్నరువలె ప్రత్యేకబాధ్యతలకు సంబంధించిన అంశాల్లోనేగాక గవర్నరు జనరలు మినహాయింపులు, రక్షణలకు సంబంధించిన అంశాల్లోకూడా—సభాధ్యక్షులను సంప్రదించినను— సభా నిబంధనలను తానేచేయును. శాసనవర్గముకు రాదగినబిల్లు క్రింద

సభలోగాని పై సభలోగాని ప్రవేశపెట్టవచ్చును. ఉభయసభలు సవరణలతోగాని లేకగాని అంగీకరించాలి. అప్పుడే దానికి చట్టమయ్యే అవకాశంకలుతుంది. ఒక సభవారంగీకరించిన బిల్లు మరియొకసభవారు తిరస్కరించినగాని, లేక సవరణలలో అభిప్రాయభేదం వచ్చినగాని లేక రెండవసభకు మొదటిసభవారు అంగీకరించి బిల్లునుపంపినకాలం 6 మాసాలుదాటిపోయినప్పటికి గవర్నరుజనరలుగారికి వారు దానిని నివేదించనియడలగాని—అసెంబ్లీసభ యీలోగా రద్దగుటవల్ల బిల్లు రద్దైతేతప్ప— గవర్నరుజనరలుగారు జాయింటుమీటింగు సమావేశపరచవచ్చును. సదరు అంశము ఆర్థికం లేక తన ప్రత్యేకఅధికార, బాధ్యతలకు, సంబంధముగలదని తోస్తేను, సదరు ఆలస్యం చేసిన సభవారు అంగీకరించే పక్షంలోకూడా అనవసరకాలయాపనం జరుగుతుందని తోస్తేను, యీలోగానే అనగా వెంటనేకూడా సమావేశపరచవచ్చును. సదరు 6 మాసములు లెక్కపెట్టడంలో సభసమాప్తిచేయడంలోపోయినరోజులున్న; 4 కంటె అధికంగా వాయిదాపడిన రోజులు లెక్కకురావు.

బిల్లులు అంగీకరించబడినతర్వాత గవర్నరుజనరలుకు అంగీకార తిరస్కారాదిహక్కులన్న గవర్నరుకులాగే ఉన్నాయి. లేక రాజుగారి ఆమోదానికినిలిపి ఉంచవచ్చును. రాజుగారి ఆమోదానికిపెట్టిన బిల్లు 12 మాసాలలో ఆమోదం తెలుపకపోతే పోతుంది. అంగీకరించిన బిల్లులుకూడా రాజుగారు

12 మాసాలలో తనతిరస్కారాన్ని తెలిపితే ఆనోజునుంచి చట్టంరద్దు. పై ఆమోదతిరస్కారాలు రాజగారు కౌన్సిలు ఆరర్డర్లమూలంగా తెలపాలి. ఇక్కడ తెలిపిన ప్రత్యేకవిషయాలు తప్ప తక్కినసభావ్యవహారమంతా రాష్ట్రాల్లోవలెనే జరుగుతుందని తెలుసుకోవలెను.

<u>ఆదాయవ్యయపట్టి</u>:—'సాలుసరి ఆర్థికపత్రం' అనేపేరుతో ఆదాయవ్యయముల అంచనా తెలిపే "బడ్జటు" సమాఖ్య ఆసెంబ్లీకి నివేదింపచెయ్యాలి. అది తయారుచెయ్యడం రాష్ట్రపు 'బడ్జటు' వలెనే. ఇాదులో ఆదాయశాఖలు హామీావహించవలసిన ఖర్చులు అనే పద్దుక్రింద గవర్నరుజనరలు కార్యాలయము, జీతభత్యాలు, సమాఖ్యప్రభుత్వానికి బాధ్యతగల ఋణములపైన వడ్డీ, సింకింగునిధి, ఋణతీర్మానములఖర్చు, ఋణాలుచేయుట తీర్చుటలో అయినఖర్చులు; మంత్రులు, కౌన్సిలర్లు, అడ్వొకేటుజనరలు, ఛాఫ్కమిషనర్లు, ఆర్థికనిపుణులు-వీర్ల జీతాలు; సమాఖ్యన్యాయస్థానపు జడ్జీలజీతాలువగైరా విదేశ, సేన, మతం, గుంపుజాతులకు సంబంధించినవి, యింకా యీాచట్టంక్రింద గవర్నరుజనరలు పాలించవలసిన భాగాలు యీావిషయములలోను, యీాచట్టప్రకారము యేయే అంశాలలో యీాయన తనస్వంతవివేచన ఉపయోగించాలో అంతవరకున్ను, "కేటాయింపబడిన భాగాల"కు గ్రాంటులున్ను, కోర్టు డిక్రీలు, జడ్జిమెంట్లు, పరిష్కారములకుగాను అయ్యే

ఖర్చులున్ను, యీచట్టం క్రిందగాని సమాఖ్యశాసనసభాచట్టం క్రిందగాని అయ్యేఖర్చులున్ను, సభ్యుల ఓటుకు పెట్టరు.

రాష్ట్రంలోవలెగాక యిక్కడ ఉభయశాసనసభలకు బడ్జట్టు నివేదించాలి. కాని ఒకడిమాండు క్రిందిసభ తిరస్కరిస్తే గవర్నరుజనరలుగారు కోరితేతప్ప పైసభకు దానిని నివేదించకూడదు. ఒకడిమాండును తగ్గించి క్రిందిసభ ఆమోదిస్తే ఆకోత భర్తీచేయుటకు కోరుతూ కౌన్సిలుకు దానిని పంపవచ్చును. ఈరెండు విషయములలోను అసలంచనానుదాటి గవర్నరుజనరలు కోరరాదు. ఉభయసభలకు అభిప్రాయభేదాలువస్తే పైన తెలిపినపద్ధతిని జాయింటుసమావేశం జరపాలి. ఒకవేళ ఉభయసభలు అంచనాప్రకారం గ్రాంటులను చేయకపోతే తనబాధ్యతననుసరించి గవర్నరుజనరలు అంచనాపరిమితికి వాటిని భర్తీ చేయవచ్చును. క్రైస్తవమతాన్నిగూర్చి సాలునకు రు 42 లక్షలు (జీతాలుకాక) గవర్నరు జనరలు ఖర్చుచేసితీరాలి. ఈ అంశములకు లోబడి ఆర్థికపత్రపుచర్చఅంతా రాష్ట్రంలో జరిగినట్లే జరుగుతుంది. (సె 33-37 లు.)

**సాధారణంగాజరిగే శాసనసభావ్యవహారాలు:—**

గవర్నరుజనరలు చేయవలసిన నిబంధనలు సంస్థానం, విదేశములతో రాజుగారి సంబంధం, గుంపుజాతులు, కేటాయించబడిన భాగాలకు సంబంధించిన విషయాలు, (వీటిఖర్చు అంచనాను గూర్చి చర్చింపవచ్చును,) రాష్ట్రవ్యవహారములమీద స్వంత

వివేచనమునుబట్టి గవర్నరుజనరలు తీసుకున్న చర్యను, సంస్థానాధిపతియొక్క వ్యక్తిచర్యలు,[1] కుటుంబాన్నిగూర్చి—యీ అంశాలనుగూర్చి ప్రశ్నలు, చర్చలు గవర్నరు జనరలుగారి అనుమతిలేకుండా జరుపవీలులేదు. సభాచర్య నిబంధనలన్ని జాయింటుమీటింగులసహా వుభయసభాధ్యక్షులతోను సంప్రదించి గవర్నరు జనరలుగారే చేయుదురు. ఇవిగాక సంస్థానపరిపాలన. ఆర్థికపత్రం సకాలంలో తయారగుట, గవర్నరుజనరలు స్వంతబాధ్యతలుగల విషయములపైన చర్చను సభలో సరిచేయుట మొదలైనవాటిల్లో రాష్ట్రసభలోవలెనే యిక్కడాగవర్నరుజనరలు సభాధ్యక్షులతో సంప్రదించి నిబంధనలు చేయును. ఇవిగాక మిగతావిషయములలో శాసనవర్గమే నిబంధనలుచేసుకుంటుంది. వుభయనిబంధనలకు భేదంవస్తే గవర్నరు జనరలు నిబంధనే నిలుస్తుంది. (సె 38-41 లు)

గవర్నరుజనరలుయొక్క శాసనాధికారాలు :—

6 వారాల ఆర్డినెన్సు 6 నెలల ఆర్డినెన్సు స్వంతంగాశాసనంచేయుట, తాను పంపినబిల్లును శాసనవర్గం శాసనంచేయకపోతే తానే దానిని శాసనంగా ప్రకటించుట, యీచట్టం అమలుజరుగదని తోచినపుడు అన్నిఅధికారాలు తనవేనని ప్రకటించుట—ఈ

1. తమ అనాగరపుచర్యలను విమర్శించటానికైనా ఒప్పుకోని సంస్థానాధిపతులనుకూడ కట్టుకోడానికి గాను ముఖ్యంగా ప్రజాప్రతినిధులకు యీ విషయంలో స్వేచ్ఛను లాగేశింది చట్టం అన్నాడు 'కెయిత్' పండితుడు.

విషయాల్లో గవర్నరులాగే గవర్నరుజనరలుకు హక్కులున్నాయి. (సె 42-45 లు)

గవర్నరుజనరలు కార్యవర్గం (మంత్రులు, సభ్యులు):-

రాష్ట్రకార్యవర్గంలో తీసివేయబడిన ద్వంద్వపరిపాలన కేంద్రప్రభుత్వంలో ప్రవేశించింది. ఈచట్టంకులోబడి సమాఖ్యప్రభుత్వంయొక్క కార్యనిర్వహణాధికారం రాజుగారితరఫున సరాసరిగాగాని, తాబేదార్లవలనగాని గవర్నరుజనరలుచేత చెలాయించబడును.[1] కాని యీచట్టంక్రింద శాసనసభవారికిన్ని, కోర్టులకుయున్న అధికారాలకు భంగంలేదు. ఈచట్టనిబంధనలకులోబడి సమాఖ్యపాలనాధికారం (Federal administrative authority) సమాఖ్యశాసనవర్గంకు శాసించడానికి హక్కున్న అన్నిఅంశాలలోను, బ్రిటిషుభారతంలో రాజుగారితరఫున నావిక, సైనిక, వైమానికదళాలను నిర్మించి పాలించుట, గుంపుజాతుల (Frontier Tribes) తో, సంధి, ఆచారాలువగైరాలవల్ల యేర్పడినహక్కు, అధికారాల నిర్వహణంకుకూడా వ్యాపిస్తుంది. చట్టంలో స్పష్టంగా తెలిపితేతప్ప యీసమాఖ్యకార్యవర్గాధికారం రాష్ట్రశాసనసభవారు శాసించదగిన అంశములకున్ను, అంగీకారపత్రప్రకారం సంస్థానాలు శాసనసభాపరంచేయుటకు ఒప్పుకొన్న అంశాలు ఆప్రకారం ఆహద్దులలో అమలుజరుపుటతప్ప—సంస్థానాలకున్ను, బ్రి

1 గవర్నరుజనరలుగారి జీతం సాలుకు రు 250800– తదితరఖర్చులుగాక-

టిషు, సంస్థానపౌరులను తప్ప తదితరులను హిందూదేశపు యో సేనలోను చేర్చుకోడానికిన్నీ యీఅధికారం వర్తించదు.

ఈచట్టం ఒకటోభాగంప్రకారం తమతాబేదార్లకు సంక్రమింపచేయదలచుకొన్న అధికారాలుతప్ప మిగతావాటిల్లో అట్టిదశాలకు 'కమీషనులు' రాజుగారే యిస్తారు. (సె 8)

సమాఖ్యశాసనసభవారు శాసించుట కధికారమున్న విషయాలలో కార్యనిర్వహణాధికారం, యెనిమిదవసెక్షనుతో నిమిత్తంలేకుండా, సంస్థానాధిపతియందే యున్నది. కాని సమాఖ్యశాసనంప్రకారం సమాఖ్యాపాలనాధికారమే చెల్లుబడికావలయునని తెలుపబడిన అంశములకు ఇది వర్తించదు

ఈయనకార్యవర్గంలో 10 మందికి మించకుండా సహాయసలహాలను (గవర్నరుజనరలుగారు స్వంతముగా చూచుకోవలసిన విషయాల్లోగాక) తనకార్యాల్లో చేయడానికి ఉండాలి. రాష్ట్రంలోలాగే వీరుకూడా శాసనసభ్యులుగా మొదట ఉండనక్కరలేదు. ఈచట్టప్రకారం తాను స్వంతనిర్ణయం చేసుకొనే విషయాలకు యీసహాయసలహాలు వర్తించవు. ఈమంత్రుల నియామకంలో 'క్యాబినెట్టు' మాత్రం చట్టంలో వాచ్యంకాలేదు. పైగా తనమంత్రులను తానే యేరుకొని పిలవాలనికూడా ఉన్నది. (సె. 10) ఆజ్ఞాపత్రంలో శాసనవర్గంలో "నిలకడ అయినమెజారిటీ సంపాదించుకొనేవానిని" సంప్రదించి మంత్రివర్గం యేర్పరచాలనిన్నీ అవ్యక్తిసంస్థానములకు అల్పసంఖ్యాకు

లకు మంత్రిత్వంలో స్థానాలు ఉండేటట్లు చేయక తప్పకపోయినా సమిష్టి బాధ్యతను మరువకూడదనిన్నీ ఉన్నది. గవర్నరుజనరలు యిష్టాన్నిబట్టి కార్యవర్గంకు అధ్యక్షతవహించవచ్చును. వారి జీతాలు మొదటిదఫా గవర్నరుజనరలు నిర్ణయిస్తారు. కాని ముందునుంచి శాసనసభవారు నిర్ణయించినా ఉద్యోగకాలంలో జీతాలుమార్చ వీలులేదు. ఈచట్టంక్రింద స్వంతవివేచన, నిర్ణయం ఉపయోగించవలసిన స్థలాల్లో గవర్నరుజనరలు నిర్ణయమే ఆఖరుమాటగా చెల్లుతుంది గాని ఒకదానికొక టుపయోగించినారనిగాని, ఉపయోగించదగనిచోట ఉపయోగించినారనిగాని ఎవరును ప్రశ్నించవీలులేదు. అలాగే మంత్రులుయిచ్చిన సలహాలనుకూడా ప్రశ్నించవీలులేదు. కోర్టులకు హక్కులేదు.

పైన తెలిపిన స్వంతవివేచన, నిర్ణయమువల్ల చేసేవి, శాసనసభల సమావేశము, సమాప్తికాలంలోగా రద్దుచేయుట, శాసనముల ఆమోదతిరస్కారాదులు, నిబంధనలు చేయుట నిబంధనలు భేదించుటలో పరిష్కరించుట, ఆర్డినెన్సులు శాసనాలు చేయుట, చివరకు చట్టమునుకూడా రద్దుచేయుట, ఆర్థికపత్రంలోని డిమాండులను నిలవబెట్టుట, మొదలైన నిరంకుశపుకార్యాలేకావు. గవర్నరుజనరలు మినహాయింపులు, రక్షణలు, అనేపేర్లతో యీక్రింది అంశాలలో మంత్రులసలహా అక్కరలేకుండానే శాసనసభకు బాధ్యతలేకుండానే ప్రత్యేక పరిపాలనచేయును.

మినహాలు:—దేశరక్షణ (సేన) మతం (క్రైస్తవ) విదేశవ్యవహారములు (అధినివేశములకున్న యీసమాఖ్యప్రభుత్వమునకుండే సంబంధములు దీనిక్రిందకురావు) పశ్చిమోత్తర సరిహద్దుప్రాంతములవారలతోటి సంబంధములు—ఇవి "స్వంత వివేచనము"తో గవర్నరుజనరలు పరిపాలించును. ఇందులో సహాయార్థము ముగ్గురుకౌన్సిలర్లను గవర్నరుజనరలుగారు నియమించుకొంటారు. వీరిజీతాలు, ఇతరషరతులు సభాయుతుడైన రాజుగారు నిర్ణయిస్తారు.

ప్రత్యేకబాధ్యతలు:—ఇవిన్నిగాక గవర్నలుజనరలుగారికి ప్రత్యేకబాధ్యత లనేవిగలవు. ఇవి గవర్నరుజనరలు స్థానే రాష్ట్రాల్లో గవర్నర్లు ప్రత్యేకంగా నిర్వహిస్తారు. అవి యేవంటే ఏభాగంలోనైనా శాంతిసామరస్యాలకు భంగంరాకుండా కాపాడుట, సమాఖ్యప్రభుత్వంయొక్క ఆర్థికసౌష్ఠవం పరపతికాపాడుట, అల్పసంఖ్యాకుల హక్కులరక్షణ, ప్రభుత్వసేనలో వుండినట్టివారికిన్ని, వారికుటుంబములవారికిన్ని చట్టములో పొందుపరచబడిన లేక దానిక్రింద గాపాడబడిన హక్కులను అట్టివారికి లభించేటట్టుచూచుట, వారిక్రమమైన క్షేమాన్ని రక్షించుట, 5 వ భాగంలోని 3 వ అధ్యాయంలో దెలుపబడిన ప్రయోజనములప్రకారం (బ్రిటిషుభారతవర్తకవ్యాపారసంబంధాలువగైరా) జరిగే శాసనములను కార్యనిర్వహణంలో సరిగా జరిగేటట్టుచూచుట, బ్రిటిషుదేశాన్నుంచిగాని,

బర్మానుంచిగాని దిగుమతి అయ్యేసరకులను పక్షపాతంతో గాని, కార్పణ్యంతోగానిపన్నులువగైరాలమూలంగానిర్బంధించ కుండాచూచుట, ఒకసమయంలో శాసనసభవారుగాని మరె వరుగాని తీసుకొన్న చర్యలవల్ల మరొకవిషయంలో మరొకసమ యంలో యీచట్టప్రకారం తమ "స్వాంతవివేచన" నిర్ణయా లకు అడ్డురాకుండా చూచుకొనుట.,

ఈప్రకారం పైప్రత్యక్షరక్షణలు బాధ్యతలుగాక ఆఖరు పద్దుక్రింద యెప్పుడో యెక్కడో యెవరో చేసేపనులుకూడా యిప్పుడే, యిక్కడే, నిరోధించుటకు గవర్నరుజనరలుగారికి అవకాశం యేర్పడింది.

ప్రత్యేకబాధ్యతలన్నీ గవర్నరుజనరలుగారి 'స్వాంతనిర్ణ యం'నుబట్టి నిర్ణయిస్తారు. గవర్నరుజనరలుగారికి రాజుగారిచ్చే ఆజ్ఞాపత్రం గవర్నరుగారి కిచ్చేదానివలెనే తయారవుతుంది. అల్లాగే గవర్నరుజనరలుగారిచర్య యీపత్రప్రకారం చెల్లదగి నది కాకపోయినా ఆఅంశమును ప్రశ్నించవీలులేదు. గవర్నరు జనరలుగారు "స్వాంతవివేచనం, నిర్ణయం" ప్రకారం వ్యవహ రించేసలాల్లో యిండియామంత్రికి లోబడిఉంటారు. ఆయన యిచ్చే సూచనలను గమనించవలెను. కాని యిట్టి సెక్షనుకు కూడా గవర్నరుజనరలుగారు వ్యతిరేకంగా చరించినప్పటికీ ఆయ నపైన చర్యకువీలులేదు.[1] ఇండియామంత్రి అట్టిసూచనలిచ్చే

---

1. "స్వాంతవివేచన" పేరాతో కేవలం హేతురహితంగా వర్తించ డమునకు వీలున్నదా ? అని న్యాయవాదులు తర్కిస్తున్నారు.

ముందు అవి సలహాపత్రంకు వ్యతిరేకంగా యిస్తున్నాడేమో చూచుకోవాలి.

ఈవిధంగా చట్టమును సంపూర్ణంగా సాధారణసమయాల్లోకూడా ద్రోసిపుచ్చుట కవకాశముగల గవర్నరుజనరలు అధికారాన్ని యేకోర్టు అడ్డలేదు. ఇండియామంత్రిచేతిలో యింమనుగూర్చి అంకుశంఉన్నది. కాని పరిపాలనలో అంగీభూతుడైన యీాయన యెంతవరకు ఫలకారియో చెప్పలేము.

ఇక పైప్రకారం మినహాయింపబడినశాఖలకు సభ్యులున్ను, శాసనసభవారి కవకాశమున్న అంశాల్లోమాత్రమే కార్యనిర్వహణచేయుటకు మంత్రులున్ను అనే ద్వంద్వప్రభుత్వం తిరిగి యింకోరూపంలో మారుదారిని యీాసమాఖ్యలోనికి వచ్చింది. ఇదిగాక ఆర్థికపుమంత్రి విధిగా ఒక ఆర్థికపండితుణ్ణి-బహుశా సీమదేశంనుంచి దిగేఆయన్ని- సలహాకుంచుకోవాలి. ఆయనను గవర్నరుజనరలే నియమిస్తాడు. ఆర్థికస్థాపవం, పరపతి, ప్రత్యేకబాధ్యతకు సంబంధించిన అంశాల్లోను యీాయన సలహాయే గవర్నరుజనరలు విధిగా అనుసరించాలి. ఇదిగాక మిగతావిషయాల్లో ప్రభుత్వం సంప్రతిస్తే యీాపండితుడు సలహాయివ్వాలి. ఈఆర్థికనిపుణుడు ముఖ్యంగా ప్రత్యేకశాఖలకు కావలసినడబ్బును నిర్ణయించడంలో అభిమానంగాను, మంత్రులశాఖలకు ఉదాసీనంగాను ఉండడానికి అవకాశంవుంది. ఇతనిజీతాలు, షరతులు గవర్నరుజనరలు నిర్ణయిస్తాడు. శాసన

సభవారి ప్రసక్తి యీయనకు లేదు. గవర్నరుజనరలు యిష్ట మున్నంతకాలమే యీయన ఉంటాడు. రెండవదఫాఆర్టికనిపు ణుణ్ణి నిర్ణయించేటప్పుడు మాత్రులతో గవర్నరుజనరలు సంప్ర దిస్తారట.

అడ్వొకేటుజనరలు:—ఇతడు గవర్నరుజనరలుగా రడి గిన అంశాల్లో న్యాయశాస్త్రసలహా యిస్తాడు. అన్ని కోర్టులకు యితనికి ప్రవేశముంది. సమాఖ్యప్రభుత్వమునకు సంబాధమున్న అంశాల్లో సమాఖ్యలో చేరిన సంస్థానపుకోర్టులకుకూడా ప్రవేశం కలదు. ఈయన గవర్నరుజనరలుగారిచే నియమించబడి వారి ఆమోదంతో ఉద్యోగంలో వుంటాడు. స్వంతనిర్ణయాన్నిబట్టియే యీవిషయంలోకూడా గవర్నరుజనరలుగారు నియామకం చేస్తారు.

సమాఖ్యప్రభుత్వంవారి అన్నిచర్యలు గవర్నరుజనరలు గారిపేరుతో జరుపబడునట్లు ప్రకటింపబడును. అన్ని ఆర్డర్లు, పత్ర ములు, గవర్నరుజనరలుగారు వానిననుసరించి చేసేనిబంధనల మూలముగా ధ్రువపర్చబడును. అది సదరుఆర్డర్లు పత్రాల ప్రకారం లేవని ప్రశ్నింపవీలులేదు. గవర్నరుజనరలు సమాఖ్య ప్రభుత్వపువ్యాపారములు వీలుగా జరుగుటకు నిబంధనలు చేయును. తనస్వంతవివేచన ఉపయోగించవలసిన పనులుతప్ప తక్కినవి శాఖలవారీగా మంత్రులకు పంపకంచేయును. (ఈ శాఖలనుగురించి) చూ. 3 వ అనుబంధము.

ఈనిబంధనలలో రాష్ట్రగవర్నరుచేసినట్లే మంత్రుల కార్యదర్శులు జరిగేసంగతులెప్పటికప్పుడు గవర్నరుజనరలుగారి కెరిగించాలనీ, మంత్రులు గవర్నరుజనరలుగారి ప్రత్యేకబాధ్యతలకు సంబంధించిన అంశాలు ఏవైనా తమవ్యవహారాల్లో వచ్చినచో గవర్నరుజనరలుకు తెలుపుచుండాలనీవుంటాయి. పై అంశాలలో కొన్నిటినిగూర్చిన నిబంధనలకు మంత్రులతో సంప్రదించాలి (సె. 9-17 లు)

ప్రభుత్వఅధికారనిర్వహణంలో అమ్మకం, తనఖా మొదలైన అన్యాయక్రాంతపుహక్కులు కలవు. కంట్రాక్టులు ఆయా డిపార్టుమెంటుల అధిపతులపేరుతో జరుగుతాయి.

# నాలుగవ అధ్యాయము.

సమాఖ్యన్యాయస్థానము.

ఈచట్టప్రకారము ఇదే భారతదేశంలో పెద్దకోర్టు. దీనికి సమాఖ్యవిధానంక్రింద రాష్ట్రముకు రాష్ట్రముకున్ను లేక సంస్థానముకున్ను లేక వీటికిన్ని సమాఖ్యకున్ను మధ్యగల సంబంధాలలో చట్టముయొక్క అర్థమును నిర్వచనంచేసేహక్కు చట్టానికి లోబడి కలదు. అనగా అట్టిహక్కును చట్టము ఏయే స్థలాలలో యీకోర్టుకు ఇచ్చిందో అక్కడనే వీరికి జోక్యం. ఇదికాక హిందూదేశన్యాయస్థానాలమీదకూడా వీరికి అపీలు అధికారంకలదు.

ఒక ప్రధానన్యాయాధిపతిని ఆరుగురు న్యాయాధిపతులను రాజుగారే ఏర్పాటుచేస్తారు. ఎక్కువకావలిస్తే సమాఖ్య శాసనవర్గం కోరవచ్చును. ప్రధానన్యాయాధిపతికి నెలకు రు 7000 లున్ను, క్రిందిన్యాయాధిపతులకు నెలకు రు 5500 లున్ను జీతాలు. ప్రధానన్యాయమూర్తి ఐదుసంవత్సరములు హైకోర్టులలో (సంస్థానాలలోనైనా సరే) జడ్జిగా ఉండాలి. 15 సంవత్సరములు బారిస్టరు లేక అడ్వొకేటుజనరలుగా ఉన్నవాడుకావాలి. క్రిందిజడ్జీలకున్ను కొంచెంతక్కువగా ఇలాంటివే అర్హతలు. సివిలుసర్వీసుకు ఇందులో స్థానంలేకపోయినా ఖాళీలు వచ్చినపుడు వీరితోకూడా పూర్తిచేయవచ్చును.

రాష్ట్రసంస్థానసమాఖ్యలకుమధ్యవచ్చే న్యాయాంశాలకున్ను (లాపాయంటు) జరిగినసంగతులప్రకారం తీర్చవలసినవిషయంలోను (ఫ్యాక్టు)గల అన్నితగాదాలపైన స్వతంత్రాధికారం ప్రథమవిచారణాధికారం యీకోర్టుకు గలదు. ఈఅధికారం యీచట్టములో తామే నిర్వచించవలసినభాగములమీద నిర్వచించుట, చట్టనిర్వచనంకాక రాష్ట్రసంస్థానకోర్టులపై అపీలువట్టుట, పెద్దమొత్తములు గలదావాలపై ప్రథమవిచారణాధికారము (Original Jurisdiction) కలిగియుండుట యీకోర్టుయొక్క కార్యాలు.

ఇక సంస్థానవిషయంలో చట్టం, దానిక్రింది కౌన్సిలుఆర్డరులు అంగీకారపత్రప్రకారము సమాఖ్యకు ఇవ్వబడిన శాసనకార్యనిర్వహణాధికారము యొక్క పరిమితి, లేక చట్టం 6 వ భాగముప్రకారం సంస్థానంలో సమాఖ్యశాసనంయొక్క అమలునుగూర్చి లేక సమాఖ్యశాసనసభవారు సంస్థానమునకై శాసించవలసిన మరిఏవిషయమునుగూర్చిఅయినా, సమాఖ్య అమలుకువచ్చినతర్వాత రాజుగారు స్వంతంగా సంస్థానాలతో వ్యవహరించేవిషయాలలోకూడా రాజప్రతినిధికిన్ని సంస్థానముకున్ను జరిగిన ఒడంబడికలమీదకూడా యీకోర్టుకు తీర్పుఅధికారం వుంటుంది. అట్టిఒడంబడికలలో యీకోర్టుకు తీర్పుఅధికారము వున్నదని స్పష్టంగావుండాలి.

ఈకోర్టువారు ప్రథమవిచారణగా పక్షవ్యాజ్యములలో ప్రకటనామాత్రంగానే తమతీర్పును (Declaratory Judgment) ఇస్తారు. అమలునుగూర్చి అందులో ఉండకపోయినా లోకమర్యాదనుబట్టి అమలు అవుతుంది. ఆప్రకారం పార్టీలు కట్టుబడుతారు.

బ్రిటిషుఇండియాలోని హైకోర్టులిచ్చే యేతీర్పు, డిక్రీ, ఆఖరుఉత్తరువులోనైనా యీచట్టమునకు లేక కౌన్సిలుఆర్డరునకు సంబంధించిన 'లాపాయంటు' వున్నదని సదరుకోర్టులు ధ్రువపరిస్తే అట్టితీర్పువగైరాలపై 'సుప్రీముకోర్టు'వారికి అప్పీలుపెట్ట అధికారంకలదు. హైకోర్టులు ప్రతిఅంశంలోను యిట్టిప్రశ్నను గూర్చి యోచించాలి. పార్టీలు తెలుపకపోయినా కోర్టుతే స్వంతంగా యీఅంశాన్ని కనిపెట్టవచ్చును.

ఆవిధంగా ధ్రువపత్రంపొందిన యేకక్షిదారైనా ఆలాంటిప్రశ్న సరిగా తీర్మానించబడలేదని సమాఖ్యన్యాయస్థానానికి అప్పీలుచేసుకోవచ్చును. ఒకవేళ ధ్రువపత్రం హైకోర్టివ్వకపోయినా హైకోర్టుల ప్రత్యేకాంగీకారంలేకుండా సభాయుతుడైన రాజుగారికి అప్పీలుచేసుకొనుటకు హేతువులుగల వ్యాజ్యాలున్ను, సమాఖ్యన్యాయస్థానంవారియొక్క అనుమతితో సీమకు అప్పీలుచేసుకొనే హేతువులున్న వ్యాజ్యములున్ను, తదితరకారణములపైనను సమాఖ్యన్యాయస్థానానికి అప్పీలు కలదు. కాని హైకోర్టులనుంచి సరాసరిగా సీమకు అప్పీలులేదు.

ఇతర సివిలు కేసులలో రు 50000 లకు తక్కువకాని కిమ్మతుగల దావాలు, చట్టం స్పష్టపరచిన కొన్ని అంశాలలో రు 15000 లకు తక్కువకాకుండానున్నదావాలు రు 18000 లకు తక్కువకాని కిమ్మతుగల ఆస్తికి సంబంధించిన తీర్పు, డిక్రీ, ఆర్డరులనుగూర్చికూడా ఫెడరలున్యాయస్థానానికి విచారణాధికారం గలదు. పైన తెలిపినట్లు ప్రీవీకౌన్సిలుకు ప్రత్యేకాంగీకారము సమాఖ్యన్యాయస్థానమే యివ్వాలి. వీరు పట్టేఅప్పీళ్లకు (సివిలు కేసుల్లో) ప్రీవీకౌన్సిలుకు అప్పీలుఅధికారం సమాఖ్యశాసనసభ వారి చట్టమూలంగా తీసివేయవచ్చును.

సంస్థానపు న్యాయస్థానాలనుంచికూడా పైన తెలిపిన విషయాల్లో సమాఖ్యన్యాయస్థానానికి అప్పీలు అధికారంగలదు. సంస్థానహైకోర్టులలోనివిధానమునుగూర్చి సమాఖ్యన్యాయస్థానమునకు సూచనలుచేసే అధికారంగలదు సమాఖ్యవారు సంస్థానపుతీర్పులపైన యిచ్చేతీర్పులమీాద సభాయుతుడైన రాజుగారికిన్నీ, ప్రీవీకౌన్సిలుకున్ను అప్పీలుకలదు. సంస్థానాలు స్వతంత్రన్యాయనిర్వహణాధికారంగలవి గనుక వీటిపైన సివిలు 'జ్యూరిస్‌డిక్షన్' సమాఖ్యన్యాయస్థానానికి లేదు. సమాఖ్య న్యాయస్థానంవారివద్ద చట్టనిర్వచనమునుగూర్చి దాఖలైనవ్యాజ్యాలమీాదయిచ్చే తీర్పులపైన రాజుగారివద్దకు (ఎట్టిఅనుమతి లేకుండాను)అప్పీలుఅధికారంగలదు. తదితరవిషయాల్లో సమాఖ్యకోర్టుగాని ప్రీవీకౌన్సిలుగాని అట్టిఅప్పీలుకు అనుమతివ్వాలి.

ఇట్టిఅనుమతి ప్రీవీకౌన్సిలువారు అదేపనిగా యివ్వకూడదు. క్రింది కోర్టులు న్యాయశాస్త్రసూత్రాలను లక్ష్యంచేయకుండా న్యాయభంగం గలుగచేశారనితోస్తేతప్ప జోక్యంపుచ్చుకోరాదు.

సమాఖ్యన్యాయస్థానానికి క్రిందితీర్పులను త్రిప్పివేయుట, ఇంజెక్షను, అమలు, మొదలైన అధికారములుకలవు. క్రిందికోర్టులు (సంస్థానాలసహా) వారి అధికారమును గౌరవించాలి. ఈ సమాఖ్యన్యాయస్థానంవారు ప్రీవీకౌన్సిలువారు పైవిషయముల చెప్పిన తీర్పులప్రకారం ఏర్పడే 'లా' బ్రిటిషు, సంస్థానపుకోర్టులను బంధిస్తుంది.

ఇట్టి తీర్పుఅధికారంగాక సమాఖ్యన్యాయస్థానంవారిని గవర్నరుజనరలు అడిగినపుడు ప్రాముఖ్యమైన విషయాలను గురించి 'లా' మీదసలహాచెప్పే అధికారం ఉన్నది. కాని గవర్నరుజనరలు అదిపాటించవలసినవిధిలేదు. ఇట్టి సలహాలనుచెప్పుటలో విధానం ప్రీవీకౌన్సిలు, కనడాకోర్టులను అనుసరించి ఉంటుంది. ఆస్ట్రేలియావిధానంవంటిదికాదు. ఉత్తరఐర్లెండునుగూర్చి ప్రీవీకౌన్సిలిచ్చేసలహాలు విధిగాపాటించబడతాయి. ప్రభుత్వానుమతితో వీరినిబంధనలు వీరేచేసుకుంటారు. సమాఖ్యశాసనసభవారు అప్పీలుయొక్క ఆవరణను (Jurisdiction) హెచ్చించవచ్చును. అప్పుడొక ప్రత్యేక 'డివిజన్'నుపెట్టుకోవాలి. తీర్పుకు ముగ్గురకుతక్కువకాని న్యాయాధిపతులుండాలి బహిరంగంగా తీర్పు ప్రకటించాలి. మైనారిటీతీర్పులుండవచ్చును.

మెజారిటీలో అభిప్రాయభేదాలుండకూడదు. ఇది ఒక్కవిషయములో న్యాయమూర్తివర్గమంతా ఒక్కరీతితీర్పునే యివ్వాలనే ప్రీవీకౌన్సిలుపద్ధతికిన్నీ (మైనారిటీతీర్పువుండకూడదని), నిర్ణయమేదైనా అభిప్రాయాల్లోకూడా భేదముండవచ్చుననే కెనడా వగైరాలపద్ధతికిన్నీ యిదిమధ్యరకం.

హైకోర్టువరకు 'ఏడెను' వంటివిదేశపుకోర్టులనుంచివచ్చే అప్పీళ్ళనువిని తీర్పుచెప్పేహక్కు కలదు. దీనిమీద సమాఖ్య న్యాయస్థానమునకు అప్పీలు లేదు. అవి సరాసరిగా ప్రీవీకౌన్సిలుకుపోతాయి.

చట్టనిర్వచనమునుగూర్చిన తగాదాలలో సమాఖ్యన్యాయస్థానమునకు అప్పీలు ఉన్నదని హైకోర్టు ధ్రువపర్చకపోతే యేంచెయ్యాలి? ఆఅంశము ప్రీవీకౌన్సిలుకు రిఫరుచేసి వారిఅభిప్రాయముపొందాలి. చట్టనిర్వచన సంబంధమైన అంశాల్లో స్వేచ్ఛగా హైకోర్టునుండి సమాఖ్యకు అప్పీలుఅధికారంవుంటే దేశానికంతకూ ఏకరీతిగల నిర్వచనం లభించి సామరస్యం కలుగుతుంది. హైకోర్టులకు ధృవపరిచే అధికారంవుండడంవల్ల(అమెరికారాష్ట్రన్యాయస్థానాల్లోవలె) భిన్నఆచారాలేగాక అధికారాలుకూడా యేర్పడతాయి అని పండితులమతం.

ఇంతేకాక ప్రస్తుతం సమాఖ్యన్యాయస్థానంవారికి పని తక్కువ. పైగా వీరికి సమాఖ్యశాసనాలను గురించి సంస్థాన న్యాయస్థానాల్లో చెప్పే (అనగా చెపితే) పొరపాటు అర్థాలను సవరణచేయ వీలులేదు అనికూడా 'కెయితు' పండితునిమతం.

హైకోర్టులు:—వీటినిర్మాణం 1919 సం॥ చట్టంలో చెప్పినప్రకారం ఉన్నది. క్రొత్తమార్పులుమాత్రం తెలిపెదము. మూడవవంతు బారిష్టరులు, మూడవవంతు సివిలుసర్వీసువారు ఉండాలనేనియమం పోయింది. పూర్వం కలకత్తాహైకోర్టు కేంద్రప్రభుత్వాధికారానికి లోబడేది. ఇప్పు డది స్వతంత్రం (అన్నికోర్టులవలెనే) చేయబడినది. హైకోర్టులకు క్రిందికోర్టుల పైన అధికారాలు మామూలే. కాని తమకు అప్పీళ్ళువచ్చే అన్నికోర్టులపైన తణిఖీవగైరా అధికారాలు యిప్పుడు కలిగినవి. వీటికిసమాఖ్య లేక రాష్ట్రశాసనం అశాస్త్రీయమని నిర్ణయించే హక్కు కలిగింది. ఇట్టినిర్ణయము జరుగుచున్నపుడు 'అడ్వొకేటు జనరలు' సదరు విచారణ మరియొక కోర్టునకు మార్చమంటే మార్చాలి.

పూర్వంవలెనే రివిన్యూ (భూమిపన్ను), వాటి వసూలు సందర్భములో ఆచారం, ఆట్టిశాసనాలను గూర్చి హైకోర్టు వారికి ప్రమేయంలేదు. సెటిలుమెంటు చర్యలు, రీసెటిలుమెంటుఅక్రమములు మామూలుగా జరుగవచ్చును. ఒకహైకోర్టును ఏర్పరచుట, ఒకహైకోర్టుయొక్క 'ఆవరణ'ను విశాలపరచుట రాజుగారు జరిగించవలెను. హైకోర్టులనిబంధనలను గవర్నరుగారే ఆమోదించాలి 'షెరీఫ్'ను బంగాలులో ప్యానలుపద్ధతిని నియమిస్తారు. మరణదండనను క్షమించుటలో గవర్నరుజనరలు సభాయుతుడై నిర్ణయించాలి. ఆలాగే శిక్షనుతగ్గించుట వగైరాలు రాజుగారి ప్రతినిధిగాచేయవచ్చును.

జిల్లాజడ్జీలను, అసిస్టెంటుజడ్జీలను, స్మాలుకాజుకోర్టులను స్వంతవివేచనతో గవర్నరే నియమించాలి. హైకోర్టుతో సంప్రదించిమాత్రం చెయ్యాలి. అట్టివారు బారిష్టరు, ప్లీడరు, లేక అడ్వొకేటుగా 5 సం॥రం లుండాలి. ఇట్టి నియమములు యిదవరలో సర్వీసులో లేనివారికి.

జిల్లాజడ్జీలకంటె క్రిందివారైన మున్సబులు వగైరాలను గవర్నరుగారు నియమిస్తారు. ఇట్టి అభ్యర్థులను పరీక్షించి ఒకజాబితా తయారుచేస్తారు పబ్లికుసర్వీసు కమీషన్ వారు. ఈఉద్యోగాలనుగూర్చిన నిబంధనలుహైకోర్టుతోను, పబ్లికుసర్వీసుకమీషనుతోను సంప్రదించి గవర్నరే చెయ్యాలి. ఇందులో ఆయా సంఘాలకు ప్రత్యేకస్థానాలుండాలి.

క్రిమినలువ్యవహారాలలో జిల్లాకలెక్టరుతో సంప్రదించకుండా ఆభాగంలోని మేజిస్ట్రీటు అధికారాన్ని హెచ్చించడం, తగ్గించడం, తీసివేయడం జరుగరాదు.

శాసనసభ్యులెవ్వరూ రివిన్యూఅప్పీళ్లు విచారించే సంఘంలో ఉండరాదు. ఇదివరలో సభాయుతుడైన గవర్నరుగారే అట్టిఅధికారం కలిగిఉండేవారు. ఇప్పుడాపద్ధతిపోయి శాసనసభవారింకోవిధంగా మార్పుచేసేదాకా గవర్నరుగారు విచారణాపద్ధతిని ఏదైనా యేర్పాటు చేయవచ్చును.

## న్యాయస్థానాలు—అధికారులు.

రాజ్యాంగవిధానాలలో శాస్త్రపండితులు సరదాతో చూడ్డానికి కుతూహలపడే విషయాలలో ఒకటి: గవర్నమెంటు

ఉద్యోగస్థులను, వారిచర్యలనుగురించి అధికారం యెవరిది అనే విషయం. వారుకూడా మామూలు పౌరులవలె న్యాయస్థానాలకు బద్ధులని నడిచే విధానాలుగల దేశాలుకొన్ని (ఇంగ్లండు లాంటి. Common law States). వారిమీద మామూలుకోర్టులకుహక్కు లేదనిన్నీ, ప్రత్యేకవిచారణావకాశాలుండాలనేవిధానాలు మరికొన్ని(ఫ్రాన్సురాజ్యాంగం లాంటి Administrative Law States). ఈ విషయంలో భారతదేశంలో యీచట్టప్రకారం యేపద్ధతి ఉంటుంది? ఇంగ్లండులో వ్యక్తిస్వేచ్ఛఅనేది చాలపవిత్రమైనదిగా యెంచబడి ఆదేశన్యాయశాస్త్రమంతా అట్టి వృత్తమసూత్రంమీద ఆధారపడిందంటారు. అక్కడ యే ఆఫీసరునైనాసరే న్యాయస్థానానికి యిప్పుటకు యితరదేశాలకంటె యెక్కువ అధికారాలు వున్నాయంటారు. ఆసాంప్రదాయాన్నే బ్రిటిషువారు భారతదేశానికి ప్రసాదించారు. భారతదేశ నవీన న్యాయశాస్త్రమంతా ఆంగ్లేయుల వ్యక్తిస్వేచ్ఛాసిద్ధాంతముమీద ఆధారపడింది. ఇది ఆంగ్లం భారతానికిచ్చిన గొప్పనాగరకపు కానుక అని బ్రిటిషురాజనీతిజ్ఞులు గర్విస్తూంటారు. ఇదికొంతవరకు నిజమే. కాని దీనిఫలితమేమైంది? పూర్వహిందూకుటుంబ సమిష్టిసిద్ధాంతం గ్రామసమిష్టిజీవనసిద్ధాంతాలు వీట్లను యీ ఆంగ్లవ్యక్తిస్వేచ్ఛాసిద్ధాంతంవచ్చి చాలవరకు బలహీనపరిచింది. (చూ. హైకోర్టు తీర్పులు) కాని రాచకీయంగాను పౌరహక్కులసందర్భములోను

బ్రిటిషువ్యక్తి స్వేచ్ఛాసిద్ధాంతం వర్తించినట్లు కనపడదు. ఇప్పటికిన్నీ రాజ్యాంగచట్టంలో పౌరహక్కుల ప్రకటనలేదు. ఇప్పటికిన్నీ అనాగరపుకాలమునాటి రెగ్యులేషనులనుబట్టి వ్యక్తులను నిర్బంధముచేసి—చార్లెసురాజునాటి లండనుగోపురనిర్బంధాలు జ్ఞప్తికివస్తున్నాయి—విచారణలేకుండా యెంతకాలమైనా వుంచవచ్చును. ఇట్లే గవర్నరుజనరలు ఈఅధికారులు ఆర్డినెన్సులున్నూ. ఈ చట్టమునకు వ్యతిరేకముగా ప్రవర్తించిన అనేకస్థలములందు కోర్టుకు విచారణావకాశంలేదు. గెజెటు ఆఫీసర్లపైన ప్రభుత్వపు అంగీకారంలేకుండా కేసుకే అధికారంలేదు. 'మార్షల్‌లా' రోజులలో ఆఫీసర్లుచేసిన అక్రమాలు రుజువైనా వాటినిగూర్చి కోర్టులు మాట్లాడకుండా చేయడానికి 'సమర్థన' చట్టములు (Indemnifying Acts) గవర్నరుజనరలుచేయవచ్చును. ఇట్లేసంస్థానాలసంబంధము, రాజకీయశాఖల చర్యలపైన కోర్టులకధికారంలేదు.

రివిన్యూలో భూమిపన్ను నిర్ణయంలోజరిపే చర్యలపైన కోర్టుల కధికారంలేదు. పత్రికలు, అచ్చాఫీసులపై ప్రభుత్వం విధించే నిర్బంధములు—జరిమానాలపైన కోర్టులకుగల అధికారం చాలాతక్కువ. 'స్పెసిఫిక్కురిలీఫు' చట్టముక్రింద ప్రభుత్వమువారు న్యాయంగాను, క్రమంగాను జరుపవలసినదని కొన్నిసందర్భాలలో కోర్టులు అనగలవు. కాని ఆచర్య యీలా వుండాలని స్పష్టాదేశం (Injunction regarding spe-

cific performance) యివ్వలేను. ప్రభుత్వముకు వ్యక్తు లకు వచ్చేవివాదాల్లో రుజువుభారం వ్యక్తులదని కోర్టులనమ్మిక. 1919 సం॥రం యిండియా చట్టప్రకారం శాశనసభాధ్యక్షుని పై సభావ్యవహారములకు సంబంధించిన అక్రమాల్లో ఇంజెంక్ష ను ఆర్డరు యివ్వఅవకాశము కోర్టులకు వున్నదని తెలుపబడిం ది. (చూ. 61 కలత్తా 1924) ఈ చట్టం అలాంటిహక్కులు లేవని స్పష్టపరిచింది. పైఅంశాలకు లోబడి మునిసిపల్ చట్టా లక్రిందచర్యలు కోర్టులు విచారించవచ్చును. ప్రతివుద్యోగి మా మూలు శాసనాలు సాంప్రదాయాలు మన్నించాలి. గవర్నరు గవర్నరుజనరలుయొక్క చర్యలపైకూడ కోర్టులకు కొన్నిసంద ర్భాలలో విచారణావకాశం వున్నది. వారట్టి విచారణ చేయ రావని హైకోర్టులకు తెలిపితేమాత్రం ఆహక్కురద్దగునని ప్ర స్తుతచట్టం స్పష్టపరిచింది.

---

# ఐదవ అధ్యాయము.



ఇండియామంత్రి- హైకమీషనరు- సభాయుతులైనరాజుగారు- చట్టసవరణాధికారము మొదలైనవి.

ఇండియామంత్రి బ్రిటిష్ మంత్రివర్గసభ్యుడు. ఈయనసలహామీద భారతవ్యాపారాల్లో మంత్రివర్గంనడుస్తుంది. గవర్నరుజనరలు సాధారణంగా ప్రధానమంత్రి యిష్టాన్నిబట్టే యేర్పడతారు. ఇండియామంత్రి ఆలోచనవర్గంలో ముగ్గురకు తగ్గకుండా 6 గురకు హెచ్చకుండా సభ్యులుంటారు. వీరికికొన్ని నిర్దిష్టమైన కార్యాలున్నవి. ఇందులో సగంమంది భారతదేశంలో పది సంవత్సరములు పనిచేసినవారై ఉండాలి. కాలపరిమితి 5 సం॥లకు హెచ్చరాదు. భారతీయులనుండి ఇండియామంత్రి ఆలోచనవర్గంలోకి సభ్యులుగా నియమింప బడేవారికొక్కొక్కరికి జీతము 1350 పౌనులున్ను, భత్యం 600 పౌనులున్ను. సాలుకి. ఇండియామంత్రికి వీరితో విడివిడిగాగాని ఏకసమావేశంక్రింద పిలచిగాని ఆలోచించే హక్కుగలదు. కొందరితో చెప్పినసంగతులు మరికొందరికి తెలియవన్నమాట! వీరిని త్రోసివేసి స్వతంత్రింగాకూడా వ్యవహరించవచ్చును ఈయన. ఈచట్టం పదవ భాగంలోని (రాజుగారిసర్వీసులు) అంశాలలో వీరిసలహా విధిగా పుచ్చుకోవాలి ఇండియామంత్రి. ఇదివరలో సభాయుతుడైన ఇండియామంత్రిపేరితోనున్న బ్యాంకులలోని స్టాకు (stock),

షామ్నునిలవ కేవలమంత్రిగారు అని వ్యక్తిగతమైనకాతాకు మార్చబడుతుంది. పూర్వంవలెనే యీయనమీదనున్న, ఈయన పేరతోనున్న కొన్నిసందర్భాలలో దావాలువగైరాలు జరుగవచ్చును. ఇట్టిదావాలలో సమనులు హైకమిషనరుమీద అమలుజరగాలి. ఇప్పుడున్న ఇండియామంత్రిగారుచేసిన కంట్రాక్టులు వగైరాలు ఆప్రకారం సమాఖ్యరాష్ట్ర ప్రభుత్వముల మీద బైండు అవుతాయి. కాని యీదావాలు రాజుగారియొక్క సార్వభౌమాధికారానికి (Paramount Rights) భంగకరంగాను లేక యీదావాలు రాజుగారియొక్క ప్రతినిధిగా యిండియామంత్రి పోరుతాడు అనేసిద్ధాంతం అంగీకరించబడదు. నిత్యవ్యాపార ధర్మాల్లోనివ్యక్తులుగానే యీవుద్యోగులు యీదావాల్లో వాదిప్రతివాదులుగా పరిగణింపబడతారు. ఈయనకు పబ్లికుసర్వీసు, ఆర్థికసంబంధాలనుగూర్చి కొన్నిఅంశాలలో స్వంతంగాను, కొన్నిఅంశాల్లో ఆలోచనావర్గంవారి సలహాతోను ఇండియాప్రభుత్వముపై అధికారం చలాయించగలరు. గవర్నరుజనరలు, గవర్నరులు, స్వంతవివేచన, స్వంతనిర్ణయాలనుబట్టి చేసే వ్యవహారాల్లో కాస్త అదుపు, ఆజ్ఞపెట్టడానికి ఈయనకే అవకాశంవుంది. సివిలుసర్వీసులో పెద్దఉద్యోగాలన్ని ఈయనే నామినేషను చేస్తాడు.

<u>హైకమీషనరు:</u>—ఈపదవి 1919 సం॥ చట్టప్రకారం యేర్పడినదని యిదివరలో తెలిపితిని. అంతర్జాతీయవ్యవహారా

లు (రాచకీయాలుకాక), ఆర్థికపుఒడంబడికలు, ఈయనద్వారా భారతప్రభుత్వం జరుపుతుంది. అట్టావా ఒడంబడిక సందర్భంలో భారతప్రతినిధులు యీకార్యాలయంద్వారానే వ్యవహరించారు. భారతవర్తకవ్యాపారాలనుగురించి ప్రపంచభోగట్టాలను భారతీయులకు తెలుపుట, భారతవర్తకక్షేమాభివృద్ధికి పనిచేయుట, బ్రిటిషుదేశంలోని భారతీయవిద్యార్థుల విద్యను గూర్చి శ్రద్ధవహించుట, ఆవివరాలను భారతదేశంలో కోరే వారికి పంపించుటకూడా యీయన జరుపుతారు. ఈవిధంగా భారతదేశంకు అంతర్జాతీయ, ఆర్థికస్వతంత్రంకూడా యిచ్చామన్నారు బ్రిటిషువారు. ఇండియామంత్రి లెక్కలతనిఖీదారే యీకార్యాలయానికికూడా లెక్కలతనిఖీదారుగా ఉంటారు.

సభాయుతుడైనరాజుగారు:—రాష్ట్రస్వతంత్రం అమలుకువచ్చుటకున్ను, అదివచ్చినపిమ్మట దానికిన్ని సమాఖ్యప్రభుత్వం యేర్పడ్డానికిన్ని మధ్యగల అంతరంలోనున్న రాజుగారిపేరుతో బ్రిటిషుమంత్రివర్గమునకు కొన్నిముఖ్యమైన హక్కులు భారతదేశంమీద యీచట్టమువల్ల కలిగాయి. ఈ మధ్యకాలంలో 1919 సం॥ర చట్టంలో సవరణలు, యీ చట్టంలోనికొన్నిటిలోసవరణలు చేయవచ్చును. ఈసంధికాలంలో తగినధనం ప్రభుత్వానికి లభించేటట్లు చట్టం అమలుకు రావడానికిగాను కొన్ని అవసరమైన సవరణలుచేయుట, కొన్ని చిక్కులను తొలగించుటకును వారికి హక్కుగలదు. కాని యివన్నీ సమాఖ్యవచ్చిన తరువాత ఆరునెలలలో రద్దగును.

అన్ని కౌన్సిలు ఆర్డరున్ను సభాయుతులైన రాజుగారికి ప్రార్థనా రూపంగా—గవర్నరుజనరలుకు తొలగించమని చెప్పేదితప్ప—పార్లమెంటు ఉభయసభలు ఆమోదించి రాజుగారికి నివేదించాలి. అత్యవసరసమయంలోను 14 రోజులకంటె హెచ్చుకాలం పార్లమెంటుసభ విరమించినప్పుడున్ను ఇండియా మంత్రి రాజుగారిచేతనే వీటిని చేయిస్తాడు. కాని అది పార్లమెంటు సమావేశానంతరం ఆమోదిస్తేతప్ప 28 రోజులకంటె వుండదు.

చట్టసవరణవిధానం:—(Constitutional Amendment) కెనడావంటి అధినివేశస్వపరిపాలనావిధానంలాగ యీ చట్టములో సదరు విధానపు మూలసూత్రములకు లోబడి అయినా సమాఖ్య ప్రభుత్వంవారు చట్టసవరణ చేయడానికి యేమిన్నీ అధికారం యివ్వలేదు. పేరుకు మాత్రం చట్టసవరణాధికారం అంతా పార్లమెంటువారిది అనిఉన్నా బ్రిటిషుమంత్రివర్గపుకౌన్సిలు ఆర్డర్లే చాలామట్టుకు చట్టసవరణను చేయగలవు. కాని ఉభయసమాఖ్య శాసన సభల సంఖ్యలో మార్పుదల, ఎన్నికవిధానం, సభ్యుల అర్హతలను, మార్చుటకున్ను (రెండుసభలమధ్యను యిప్పుడున్న దామాషాయీకి భంగంలేకుండా) స్త్రీలకు విద్యాధికత తీసివేసి మామూలు చదువు వ్రాతమే అర్హతగా పెట్టుమనుట, వారిని స్వంతదరఖాస్తు అక్కరలేకుండగనే వోటర్లుగా జేర్చుకొనుట, ఎన్నికఅర్హతలకు సంబంధించిన యితరవిషయాలు, వీటినిగూర్చి

చట్టసవరణకు సమాఖ్యశాసనసభవారికి కొంత అవకాశము కలదు. స్త్రీలకుసంబంధించినవి తప్ప మిగతావి సమాఖ్య అమలులోనికి వచ్చింది మొదలుకొని పదిసంవత్సరాల అనంతరం నుంచి జరగాలి. అనగా యీసవరణలు అప్పుడు సమాఖ్య శాసనవర్గంలో ప్రార్థనలక్రింద అంగీకరించబడాలి. అవి ఇండియామంత్రిద్వారా పార్లమెంటుకు తెలుపబడతాయి. వాటిమీద గవర్నరుజనరలు అభిప్రాయము, ఆమార్పులకు సంబంధించిన సంఘప్రతినిధుల అభిప్రాయములు తెలుసుకొంటారు. 6 నెలలలోపుగా అవి పార్లమెంటుకు నివేదించబడి రాజుగారిచేత అంగీకరించబడతాయి.

<u>సాంఘికపరిష్కారం:</u>—ఈదేశంలోని భిన్నమత, జాతులకు ప్రభుత్వంలో స్థానాలు పంచిపెడుతూ ప్రధానమంత్రి చేసిన సాంఘికపరిష్కారంఅనేది (Communal Award) తాత్కాలికమైన నిర్ణయమే. ఆయాసంఘములు సఖ్యతతో యేదైనా స్థిరపరిష్కారముకువస్తే ఆప్రకారం చట్టంలో సవరణ జరుగవచ్చును.

<u>'రెసిడ్యుయరీ'హక్కులు</u> :— సమాఖ్యవిధానంలో చట్టం కేంద్రరాష్ట్రీములమధ్య అధికారములు, శాఖలు ఎంత స్పష్టంగా పంచినా ఆపంపకంకాలంలో అనుకోని క్రొత్త అధికారాలు, శాఖలు, అంశాలు పిమ్మట పొడచూపుతాయి. వాటిలో రాష్ట్రంవారా? సమాఖ్యవారా? శాసన లేక కా

ర్యనిర్వాహణాధికారం చెలాయించవలసింది? అనేప్రశ్నవచ్చి అంకునుగూర్చి వివాదలు పుట్టకుండా చట్టంలోనే అనుకోని అధికారాలు ముందువస్తే ఎవరు నిర్వహించాలో చట్టం చెప్తుంది. సమాఖ్యవిధానచట్టానికి ఉండవలసిన ముఖ్యలక్షణాల్లో యిదొకటి. ఆస్ట్రేలియాలోయిట్టిహక్కులురాష్ట్రాలివి. కెనడాలో సమాఖ్యప్రభుత్వానివి. ఈచట్టంక్రింద మనభారతదేశంలోనో రాష్ట్రాలవీకావు, సమాఖ్యవీకావు. అల్లాంటప్పుడు "గవర్నరుజనరలు పంపకాలపత్రాలలో పడని క్రొత్తవిషయాలనుగూర్చి సమాఖ్యగాని రాష్ట్రంగాని శాసించవలెనని తనవివేచననుబట్టి ప్రకటనరూపకంగా అధికారం ఇచ్చును. అప్పుడు ఆవిషయం ఆశాసన, కార్యవర్గముల పాలనంలోనికి పోవును." అనగా దీనిమీదకూడా అధికారం గవర్నరుజనరలుది. (సె. 104).

# ఆఱవ అధ్యాయము.

శాసనాధికారానికి సంకెళ్లు — బ్రిటిషుభారతదేశాలమధ్య వర్తకం, వ్యాపారం, వృత్తి, ఉద్యోగములలో సమానహక్కులుండాలి. ఇవే రక్షణలు. వివక్షణ (Discrimination) ఉండకూడదు.

పూర్వము భారతదేశముమీదనున్న పార్లమెంటువారి సర్వాధికారం చట్టంలో పదిలపరచబడింది. భారతదేశములోని ఏ శాసనసభవారుగాని రాజు, రాజకుటుంబ వారసత్వం, బ్రిటిషుజాతీయత, బ్రిటిషుసేనాచట్టం, వైమానికదళచట్టం, నౌకారక్షణచట్టం, శత్రువుల ఓడలు స్వాధీనముచేసుకొన్నప్పుడు సదరు ఆస్తినిగురించినధర్మం (Law of Prize)— వీటినిగురించిగాని, వీటినిగూర్చిన శాసనాలనుగాని ముట్టడానికి వీలులేదు. ఈచట్టాన్నిగాని దీనిక్రింద ఇండియామంత్రి గవర్నరుజనరలు చేసేనిబంధనలు, ఆర్డరులనుగాని—(చట్టంలో చెప్పబడిన కొన్ని చిల్లరవిషయాలు తప్ప) శాసనసభవారు సవరించుటకు వీలులేదు.

ఈదేశంలోని కోర్టులనుంచి అప్పీలును అధికారం యిచ్చే రాజుగారి ప్రత్యేకపుహక్కు (Prerogative) ముట్టవీలులేదు. ఇల్లాగే రాజుగారికిగల మరికొన్ని హక్కులనుగూర్చి కూడా. వీటిమీద బిల్లులే ప్రవేశపెట్టరాదు.

ఇక కొన్ని విషయాల్లో గవర్నరుజనరలు లేక గవర్నరు యొక్క ఆమోదముంటేనేతప్ప బిల్లులు ప్రవేశపెట్టరాదు. పార్లమెంటు చట్టాన్ని మార్చేవి, గవర్నరుజనరలుయొక్క చట్టాలను ఆర్డినెన్సులను వ్యతిరేకించేవి, వారు స్వంతవివేచనతో నిర్వహించవలసిన విషయాలకు సంబంధించినవి, పోలీసుదళానికి సంబంధించినవి, ఐరోపియన్, బ్రిటిషుపౌరులకు సంబంధించిన క్రిమినల్ప్రొసీజరును మార్చుటకున్ను, బ్రిటిషు ఇండియాలో నివసించని బర్మా, ఆగ్నేయపౌరులమీద ఆలా నివసించేవారిమీద కంటె హెచ్చుపన్నులు విధించుటకున్ను, బ్రిటిషు ఇండియాలోనివారే "అందరూ డైరెక్టర్లుగానుండి వారిచేతనే యీదేశంలో నడపబడే" కంపెనీలమీదకంటె తద్వ్యతిరేకమైన బ్రిటిషుకంపెనీలపైన హెచ్చుపన్నులు వేయుటకును, ఇంగ్లండులో ఆదాయపుపన్ను వేయబడినట్టిన్ని, వేయదగినట్టిన్ని వారికి సమాఖ్యప్రభుత్వం యీదేశంలో చేసేసదుపాయములకు వ్యతిరేకించే శాసనాలు, చర్యలు జరుపుటకున్ను గవర్నరు జనరలు లేక గవర్నరుయొక్క ఆమోదంలేకుండా ఆయా శాసనసభలలో బిల్లులు ప్రవేశంకాకూడదు. చర్యలు జరుగకూడదు.

ఆర్థికానికి సంబంధించిన బిల్లులు అనగా పన్నులను హెచ్చించేవి ముందుగా గవర్నరుజనరలు లేక గవర్నరుయొక్క అంగీకారాన్ని పొందాలి. ఇల్లాగే బ్రిటిషుపౌరులను దేశములో

10

ప్రవేశించకుండా, ఆస్తిసంపాదించకుండా, అనుభవించకుండా, జాతిమతభాషలనుబట్టి విచక్షణచేసే శాసనాలు బంధించవు (అయితే రాచకీయకారణాలవల్ల గవర్నరుజనరలు వ్యక్తులను నిషేధించేహక్కులు గలవు).

ఇంతేకాక బ్రిటిషువస్తువులమీద కేవల పక్షపాతంతో హెచ్చుపన్ను వేసేవి, బ్రిటిషుపౌరులమీద బ్రిటిషు దేశములోని శాసనాలనుబట్టి నిర్మించబడిన కంపెనీమీదకూడా హెచ్చు పన్నులువేసేవి శాసనాలు చేయరాదు. బ్రిటిషు దేశములోని కంపెనీ డైరెక్టర్లు, మెంబర్లు, వాటాదార్లు భారతదేశంలోని వారివలెనే యిక్కడ అన్నిహక్కులు కలిగిఉంటారు. ఏదైనా పన్నుతగ్గింపు ప్రభుత్వంవారు భారతకంపెనీలకు చేసేయడల అది భారతదేశంలోని బ్రిటిషుకంపెనీలకేకాక భారతదేశంతో సంబంధించిన ఇంగ్లండులోని బ్రిటిషుకంపెనీలకుకూడా యివ్వాలి. ఇల్లాగే ప్రభుత్వం భారతదేశకంపెనీలకు యిచ్చే సహాయం (Subsidy), ధనసహాయంకూడా భారతకంపెనీలు, భారతదేశంలోని బ్రిటిషుకంపెనీలుకూడా నిబంధములోని అర్హతలను బట్టి పంచుకుంటాయి. నిబంధనలప్రకారం పెట్టుబడి బాగాఉండి నిర్వహణం కట్టుదిట్టంగా జరిగే కంపెనీలకే యీసహాయం ప్రభుత్వంవల్ల లభిస్తుంది. కనుక ఆప్రకారం నిపుణత్వంలో ఆరితేరిన భారతదేశంలోని బ్రిటిషుకంపెనీలకే యావత్సహాయం ముట్టడమున్నూ, పరిశ్రమలలో శైశవావస్థలోనున్న స్వదేశీకంపె

నీల కసలే చెందకపోవడముకన్నా అవకాశముకలదు. ఈసహా యం కేవల యింగ్లీషుకంపెనీలకుకూడా వర్తిస్తుంది. అవి సంస్థా నములోగాని బ్రిటిషుభారతదేశంలోగాని 'ఇంకార్పొరేటు' కావాలి. వాటిమీద సగంమంది డైరెక్టర్లను ఇండియాలో పౌరహక్కులను సంపాదించినవారిని పెట్టుకుంటే యిట్టికంపెనీ లకుకూడా సహాయం లభిస్తుంది. ఈచట్టం అమలులోకి వచ్చిన వెంటనే పూర్వం చైనాదేశంలోవలె బ్రిటిషువారు, ఐరోపి యనులు భారతదేశంలో చురుగ్గా కంపెనీలుపెట్టేసి స్వదేశీపరి శ్రమలను వ్యాపారాన్ని అడుగంటచేయడానికి అవకాశం ఉంటుంది.

ఇల్లాగే బ్రిటిషుఓడల వర్తకంమీద భారతఓడల వర్త కంమీదకంటె హెచ్చుగా విధినిషేధాలుండరాదు.

వృత్తులుచేసుకొనేవారికి, సాంకేతికవిద్యార్హతలను తెలిపే నిబంధనలకు చెందిన బిల్లులేవీ గవర్నరుజనరలు లేక గవర్నరుయొక్క పూర్వామోదంతోగాని ప్రవేశపెట్టగూడదు. ఆప్రకారం సదరు బిల్లుచట్టమైనా అమలుకు రాకపూర్వం నాలుగుమాసాలు ముందుగా దానిని ప్రభుత్వం ప్రకటించాలి. సదరు నిబంధనకు సంబంధించిన వృత్తులు, ఉద్యోగాలవారు యిందునుగూర్చి ఆక్షేపణలు చెప్పుకుంటే గవర్నరుజనరలు లేక గవర్నరు వాటిని సవరణ లేక రద్దుచేయవచ్చును. ఈవిష యములు పూర్వపుచట్టములోఉన్నవైనా ఆక్షేపించడానికి హా

[illegible]

ష్టుంది. ఇవి యీదేశంలో విదేశాలనుంచి వచ్చిన ఏజెంట్లు, వ్యాపారస్థులు మున్నగు వారి రక్షణకొరకు పెట్టబడ్డాయి (సె. 119)

డాక్టర్లు:—బ్రిటిషుదేశంలో పరీక్షప్యాసైన డాక్టర్ల విద్యార్థులు భారతప్రభుత్వం అంగీకరించి వారికి యిక్కడ వృత్తిచేసుకోడానికి హక్కుయివ్వాలి. భారతడాక్టర్లకు బ్రిటిషు డాక్టరకంటే అధికమైన సౌకర్యాలుండరాదు. ఈడాక్టర్లకు వృత్తిహక్కును ఏకారణంచేతైనా ప్రభుత్వం రద్దుచేయవలసి వస్తే ముందుగా మూడుమాసాలు వారికి గడువివ్వాలి. ఈ లోగా బ్రిటిషుడాక్టర్లు ప్రీవీకౌన్సిలుకు అప్పీలుచేసుకొని నిర్ణయంపొందుతారు. ఈహక్కు ఫెడరలున్యాయస్థానానికి యెందు కుండకూడదు ? భారతమెడికలుసర్వీసులోనికి ఉద్యోగికి ప్రభుత్వామోదంతో నిమిత్తంలేకుండా భారతదేశంలో వృత్తిచేసుకోడానికి స్వంతహక్కు గలదు. గవర్నరుజనరలు, గవర్నర్లు తమప్రత్యేకబాధ్యతలక్రింద యీఅంశాలన్నీ కార్యనిర్వహణం లోకూడా అమలుజరిగేటట్లు చూస్తారు.

ఈ పైఅంశాలకు సంబంధించిన బిల్లులకు ప్రవేశాంగీకారం మొదట యిచ్చినా బిల్లు అంగీకరించబడినతర్వాత తిరస్కరించవచ్చును. పై వారి ఆమోదానికి నిలిపిఉంచవచ్చును.

ఇవిగాక భారతదేశములోని సంస్థాన, రాష్ట్రములమధ్య సరుకులు ఎగుమతిదిగుమతులు కావడంలో నిర్బంధాలుకల్పించే బిల్లులుకుకూడా గవర్నరుజనరలు, గవర్నరుయొక్క పూర్వా

మోదం ఉండాలి. అల్లాగే ఒకరాష్ట్రంలో తయారయేసరుకు పైన మఱియొకరాష్ట్రంవారు విధించే సెస్సు, పన్నువగైరాలు యెక్కువతక్కువ భేదంలేకుండా అన్నిరాష్ట్రములలోవలె సమానంగా వుండాలి. అల్లాగే జాతి, మతవగైరా విచక్షణలకు సంబంధించినబిల్లులును.

శాసనాధికారంతో తప్ప ఏవ్యక్తియొక్క స్వేచ్ఛగాని, ఆస్తిగాని, హక్కులుగాని రద్దుచేయబడరాదు. వ్యక్తులఆస్తి ప్రభుత్వం 'ట్రాన్సుఫరు' చేసుకునేబిల్లులుకు గవర్నరు, గవర్నరు జనరలుల పూర్వామోదం వుండాలి.

ఈభారత, బ్రిటిషువృత్తివర్తక, వ్యాపారములనుగూర్చి చట్టం పైవిధంగా నియమాలనుచేయుటలో ధర్మము తప్పలేదన్నారు బ్రిటిషురాజనీతిజ్ఞులు. "మాకంపెనీలకు, మావ్యాపారాలకు, మావృత్తులకు భారతదేశంలో కోరినసదుపాయాలు భారతకంపెనీలు, భారతవ్యాపారము, భారతీయవృత్తులవారు మాసీమదేశంలో చేసుకుంటె మేము ఆసదుపాయాలే చేస్తా" మన్నారు. మేము చేయకపోతే మీరూ చేయవద్దన్నారు (Reciprocity). ఈసమాధానం గిల్టుబంగారంలాగ పైకి యెంతప్రకాశమానంగా వున్నా యిది సత్యదూరమని యెరుగనివారుండరు. తనదేశపుపరిశ్రమల్లోనే పసిపిల్లగావున్న, తనదేశానికి కావలసినసరుకులను చాలాభాగం విదేశపుఓడలలో దింపుకోవలసినస్థితిలోవున్న భారతదేశం బ్రిటిషుదేశంవెళ్ళి పారిశ్రామికం

గా ప్రపంచానికంతకీ అగ్రస్థానంవహించిన బ్రిటిషువాళ్లతో పోటీగా నిలువబడి వర్తకం, వ్యాపారంచేస్తుందా? "ఆయన వుంటే మంగలివాడిని పిలవడమెందుక"న్నటులగా అంతశక్తి భారతదేశానికుంటే చట్టమూలంగా స్వదేశపరిశ్రమలరక్షణ కోరవలసిన అవసర మెందుకువస్తుంది?

ఇల్లాగే రిజర్వుబ్యాంకు, మారకంరేటు, నోట్లువగైరాలనుగూర్చిన బిల్లులు గవర్నరుజనరలు అంగీకారంలేకుండా శాసనసభలో ప్రవేశించరాదు.

యూరోపియనులకు సంబంధించిన ప్రత్యేకరక్షణలు కొన్నివున్నాయి. అవి చట్టంలో తెలపడానికి వీల్లేనందున గవర్నరుజనరలు గవర్నర్ల ఆజ్ఞాపత్రాల్లో చేర్చినారని యూరోపియను సంఘాధ్యక్షులైన 'లాంగ్లే'గారు యిటీవలనే అంగీకరించిరి. ఈపత్రముపైన కోర్టుల కధికారము లేనిసంగతి తెలిసినదే.

గవర్నరుజనరలుగారి అంగీకారంలేకుండా ప్రవేశపెట్ట వీలులేనిబిల్లులు, శాసనసభ ముట్టడానికి వీల్లేనిఅంశాలు యివే ననుకోవద్దు. ఆయాస్థలాల్లో యిట్టివి చాలాచూపించాము. ప్రస్తుతాంశాలు వాటితోకలుపుకొని యీజాబితాను పాఠకులు పూర్తిచేసుకోవాలి. ఒకసాంఘికనాయకుడుకూడ యిటీవల అంగీకరించినట్లుగా "చట్టమంతా 98 పాళ్లు మినహాయింపులు, రక్షణలతోనున్న 2 పాళ్లుమాత్రం ప్రజాబాధ్యతతోటిన్నీ కూడుకొనియున్నది."

---

# ఏడవ అధ్యాయము.



## సమాఖ్య ప్రభుత్వానికిన్నీ, సభ్యులైన రాష్ట్రసంస్థానముల కున్ను పరిపాలనాంశములలోగల సంబంధాలు.

ఈసమాఖ్యవిధానంక్రింద రాష్ట్రసంస్థానములకున్ను, కేంద్రమునకున్ను మధ్యచట్టమే కార్యనిర్వాహణాంశాలను, అధికారాల(Executive & administrative matter)నువిభజించేసింది. తిరిగి చట్టంద్వారాగాని యీవిభజనంమారడానికే వీల్లేదు. ఈవిభాగాన్నిగూర్చి కొంచెంగా తెలుసుకొందాము.

రాష్ట్ర, సంస్థాన, సమాఖ్యప్రభుత్వముల కార్యనిర్వహణాధికారము (Executive authority) సదరుసమాఖ్య ప్రభుత్వపుశాసనాలు యుక్తంగా గౌరవింపబడునట్లున్ను, రాష్ట్రసంస్థానముల క్షేమమునకు యుక్తంగా నుండునట్లున్ను అమలు జరగాలి. (సె 122.)

గవర్నరుజనరలుగారి ప్రత్యేకవర్గిలోని సేన, విదేశ, వ్యవహారాలు, మతం, తెగలు, యీనాలుగంశములలోను తన పక్షమున యేజంటుగావుండి చూచుటకు ఆయారాష్ట్రములలో గవర్నరులనే నియమించవచ్చును. తదితరసమాఖ్య వ్యవహారముల అమలుకు రాష్ట్రం, సంస్థానాధిపతులతో (కొన్నిషరతులతోగాని, లేకగాని) ఒడంబడికను కుదుర్చుకొనవచ్చును. ఇంతేకాక సమాఖ్య ప్రభుత్వచట్టరూపంగా రాష్ట్రములోని

వుద్యోగీయులకు సమాఖ్యవిషయాలు, 'కంకరెంటు' విషయాల పాలనము, వాటిఅధికారబాధ్యతలు, వీటినిగూర్చి యేర్పాటులు జరుగవచ్చును. ఈలాగే సంస్థానాధిపతి లేక సంస్థానాధిపతులయొక్క వుద్యోగులకున్ను పరిపాలనాంశములు అప్పజెప్పవచ్చును. ఇట్టిఖర్చులు సమాఖ్యప్రభుత్వమే భరిస్తుంది. సంస్థానాలిచ్చే 'అంగీకారపత్రం'లో యిట్టిషరతులుకూడ వుండవచ్చును. ఆప్రకారం తనకార్యవర్గమువారిపాలన సంస్థానములో సరిగానిర్వహించబడుచున్నందుకు గవర్నరుజనరలు తణిఖీచేసే అధికారం కలిగివుండును. ఈఅంశములమీాద కోర్టులకు నిర్ణయాధికారం వున్నది.

ఇక రాష్ట్రాల్లో సమాఖ్యాధికారమునకు భంగంలేకుండానే రాష్ట్రాధికారం చలామణీకావాలి. ఇందుకుగాను రాష్ట్రానికి సమాఖ్యవారు చలామణీ వుత్తరువులు (Direction) యివ్వవచ్చును. (సె 126.) రాష్ట్రస్వతంత్రంమీాద యిదికూడా ఒకనిరోధమే. ఈ అధికారనిర్వహణాలలో వచ్చేతగాదాలు నిర్ణయించే అధికారంసమాఖ్యది. "ఇల్లాంటప్పుడు 'కంకరెంటు' విషయాలు ఏశాసనసభవారు శాసించాలి" అనేసమస్యవస్తే రాష్ట్రంతో సంప్రదింపుచేసినతర్వాతనే చర్యకుగడంగడం అవసరం. తనసైనికశాఖకు అవసరంవస్తే కొన్నిరోడ్లు, రాధారీలు నిర్మించవలెనని గవర్నరు జనరలు రాష్ట్రాలకు వుత్తరువు యివ్వవచ్చును. అలాటప్పుడు ఆశాఖామంత్రులు అవిచేయకపోతే

గవర్నరు ప్రత్యేక బాధ్యతక్రింద దానిని జరిగించవలెనని గవర్న రుజనరలు నిబంధించవచ్చును. ఇల్లాగే శాంతిభంగ పరిస్థితుల లో గవర్నరుకు గవర్నరుజనరలు చిత్తమువచ్చిన వుత్తరువు లివ్వవచ్చును.

సమాఖ్యకు కావలసిన భూమిమొదలైన ఆస్తిని సంపా దించడానికిరాష్ట్రప్రభుత్వానికిగవర్నరుజనరలు వుత్తరువులివ్వ వచ్చును. అందలి 'కంపెన్సేషను' అంగీకారమువల్ల గాని పరి ష్కారమువల్లగాని నిర్ణయమగును. సంస్థానాలవిషయంలోకూ డా యిల్లాటియేర్పాట్లే పైరెండువిషయాల్లోను వున్నాయి.

రేడియో:—రేడియోప్రసారము సమాఖ్యవారిదైనా 'వార్తలనందించే సాధనా'లను నిర్మించుకోవడానికి, వాటిని వుపయోగించుకోవడానికి, వాటిమీద రుసుమువిధించుకోవడా నికి సమాఖ్యవారు రాష్ట్ర, సంస్థానాలను సాధారణంగా అభ్యం తరపెట్టకూడదు. సమాఖ్యవారి 'వార్తలనందించే సాధనాల' మీద ఎట్టిహక్కును రాష్ట్రాలకులేదు. ఇందునుగూర్చిన పాల నాంశములు (ఆర్థికవిషయాలతోసహా) గవర్నరుజనరలునుతో చిన షరతులతో రాష్ట్ర, సంస్థానములకు అప్పగించవచ్చును. కాని శాంతిభంగపరిస్థితులు వచ్చినప్పుడు గవర్నరు జనరలు స్వంతవుత్తరువు లివ్వవచ్చును.

నీటిపారుదల:—గూర్చి పూర్వచట్టంలో రాష్ట్రముల మధ్యనుగాని లేక మరియొక భాగానికిగాని వుండేతగాదాలు

యిండియామంత్రి పరిష్కరించేవాడు. ఇప్పుడిట్టి తగాదాల గవ ర్నరుజనరలుకు తెలపాలి. ఆయన ఇంజనీరు, ఆర్థిక, లా, పండితులతోకూడిన ఒకనిపుణసంఘాన్ని నియమిస్తాడు. వీరిరిపోర్టును బట్టి సదరుతగాదాను గవర్నరు జనరలే పరిష్కరిస్తాడు. కాని పార్టీలు అలా గవర్నరుజనరలు నిర్ణయం పనికిరాదనిన్ని, సభాయుతులైన రాజుగారే అందునుగూర్చి నిర్ణయించాలనిన్ని కోరవచ్చును. సంస్థానములవిషయములో యిట్టిహక్కులు వైస్రాయినిర్ణయించే అధికారం) అంగీకారపత్రంద్వారా సమాఖ్యకు యివ్వబడాలి.

సమాఖ్య, రాష్ట్రసంస్థానాలకు మధ్యతగాదాలను, వుభయులక్షేమానికీ అవసరమయ్యే విషయాలను గూర్చి ఆయాకాలములో విచారించి తగుసలహాలు యివ్వడానికి అంతరాష్ట్రసంఘము (Interprivincial council) ఒకటిరాజుగారు ఏర్పరుస్తారు. అందులో సంస్థాన ప్రతినిధులకుకూడా స్థానం వుంటుంది. ఇట్టివి కెనడా, ఆస్ట్రేలియాలలో కలవు.

# ఎనిమిదవ అధ్యాయము.

## సమాఖ్యా రైల్వే అధికారవర్గము.

## (Statutary Railway Authority.)

పూర్వం రైల్వే శాఖ మామూలు పరిపాలనతోపాటే ఒకశాఖగా పాలింపబడేది. ఈచట్టంక్రింద రైల్వేఅధికారాన్నంతా కేటాయించి ఒక ప్రత్యేకవర్గంగా యేర్పరచారు. కెనడా, దక్షిణ ఆఫ్రికాలలో ప్రభుత్వవ్యవహారాలతోపాటు రైల్వే పాలనముకూడా కలగాపులగంగా వుండడంవల్ల చాలానష్టాలు కినపడ్డాయి. అందుచేత అక్కడ రైల్వేవర్గం కేటాయించబడింది సులువుకొరకు. కాని ఆవర్గం ప్రజానియమితం. ఈవర్గమో 1$\frac{2}{7}$ వంతు ప్రతినిధులను దాని అధ్యక్షుణ్ణి గవర్నరుజనరలు స్వంత వివేచనతో నియమిస్తాడు. మిగతావారిని బహుశా మంత్రులతో సంప్రదించి నియమిస్తారు. శాసనసభ్యులు, సివిలుసర్వీసువారు, రైల్వేసర్వీసులోనివారు యింకులకర్హులు. వీరికాల మైదుసం॥ములు. జీతబత్తెములుంటాయి. దేశములోని రైల్వేపరిపాలనను క్రమముగా జరుపుట, నూతనరైల్వేనిర్మాణంవగైరాలు వీరిచేతుల్లో వుంటాయి. రైల్వేకార్మికుల, ప్రయాణీకుల భద్రతకు వీరుబాధ్యులు. వీరికి కార్యనిర్వహణంలో ప్రధానిగా ఒక "రైల్వేల ఛీఫ్‌కమీషనరు" అనే వుద్యోగి వుంటాడు. ఈయనను గవర్నరు జనరలు నియమిస్తాడు. ఈ చట్టానికి లోబడి

ఈవర్గమువారు తమసభావ్యవహారములకు నిబంధనలు చేసికొ నవచ్చును. వారిసభలకు గవర్నరుజనరలు పక్షమున ఒకరు హాజరుకావచ్చును. ప్రధానరైల్వేకమీషనరు గవర్నరుజనరలు నియమించిన ఆర్థికపండితుని సలహా పాటిస్తూ వుండాలి. వీరి ఆదాయములపైన రాబడిపన్ను వగైరాలు లేవు. వీరికి రిజర్వు బ్యాంకే బ్యాంకింగు ఏజంటుగా వుంటుంది.

రైల్వేవర్గనిర్మాణంను తెలిపే 8 వ అనుబంధమునుగాని, రైల్వేవిధానాన్ని గురించిన అభిప్రాయభేదాలలోగాని తేల్చవలసినవిషయాలపైన గవర్నరుజనరలుగారిదే ప్రత్యేకాధికారం. తనప్రత్యేకబాధ్యతలకు సంబంధం వుంటుందనితోస్తే సె. 183 క్రింద గవర్నరుజనరలు రైల్వేల కవసరమైన వుత్తరువులివ్వవచ్చును. ఈవర్గంలోజరిగే సంగతులన్నీ సమాఖ్యప్రభుత్వానికి తెలుపుతూవుండాలని నిబంధనలుండవచ్చును.

సె 186 క్రింద యేర్పడే "రైల్వేనిధి.".—వర్గంవారికి ఆదాయంక్రిందగాని, పెట్టుబడిక్రిందగాని వచ్చినసొమ్ము సమాఖ్య ప్రభుత్వం ఆదాయం క్రింద, పెట్టుబడిక్రిందతోను యిచ్చిన సొమ్ముతోను ఈనిధి యేర్పడును. ఇందులోనుంచి పెట్టుబడి మీదను, ఆదాయం నిమిత్తమున్న అయ్యేతగులుబళ్లు తీసివేయాలి. రైల్వేసేవకులనిమిత్తం ప్రత్యేకప్రావిడెంటునిధి నేర్పరచుట కీపద్ధతి అడ్డురాదు. ఈవర్గంవారికి వచ్చిన ఆదాయంలో నుంచివర్గంవారి పరిపాలనకయ్యేకర్చులు, రైల్వేకంట్రాక్టులు, ఒ

డంబడికలనిమిత్తం, పెన్షనులు, ప్రావిడెంటుఫండ్లు, చట్టప్రకారం సమాఖ్యవారు పెన్షనులు, కట్టాలక్రింద యిచ్చినసొమ్ము వాపసు చేయుటకు, రైల్వేవగైరాల పోషణ, అరుగుదల, అభివృద్ధి, మారుదలకు చట్టప్రకారం సమాఖ్యవారికివ్వవలసినవడ్డీ, సాలులో క్రమప్రకారం ఆదాయశాఖకయ్యే యితరఖర్చులు—యీ ప్రకారం అయ్యేవిపోను శేషించిననిలవ చట్టప్రకారం తయారయ్యే పతకంననుసరించి యీవర్గమున్ను సమాఖ్యప్రభుత్వమున్ను పంచుకోవాలి.

రైల్వే రేట్ల నిర్ణయముకు గవర్నరుజనరల లోకసంఘాన్ని అప్పుడప్పుడు యేర్పరచవచ్చును. వీరున్ను యీవర్గంవారున్ను రేట్లు, రవాణాలనుగూర్చిన అంశాలన్నీ యోచిస్తారు. కాని రేట్లను మార్చే యేబిల్లున్నూ గవర్నరుజనరలుయొక్క అనుమతి లేనిదే శాసనసభలో ప్రవేశం కాకూడదు.

రైల్వేలను కంపెనీలకిచ్చుట, కంట్రాక్టుల నేర్పరచుట అమలుజరిపే అధికారం ఇండియామంత్రిది. ఆయనచర్యవల్లవచ్చే లాభనష్టాలను యీవర్గం భరించవలసినదే.

రైల్వేపంచాయితీ:—ఫెడరలున్యాయాధిపతి ఒకరు అధ్యక్షుడుగాను, తొలుదొల్త సూచించబడిన 8 గురు (ప్యానలు)లోనుంచి ఏర్పరచబడిన యిద్దరురైల్వేఅనుభవజ్ఞులైనసభ్యులతోను యీపంచాయితీ గవర్నరుజనరలు నియామకముపైన యేర్పడును. సమాఖ్యరైల్వేలనుగూర్చి రాష్ట్రసంస్థానములకువచ్చే

తగాదాలను వీరు పరిష్కరిస్తారు. వీరికాలము 5 సంవత్సరములు. 'లాపాయింటు' వుంటే వీరిమీద ఫెడరలున్యాయస్థానానికి అప్పీలుఅధికారం వున్నది.

రైల్వేకంపెనీలకు డైరెక్టర్లను, డిప్యూటీడైరెక్టర్లను యేర్పరచేహక్కు ఇండియామంత్రిది. ఇవి గవర్నరుజనరలు కూడా యీవర్గంతో యోచించిచేయవచ్చును.

# తొమ్మిదవ అధ్యాయము.



## మినహాయింపులు—(Reservations).

ఈయంశములనుగురించి భారతదేశస్థులు 7 సంవత్సరములు ఎంతగుంజులాడినా క్రియలో బ్రిటిషు రాజనీతిజ్ఞులు ప్రజాప్రాయమును మన్నించేమార్పును ఏమిన్నీ చేయలేదు. ఇండియా మంత్రికి, బ్రిటిషుప్రభుత్వానికిన్నీ లోబడి గవర్నరుజనరలు వీనిపై పూర్ణాధికారం వహించును. ఇందలి శాఖలకయ్యేఖర్చులు, జీతాలు, పెన్షనులు, గవర్నరుజనరలు స్వంతవివేచన నుపయోగించిచేస్తాడు. మినహాయించబడినశాఖలకు అయ్యేఖర్చులను సాధ్యమైనంతవరకు శాసనసభను మంత్రులను సంప్రదించి చేయునట్లు చట్టబద్ధం కావాలనే భారతమితవాదుల కోరికకూడా మన్నింపబడలేదు.

మినహాయింపులనగాముఖ్యంగా సేన, విదేశవ్యవహారాలు, క్రైస్తవమతవిషయమున్ను. గుంపుజాతులు ఈశాఖల పరిపాలన గవర్నరుజనరలేస్వంతంగా నిర్వహిస్తారనిన్నీ, శాసనసభకు యిందునుగూర్చియెట్టిఅధికారమున్ను లేదనిన్నీ యిదివరకే తెలిపియున్నాము. శాసనసభవారు సేనఖర్చునుచర్చించవచ్చును. కాని వోటుచేయవీలులేదు. సేనవ్యవహారాలకు సంబంధించే సివిల్ విషయాల్లోఅధికారం చెలాయించేహక్కు గవర్నరుజనరలుది. సివి

లుకార్యాలకు సేన నుపయోగించే అధికారమునుకూడా గవర్న రుజనరలే తనచేతిలోనుంచుకుంటాడు. ఈఅధికారం సమాఖ్యప్ర భుత్వానికిచెందింది. సివిలు'లా' ప్రకారం సేనలు నిర్వహించవలసి నవిధులుసేనాధిపతిద్వారా అమలుజర్పించుట,జనులకు సైనికద ళమువల్లకలిగేబాధనుగూర్చివిచారణకై వారినికోర్టులమొనుటకు పిలుపించుటకూడా గవర్నరుజనరలుగారే చెయ్యాలి. హిందూ దేశమువెలుపల భారతపటాలాలు యెందుకుపయోగించాలి? ఇది కాంగ్రెసుపుట్టిననాటినుంచీ పెద్దతగాదాగా నున్నది. చట్టం దీనికి యెట్టిపరిష్కారం తెలుపుచున్నది? బ్రిటిషుగవర్నమెంటు ఆలాకోరితే గవర్నరుజనరలు పటాలాలను పంపడానికి హక్కుం ది. అందువల్లనైనఖర్చులు, సదరు కార్యంవల్ల భారతదేశానికి లాభం కలిగిందనితోస్తే భారతదేశమున్ను లేకపోతే బ్రిటనున్ను పెట్టుకోవాలి. భారతపటాలాలను పార్లమెంటు అంగీకారములే కుండా బ్రిటిషుదేశంవెలుపల ఉపయోగించవచ్చుననిన్నీ,లోపల వుపయోగించినప్పుడే రాజ్యాంగరీత్యా ప్రశ్నించడానికి అవకా శం కలుగుతుందనిన్నీ 'కెయితు'పండితునిమతం. భారతసేనలలో వ్యక్తులను చేర్చుకొనుట, తర్ఫీతుచేయుట, సమాఖ్యవారి అధి కారంలోని విషయాలు. సేనలకు 'కమీషను'నిచ్చుట రాజుగారి అధికారము. ఇది యితరఉద్యోగులపరము చేయవచ్చును. సై నికదళాలు, సామగ్రి, పరిపాలన, వీటికిసంబంధించిన నిబంధనలు సభ్యులతో యోచించి చేయవలసిన అధికారి ఇండియామంత్రి.

బ్రిటిషుసేనలలోని సైనికోద్యోగీయులు, సివిలుఉద్యోగీయులు, వీరిసంతతివారు సైనికోద్యోగముకై పెట్టేదరఖాస్తు ముందు మంజూరుకావాలి.

జాయింటుపార్లమెంటరీకమిటీరిపోర్టులో "భారతదేశ రక్షణభారము అధికంగా భారతీయులయందే ఉండును." అని చెప్పబడినను యీచట్టం సేనాదళాలు భారతీయులపరం అయ్యే విధానం యేమీచెప్పలేదు. ఇప్పుడున్న భారతబ్రిటిషుసైనికుల దామాషాయీ తగ్గించవీలులేదు. ముగ్గురు భారతీయులకొక ఆంగ్లేయుడు చొప్పున ఉండవలసినదే. గతఅయిదోపాయుద్ధంలో బ్రిటిషునాయకత్వ మందబట్టే భారతసేనలకు పేరొచ్చిందని వాదిలంపు. 5 మొదలు 15 వరకు 'యూనిట్లు' ఇప్పటికి భారతీయులపరమైనాయట. (భారతీయాధిపతులచేతిలోనికి యివి వచ్చినవన్నమాట.) ఈ'యూనిట్ల'లోని ఉద్యోగులకు 14 సం॥లు తరిఫీదు అయినతర్వాత యింకామెన్ని భారతీయుల పరంచెయ్యాలో యోచిస్తారట సేనఖర్చు యిదివరలో 55 కోట్లు ఉండేది. ఇప్పుడు 46 కోట్లకు తగ్గించబడింది. అందుచేత సేన భారతీయోద్యోగులపరంచేయుటను గూర్చిగాని, ఖర్చును తగ్గించుటనుగూర్చి కాని, ప్రస్తుతచట్టంలోమార్పేమీ అవసరం లేదని ఇందలి భావము. కాని పూర్వపుధరలనుబట్టి 55 కోట్లు వుండిన ఖర్చు ప్రస్తుతఆర్థికదుస్థితిలో 46 కోట్లకుమాత్రమే తగ్గిందంటే పూర్వపుధరలప్రకారం $64\frac{1}{2}$ కోట్లకు పెరిగిందన్నమాట.

1834 సం॥పు భారతసేనాచట్టంప్రకారం డేరాడూను లోని సైనికకళాశాల నడుస్తుంది. వాయుదళంలో శిక్షణకూడా యివ్వబడుచున్నది. ఇందులో భారతబ్రిటిషుభేదా లుంటాయి భారతసేనాధికారులు బ్రిటిషువాళ్ళతోకూడినసేనను నడిపించుట కర్హులుకారు. కొన్నిసందర్భాలలో సంయుక్తంగా సేనలు నడపడానికి సేనాధిపతి యేర్పర్చవచ్చును. డేరాడూన్ కాలేజీలో చేరడానికి 18 సం॥లు మించని వయస్సుండాలి. $2\frac{1}{2}$ సం॥లు శిక్షణ. ప్రతి 6 మాసములకు 30 కాళీస్థానాలు వస్తాయి. ఇందులో 15 పోటీపరీక్షలవల్ల పూర్తిఅవుతాయి. 15 సేనలోని వుద్యోగులకు వారిమనుష్యులకు యిస్తారు. సంస్థానాలనుంచి కూడా 10 మందిని తీసుకుంటారు. మూంజీగారు ప్రజాపోషణపై నెలకొల్పుచున్న సైనికకళాశాలనుకూడ భారతయువకులకు దేశరక్షణకు తరబీతుపొందుటకై మంచిఅవకాశములు. ఇల్లాంటివి అధమము జిల్లాకొకటైనా యేర్పడేకాలం త్వరలో రావాలి. 1935 సం॥రముకు సేనలెఖ్ఖలు బ్రిటిషు 60 వేలు, భారతీయులు 150 వేలు, నిలవదళం 42500, పతాకంక్రింద యీరిజర్వుదళం వారు అధమం 5 సం॥లున్ను 15 సం॥లు పతాకంక్రింద రిజర్వు సర్వీసుక్రింద కలిపిన్ని నమోదుచేయబడుదురు. భారతరాష్ట్రి దళమనేది ఒకటిగలదు. అందు 19000 గలరు. ఇది అసలు సేనకు రెండవబలగంగా వుంటుంది. ఇదిగాక సహాయసైనికదళమనేది ఒకటి 33000 తో గలదు. ఇది దేశరక్షణకు ఏర్పడినది.

ఇంకులో అంతా యూరోపియనులే. భారతసంస్థానాలదళము లలో మొత్తము 44000 గలరు.

భారతనౌకాదళం:—ఈదళం ప్రస్తుతం నడుపబడు చున్నపద్ధతి యీచట్టం మార్చలేదు. 1927 సం॥పు నౌకాదళ చట్టంప్రకారం యిది నిర్మించబడింది. ఈదళంకూడా సేనవలెనే భారతసరిహద్దులకువెలుపల వుపయోగించవచ్చును గవర్నరు జనరలు నిర్ణయిస్తే. 1934 సం॥పు బ్రిటిషునౌకాదళశిక్షణను గూర్చిన చట్టంలోని అన్నిఅంశాలు భారతచట్టంలో ప్రవేశ పెట్టబడ్డాయి.

యుద్ధప్రకటన, సంధి, విరామనుచేసే అధికారాలు రాజుగారికి ప్రత్యేకంగా ఉండనే ఉన్నాయి (Prerogitives) యుద్ధకాలంలో వర్తకవ్యాపారాలనుగూర్చి శాసించేదీ రాజు గారే. గవర్నరుజనరలుకు యింకాతో కొన్నిహక్కులను ఆయ నసంక్రమింపజేయవచ్చును.

భారతదేశంలోనిసేనా, నౌకా, వాయుదళాలు బ్రిటిషు సామ్రాజ్యబలంకోసమనే నిర్మించబడ్డాయి. కాని భారతదేశక్షే మానికికాదనిన్నీ అందుచేత ఆఖర్చులో కొంతైనా సామ్రాజ్యం భరించాలని కాంగ్రెసు పుట్టిననాటినుంచీ వాదిస్తున్నది. ఇక యింతఖర్చు అక్కరలేకుండానే సేనలను యేర్పాటుచేసుకుని స్వరక్షణచేసుకోగలరు భారతీయులు" అంటున్నది కాంగ్రెసు. విదేశముల సౌజన్యాన్నికోరే సామ్రాజ్యకాంక్షలేని భారతప్రజ

లకు యుద్ధభయముండదని కాంగ్రెసుమతం. కాని యిటీవల బ్రిటిషుప్రభుత్వం 15 లక్షలపౌనులు భారతసేనఖర్చులలోనుంచి భరించుటకొప్పుకొని ఆవిధంగా భారతసేనలను ఒక్కక్షణంనోటీసులో తమయిష్టంవచ్చినచోట యుపయోగించుకోడానికి అవను యేర్పర్చుకొన్నారు. ఇది భారతీయులు నిరసించారు.

విదేశవ్యవహారాలు:—ఇవి నాలుగురకాలు. సామ్రాజ్యములోని అధినివేశాలతోటి సంబంధము, దేశసరిహద్దులలో వున్న దేశాలతోటిసంబంధము, దూరపుదేశాలతో సంబంధము నానాజాతిసమితివంటిసంస్థలతో సంబంధము. శ్వేతపత్రం అధినివేశసంబంధాన్నికూడా మినహాయింపులోనికిరావాలనిసూచించింది. కాని భారత_అధినివేశములకుండే—ముఖ్యంగా వలసపోవడం—సంబంధాలు యికముందు సమాఖ్యవిషయంగా ఉండాలి. వలసదేశములలోని భారతీయులకు సహాయపడ్డానికి సమాఖ్యప్రభుత్వానికి ప్రస్తుతచట్టప్రకారం అవకాశమున్నది.

భారతవిదేశవ్యవహారాలనగా బ్రిటిషువిదేశవ్యహారాలన్నమాట. వారివిధానాన్నిబట్టే భారతవిధానం ఉండాలిగాని స్వతంత్రంలేదు. అయితే సరిహద్దులలో వున్న దేశాలసందర్భములో భారతప్రభుత్వంకు (అనగా గవర్నరుజనరలుకు) ఎక్కువ సంబంధముంటుంది. నేపాళము, టిబెట్టు, ఆఫ్ఘనిస్థానము, కాష్ఘరు, పెర్షియా, అరేబియాలలో యుండే బ్రిటిషురాయబారులు భారతప్రభుత్వపు విదేశశాఖలలోనుంచే నియమింపబడతా

రు. పెర్షియన్ గల్ఫులోనుండే బ్రిటిషుప్రతినిధిమీద గవర్నరు జనరలుకు ప్రత్యేకాధికారం వున్నది.

అంతర్జాతీయ, నానాజాతిసమితివ్యాపారాలు అన్నీ యిండియామంత్రిద్వారా నడుస్తాయి. నానాజాతిసమితి తీర్మానాలఅంగీకారమునకు సంబంధించిన ఉత్తరప్రత్యుత్తరాలుసరాసరిగా భారతప్రభుత్వంతోనే నడుస్తాయి. ఇందుకులోబడి మిగతావిదేశవ్యాపారాలన్నీ సిద్ధాంతంలో రాజుగారిచేతులోనివి గవర్నరుజనరలుకు సంక్రమింపజేయవచ్చును. యుద్ధపురోజులలో తాటస్థ్యప్రకటనముకూడా రాజుగారే (1911 సం॥ బాల్కాను యుద్ధపురోజులలో చేసినట్లు) చేస్తారు. రాజుగారిచే చేయబడిన వుత్తరువులే భారతవిదేశశాఖల నిబంధనలక్రింద అమలుజరుగుతాయి. రాజ్యంకలుపుకోవడం, వదలడం, సంధిచేసుకోవడం కూడా రాజుగారిహోదాలో గర్భితమైనప్రత్యేకఅధికారాలే. ఇవన్నీసిద్ధాంతంలోమాత్రం క్రియలో బ్రిటిషుమంత్రివర్గమే యివన్నీ చెలాయిస్తుంది.

భారతదేశంకూడా నానాజాతిసమితికి స్వతంత్రసభ్యురాలుగా చేర్చుకొనబడినప్పటినుంచీ (యీప్రతినిధి ప్రజానియమితుడుగాక ప్రభుత్వనియమితుడు) ఆయాసమయాల్లో సంధులు, ఖరారునామాలు జరిగినపుడు యీభారతప్రతినిధిసంతకంకూడా వాటిమీద పెట్టిస్తున్నారు. అంతర్జాతీయకార్మికసంఘంకు భారతప్రతినిధి భారతకార్మికసంస్థలసూచనలప్రకారం నామినేటు

చేయబడును. 'లోకర్నో' సంధులవంటిసందర్భాల్లో భారత ప్రతినిధి సంతకం చేయకుండాచేసి భారతప్రభుత్వం తన స్వంత అభిప్రాయం చెప్పింది. ఈభారతప్రతినిధి సంస్థానాలకుకూడా ప్రతినిధిగావుంటాడు నానాజాతిసమితిలో.

తదితరరాయబారాల్లో అనగా ముఖ్యంగా ఆర్థికవిషయాల్లో భారతదేశంలో రెండుదేశాలకు చర్చలుజరిగి ఉభయపక్షాలకునిర్ణయం ఏర్పడును. ఈప్రకారం యేర్పడిన నిర్ణయముకు సంతకంపెట్టేది భారతదేశంపక్షమున బ్రిటిషుప్రభుత్వం వారు గవర్నరుజనరలు గాదు. ఇదియొక ఆచారం (1934 సం॥ లోని జపాను- భారతవర్తకపు అగ్రిమెంటు యిలాంటిదే.) ఇలాంటివికొన్ని విదేశకార్యాలయంలో జరుగుతాయి. అప్పుడు బ్రిటిషువర్తకపుబోర్డును సలహా చెయ్యాలి. అట్టివాటిమీద మంత్రులసంప్రదింపుతో గవర్నరుజనరలు సంతకంపెట్టవచ్చును.

ఇలాంటిసంధిరాయబారాలు గవర్నరుజనరలు చేస్తున్నాడంటే రాజుగారియొక్క ఆమోదంతోటే చేస్తున్నాడని ఊహించాలి. ఇట్టిచర్యలలో గవర్నరుజనరలు బ్రిటిషువిదేశ కార్యాలయం, యిండియామంత్రి కార్యాలయానికిలోబడి జరిగించాలి. శాసనసభవారు గవర్నరుగారు భారతదేశపక్షాన్ని చేసిన పైనితెలిపినలాంటి సంధులనుగూర్చి గవర్నరుజనరలు లేక గవర్నరులయొక్క ఆమోదంలేకుండా యెట్టిబిల్లులు ప్రవేశపెట్టకూడదు. సంస్థానాలవారు అంగీకారపత్రంద్వారా ఒప్పుకుంటేతప్ప యీసంధులలోని అంశాలు వారిని బంధించవు.

కన్వెన్షనులు:—అంతర్జాతీయవర్తకసమితుల 'కన్వెన్షను'లు శాసనసభ్యులు చర్చించవచ్చును. అవి గవర్నరుజనరలు పేరుతో అమలుజరుగును. సంస్థానములవారిని యీకన్వెన్షనులు విధిగా అమలుజరుపమని బంధించవీలులేదు.

ఫ్యాక్టరీశాసనాలు, విమానప్రయాణములలో సంస్థానాలకు బ్రిటిషుభారతదేశానికి సమానచట్టాలుండాలి. వాయువుమీద సంస్థానాలకు వారిఆవరణల్లో ఆధిపత్యంవున్న వైమానికుల రిజిస్ట్రేషను, ప్రమాదాలవిచారణలలో యిండియాప్రభుత్వంవారి అధికారం సంస్థానాలొప్పుకొన్నాయి. 1934 సం॥ర వాయు విమానచట్టంప్రకారం యివి నిర్ణయించబడ్డాయి. 1925 సం॥రం వాయుసమాఖ్యప్రకారం బ్రిటిషుభారతదేశముయొక్కయు, సంస్థానములయొక్కయు ఇందునుగూర్చిన నిబంధనలు ఏకరీతిగా ఉండాలి.

భారత బ్రిటిషుదేశసంబంధాలు గవర్నరుజనరలు చేతులలోనే ఉండును. కాని వర్తకవ్యాపారసంబంధాలుమాత్రం ఖరారునామాలరూపంగా భారతబ్రిటిషుప్రభుత్వాలు చేసుకొనుటకు కొంతస్వేచ్ఛగలదు.

ఈవిదేశశాఖకు సివిలుసర్వీసునుండియు, సైనికసర్వీసునుండియు ఉద్యోగస్థులు నియమింపబడుదురు. ప్రస్తుతమున్న భారతవిదేశశాఖలో యీచట్టమెట్టిమార్పును చేయలేదు.

1927 సం॥ నుంచి భారతప్రభుత్వప్రతినిధి ఒకడు దక్షిణాఫ్రికాభారతీయులక్షేమం కాపాడుటకు 'డర్బను'లో నియమింపబడుచున్నాడు.

మతం:— (Ecclesiastic affairs) భారతదేశంలోవుండే ఆంగ్ల, స్కాట్సు, జాతీయులకుచెందిన క్రైస్తవమత సంస్థను భారతప్రభుత్వం పోషిస్తుంది. ఈసంస్థ పూర్వం సీమలోని బ్రిటిషుమతపీఠముకు అంగంగా వుండేది. ఇప్పుడు 1930 సం॥ నుంచీ యీభారతసంస్థ విడిపోయింది. ఈసంస్థకు శాఖలుగా రాజధానిలో శాఖలుంటాయి. వీటి అధిపతులను ఇండియామంత్రి నామినేషను చేస్తాడు. ఈసంస్థకు సాలీనాభారతప్రభుత్వం చాలసొమ్ము ఖర్చుపెడుతుంది.

# పదియవ అధ్యాయము.

ఆర్థికసంబంధాలు.

సమాఖ్యప్రభుత్వంలో, రాష్ట్రములకు, సంస్థానములకు ఉండేద్రవ్యసంబంధము లెట్టివి? అనే అంశమును చట్టప్రకార మిక్కడ వివరిస్తాము.

రిజర్వుబ్యాంకు నిర్మింపబడి నడుస్తూండాలి. జమలకు మించనిఖర్చుతో ఆదాయవ్యయాలు సరిపుచ్చాలి. నిలవఫండు ఉండాలి. దేశంవైపు మొగ్గేవ్యాపారలాభంతో వర్తకం సాగాలి. క్రొత్త విధానం అమలుకురావడం యీనాలుగంశాలమీద ఆధారపడును.

ఇక దేశంలో ఆర్థికపరిస్థితు లెల్లా ఉన్నాయంటే, కొన్ని రాష్ట్రాలకివ్వబడిన ఆదాయశాఖలరాబడి వాటిఖర్చుకు చాలదు. కేంద్రశాఖల ఆదాయాలు కాలక్రమేణ వృద్ధియగుటకు అవకాశముంది. బంగాళంలాంటి పారిశ్రామికరాష్ట్రాలు ఆదాయపుపన్నులో తమవాటాను హెచ్చించమంటాయి. సంస్థానాలప్రజలుయిచ్చే 'కష్టమ్సుడ్యూటీల'లోనుంచి సంస్థానాలకు హెచ్చుమొత్తాలు వాపసురావాలని వారంటారు. స్వతంత్రగా పరిపాలన నిర్వహించుకొనేందుకు ధనంలేనిరాష్ట్రాలకు సమాఖ్యప్రభుత్వంయీచట్టంక్రింద ఆనష్టం భర్తీచేస్తుంది. బ్రిటిషుయిం

డియాకు చెందిన అలాంటినష్టానికి తమ ఆదాయాలులోనుంచి సొమ్ముపోకుండామినహాయించమంటారు సంస్థానాలవారు. సమాఖ్యరాకపూర్వం బ్రిటిషుయిండియాకున్న ఋణాం తమమీదపడకూడదంటారు సంస్థానాలవారు. ఈభయం సంస్థానాలకక్కరలేదన్నారు బ్రిటిప్రభుత్వంవారు. రాష్ట్రముకు లేనిప్రత్యేకసేనాబాధ్యతలు తమకున్నాయన్నవి సంస్థానాలు. అంతేకాక సంస్థానప్రజలు బ్రిటిషుప్రభుత్వపు సెక్యూరిటీలనుగల్గియుండియు, బ్రిటిషుయిండియాలోనికంపెనీల వాటాదార్లైయుండియు, బ్రిటిషుప్రభుత్వపు ఆదాయపుపన్ను చెల్లుబడిచేయుచున్నందున తమధనం ఆప్రకారంకూడా బ్రిటిషుప్రభుత్వానికి ముట్టుతుంది అనిన్నీ పైగా యీసమాఖ్యవల్ల తమసరిహద్దులలో, పైనుంచి వచ్చినసరుకుపైన వసూలుచేసే సుంకాలుకూడ తమరు వదలుకోవలసివచ్చింది అని కష్టంగాపలికారు యీసంస్థానాలవారు. ఇంకా యిల్లాంటిపన్నులే కొన్నిసమాఖ్యసూత్రానికి విరుద్ధం కనుక సంస్థానాలు వదలుకోవాలి. ఇంతేకాక సదరు బ్రిటిషు ప్రభుత్వానికి పూర్వసంధులప్రకారం సంస్థానాలుకట్టేకప్పములుకూడా తగ్గించకోరిరి. సంస్థానాలు సమాఖ్యలోకి రావడానికి ముందు యిన్నిసమస్యలు పరిష్కారంకావాలి.

ఇక యీ రాబోయే సమాఖ్య ప్రభుత్వానికి ఖర్చుయేలాయుంటుంది? శాసనసభలు పెద్దవిచేయుటవల్లను, రాష్ట్రస్వాతంత్రంవల్లను, సమాఖ్యకు అధమం 1½ కోట్లకు తక్కువకాదు.

క్రొత్తరాష్ట్రాలు రెండిటికి వచ్చేనష్టం (సింధుకు రు.1,10,00,000 ఒరిస్సాకు 47,00,000) భర్తీకి కొంత అవుతుంది. ఇదిగాక పశ్చిమోత్తర సరిహద్దుపరగణానిమిత్తం కోటి అస్సామునిమిత్తం 30 లక్షలు, సమాఖ్య ప్రభుత్వం భరించాలి. బర్మాను భారతదేశంనుంచి విడతీయడంవల్ల భారతాదాయాలకు 3 కోట్లునష్టం. ఈబర్మాసరుకుమీాద దిగుమతిపన్ను యెంతవస్తుందో కాని యిది ప్రత్యేకబాధ్యతనుబట్టి గవర్నరు పాలించే అంశం. ఇంతేకాక రాష్ట్రాదాయాలు పుష్టిగా ఉండేటట్లు చేస్తేనేగాని రాష్ట్రస్వతంత్రం నడవడంకష్టం. ఇట్టి ఆర్థికదుస్థితిలోనైనా ఉద్యోగుల జీతాలుయేమీా తగ్గలేదు. ఈస్థితిలో యీక్రొత్త ప్రభుత్వానికి మరెన్నికోట్లు అదనపుఖర్చు మరెన్నికోట్లు దరిద్రనారాయణస్వరూపమైన యీభారతదేశము అదనపుపన్నుగా భరించాలో తెలియదు.

ఈ గమనికను పురస్కరించుకొని రాష్ట్రకేంద్ర ఆదాయాలు యిచ్చి పుచ్చుకోవడంలో ఉభయసంబంధాలు తెలుసుకోవాలి.

<u>సమాఖ్య ఆదాయాలు:</u>—ఈక్రిందివాటిమీాద వచ్చే పన్నులు సమాఖ్యప్రభుత్వము విధించుకుంటుంది. ఆస్తికి వారసుడైనందుకు పన్ను (ఇందులో వ్యవసాయభూమి చేరదు); సమాఖ్యజాబితాలో చేరిన స్టాంపుపన్నులు; రైలువిమానాల మీాద సరుకులు మనుష్యులు వెళ్లినందుకు, అవిలేక వారు దిగే

స్థలంలో వసూలుచేయబడే పన్ను; రైలుటిక్కెట్లు సరుకుల ఛార్జీమీద పన్నులు (ఛీఫ్‌కమీషనరు రాష్ట్రములలో తప్ప యిట్టిపన్నులు మిగతాస్థలాల్లో రాష్ట్రిసమాఖ్యలకు పంపకం చేయబడును. సమాఖ్యవారు ఈపన్నులకు పైబడి అదనపు పన్నును (Surcharge) విధించి సమాఖ్యావసరాల నిమిత్తం తా ముపయోగించవచ్చును.

ఆదాయపుపన్ను (వర్తక కంపెనీలమీదదిగాక) కూడా సమాఖ్యదే. ఇందులోనుంచి సభాయుతుడైన రాజుగారు నిర్ణయించిన ప్రకారం కేంద్ర, రాష్ట్ర, సంస్థానాలు పంచుకుంటాయి. ఈప్రకారం ది 3-7-1936 తేదీని యివ్వబడిన కౌన్సిలు ఆర్డరు ప్రకారం ఆదాయపుపన్నులో సగం రాష్ట్రాలకు చెందాలనిన్నీ అది నూటికి మదరాసు 15, బొంబాయి 20, బంగాళం 20, సంయుక్తరాష్ట్రములు 15, పంజాబు 8, బీహారు 10, మధ్యరాష్ట్రాలు 5, ఆసాము 2, పశ్చిమోత్తరసరిహద్దురాష్ట్రాలు 1, ఒరిస్సా 2, సింధు 2 చొప్పున పంచుకోవాలి. ఇంతేకాక యీసమాఖ్యవిధానం వచ్చినపిమ్మట కొన్నిసంవత్సరాలపాటు రాష్ట్రసంస్థానములకు చెల్లవలసిన దానిలో కూడ కొంతభాగం సమాఖ్యవారే ఉంచుకోవచ్చును. (చూ. ది 3-7-1937 తేదీగల కౌన్సిలుఆర్డరు) ఈలావుంచుకొనే మొత్తం నూటికి 50 కంటె మించరాదు. అలాఉంచుకోవలసిన కాల నిర్ణయం చట్టాన్ననుసరించి జరగాలి. (చూ. సె 138) ఆదా

యపుపన్నుమీదకూడా పెచ్చుపన్ను సమాఖ్యవిధించుటకు బిల్లు గవర్నరుజనరలు ఆమోదంతో శాసనసభలో ప్రవేశం కావాలి. చేయదగిన తగ్గింపులన్నీ ఖర్చుపద్దులలో చేసినప్పటికి యిట్టిపెచ్చుపన్ను అవసరం అనితోస్తేనే గాని గవర్నరుజనరలు యిందుకు ఆమోదం యివ్వకూడదు.

కంపెనీలపన్ను (Corporation tax):—కంపెనీలకువచ్చేవడ్డీ, లాభాలపైన విధింపబడే యీపన్ను తగ్గించడానికి సమాఖ్యశాసనసభకు హక్కులేదు. సంస్థానాల్లో మాత్రం 10 సం॥ రాలవరకు విధించకూడదనిన్నీ అట్టిపన్నువల్ల ఒకసంస్థానంలో సమాఖ్యవారికి వచ్చేరాబడికి తుల్యమైన మొత్తమును కట్నంగా విధించమనికోరుటకు హక్కున్నది. ఆప్రకారంగా చేసేవిధింపుకు ఒకసంస్థానాధిపతికి తృప్తిలేకపోతే కోర్టుకెక్క వచ్చును. సంస్థానాలిందునుగూర్చి విచారణచేయుట కవసరమైన రికార్డులు సమాఖ్యలెక్కల తనిఖీదారునకు నివేదించుట కుబద్ధులు. ఈపన్నువిధించి వసూలు చేసుకొని అనుభవించేది సమాఖ్య ప్రభుత్వమే.

ఉప్పుపన్ను, సమాఖ్య 'ఎక్సైజు' పన్ను, ఎగుమతి పన్నులు, కూడా సమాఖ్యవారే విధించి వసూలుచేసుకుంటూరు. ఇవిచట్టప్రకారం కేంద్రరాష్ట్రముల మధ్య పంపకం కావాలి. జనపనారమీదవచ్చే ఎగుమతిపన్నులో సగంగాని అంతకుమించిగాని సభాయుతుడైన రాజుగారి నిర్ణయప్రకారం సద

రు నారపండించే రాష్ట్రాలకు చెందాలి. (కొన్నిలు ఆర్డరుప్రకారం యిందులో $62\frac{1}{2}\%$ రాష్ట్రాలకు చెందాలని పిమ్మట నిర్ణయింపబడింది.)

సమాఖ్యవారు పన్ను విధించదగిన తదితరపన్నులను గూర్చి షరతులేమీలేవు. పైపన్నులుగాక సముద్రవ్యాపార మీదను (Sea customs) సంస్థలు వ్యక్తులకువచ్చే లాభములనుబట్టి లెక్కించబడే కిమ్మతుమీదను (Capital value of assets)—వ్యవసాయపుభూమి కిమ్మతు దీనిక్రిందకురాదు—కంపెనీలపెట్టుబళ్లమీదను కూడా పన్నువిధించవచ్చును.

రాష్ట్రాలకుసంబంధించిన యేపన్నునైనా మార్చునట్టియు, 'ఇన్‌కంటాక్సు' చట్టములోని "వ్యవసాయాదాయం" అనే మాటక్రిందచేయబడిన నిర్వచనాన్ని మార్చునట్టియు, రాష్ట్రసంస్థానాలకున్ను, సమాఖ్యకున్ను మధ్యచేయబడిన ద్రవ్యపుపంపకాన్ని మార్చునట్టియు యేబిల్లుగాని గవర్నరుజనరలుగారి అంగీకారంతో తప్ప శాసనవర్గంలో ప్రవేశపెట్టరాదు. ఇక్కడ గవర్నరుజనరలుగారు స్వంత వివేచనతోనే మెలగుతారు.

## రాష్ట్రాదాయాలు.

పైనతెలిపినపన్నులలో రాష్ట్రాలకువచ్చే భాగాలుకాక వ్యవసాయకభూమిపన్ను, నివేశనాలు, యిళ్లువగైరాలమీద పన్ను, వ్యవసాయికఆదాయానికి వ్యవసాయిక భూమికి వార

సత్వపుపన్ను, రాష్ట్రంలో తయారైన కల్లు, సారాయి, నల్ల మందు తదితరసరకులమీద 'ఎక్సైజు', ఇతరరాష్ట్రాలలో తయారైన మత్తు ద్రవ్యాలమీద పోటీపన్నుగా విధించే 'ఎక్సైజు', గనులహక్కుమీద (సమాఖ్యవారి హక్కులకు లోబడి) పన్ను, తలపన్ను (Capitation tax), వ్యక్తుల ఉద్యోగాలు, వ్యాపారాలు మొదలైనవి, మృగాలు, పడవలు సరుకుల అమ్మకం ప్రచురణలు, వినోదాలు, జూదములు, పందెములు మీదపన్నులు; ప్రత్యేకస్థలంలోకి సరుకు రానిచ్చినందుకు సెస్సు, దేశములోపలికాల్వలరహదారీపన్నులు, టోలుగేట్లు, సమాఖ్యపుపద్దులో చేరని స్టాంపుడ్యూటీలు, మొదలైనవి రాష్ట్రాదాయనిలయాలుగా వుంటాయి.

సభాయుతులైన రాజుగారు అవసరంఅనితోస్తే రాష్ట్రాలకు యింకాఅదనంగా గ్రాంటులుపంచిపెట్టవచ్చును. పశ్చిమోత్తరసరిహద్దురాష్ట్రంలో యిష్టంవచ్చినంతవరకు గ్రాంటును హెచ్చించవచ్చును. మిగతావి హెచ్చించాలంటే శాసనసభామోదంకావాలి. 1935 సం॥ జనవరి 1 వ తేదీకి రాష్ట్రంగాని కేంద్రంగాని ఏయేపన్నులు, డ్యూటీలు, సెస్సులు విధించేఅధికారం కలిగివుంటుందో అవిసమాఖ్యశాసనమూలంగామార్పు చెందేవరకు ఆవిధించేవారికే చెల్లుబడిఅవుతాయి.

సంస్థానాలవిషయంలో వారినిసమాఖ్యలో చేరుటకు ప్రోత్సహించుటకుగాను కొన్నిసదుపాయాలు చేయబడ్డాయి.

సంస్థానాలిచ్చే అన్నికట్నాలు, ఋణసంబాధాలు, సమాఖ్య ప్రభుత్వమునకు చెందుతాయి. ఇందుండి రాజప్రతినిధికోత్యా సంస్థానాలతో గవర్నరుజనరలు వ్యక్తిగతంగా నిర్వహించే పనుల కుడబ్బును సమాఖ్యవారివ్వాలి. సమాఖ్యలోచేరదలచిన సంస్థానములకు వారు రాజుగారికివ్వవలసిన కట్నాలు 20 యేండ్ల కాలముకు మించకుండా రెమిషను కొన్ని షరతులతో యివ్వవచ్చును. కాని సమాఖ్యనుండి రాష్ట్రములు ఆదాయపుపన్ను లోనితమవాటాను పొందుటకు ముందుగానే యిట్టిరెమిషను లివ్వబడకూడదు.

ఇంతేకాక ఓడరేవులసుంకములు, ఉప్పుచేసుకొనుట, దేశంలో వ్యాపారసుంకములహక్కును వదలుకున్నందుకు, ఉప్పుహక్కు తదితరవస్తువులపైన రహదారీపన్ను వగైరాలు వదులుకున్నందుకు, వదులుకున్నహోదా లేక భూభాగమునకై ప్రతిఫలము, గవర్నమెంటు టపాలు ఉచితంగా నడిపించినందుకు మొదలైనవాటినిగూర్చి సంస్థానాలకు కొంతప్రతిఫలం ముట్టజెప్పాలి కాని యిందులో ఏదైనా అంశముఅంగీకారపత్రికారం సంస్థానంవదలుకుంటే వాటికివర్తించదు.

సమాఖ్యవారి ఆస్తిపై రాష్ట్రసంస్థానాలలో పన్నుండరాదు. ఇల్లాగే రాష్ట్రసంస్థానాలవారికి, బ్రిటిషుయిండియాలోగల ఆస్తులపైన పన్ను మినహాయించబడును. సంస్థానాధిపతికి వ్యక్తిగతంగా ఉన్నఆస్తికి యిది వర్తించదు.

సమాఖ్య, రాష్ట్రములు ఇండియామంత్రికి సమాఖ్య, రాష్ట్రముల నిమిత్తంచేయవలసిన ఖర్చులకు (ముఖ్యంగా జీతాలు, పెన్షనులకు) అవసరమైన ధనాన్ని పుష్కలంగా చేకూర్చాలి.

రిజర్వుబ్యాంకు:—భారతఆర్థికసౌష్ఠవానికిగాను ఒకరిజర్వుబ్యాంకు ఉండాలని తలచబడింది. ఈబ్యాంకుకు రాజకీయపక్షాభిమానాలతో నిమిత్తం ఉండకూడదు. 1934 సం॥పు రిజర్వుబ్యాంకుచట్టం ప్రకారం 1935 సం॥న యిది నిర్మించబడి సాగుచున్నది. దీనికేంద్రపాలకవర్గమునకు 12 గురు డైరెక్టరులు ఒకగవర్నరు, ఇద్దరు డిప్యూటీగవర్నర్లు, ఒక అధికారసభ్యుడు ఉంటారు. డైరెక్టర్లలో నలుగురను గవర్నరుజనరలు నియమించును. అధికారసభ్యుని సమాఖ్య ప్రభుత్వం నియమించును. మిగతా 8 గురు డైరెక్టర్లు వాటాదార్లచేత ఎన్నుకోబడుదురు. గవర్నరు, డిప్యూటీగవర్నర్లను గవర్నరుజనరలే నియమించి వారిజీతబత్తెములు, కాలనిర్ణయమునుకూడ ఆతడే ఏర్పరచును. ఈపాలకవర్గమును రద్దుచేయుట మున్నగు హక్కులు గవర్నరుజనరలుకు కలవు. ఈబ్యాంకువారు కర్రెన్సీ, బ్యాంకునోట్లు, వెండిబంగారముల నిలవయును వశముంచుకొందురు. ఈ బ్యాంకుయొక్క పెట్టుబడి 5 కోట్లు. నూరురూపాయిల వాటాలపైన దేశంలో పూర్తిచేయబడినవి. దీనిపైన యీసాటున సుమారు 3% చొ॥న వడ్డీయివ్వబడినట్లు తెలియుచున్నది. ఈ

బ్యాంకుతరఫున గ్రామపరపతిశాఖ ఒకటి స్థాపించబడి దీని ద్వారా వ్యవసాయకులకు సకాలంలో పెట్టుబడులుయిచ్చుట, దీర్ఘవాయిదాలపద్ధతిని అప్పులను యిచ్చుటకున్ను ఒకపథకం తయారుచేయబడినది. సహకారసంఘాలు, భూమితనఖా బ్యాంకులకు యీశాఖతోగల సంబంధం సరిగా నిర్ణయముకావాలి. ఇటీవల ప్రచురించబడిన యీపథకం వ్యవసాయకులకు అంతగా ఉపయోగపడునట్లు కనుపడదు.

కాని కరెన్సీనోట్లువేయుట, నాణెములకు సంబంధించిన బిల్లులు, రిజర్వుబ్యాంకు నిబంధనమార్చే బిల్లులు, గవర్నరు జనరలు అంగీకారమును పొందితేనేగాని శాసనశభలో ప్రవేశంకావు.

<u>ఋణముతెచ్చుట:</u>— (సె 161-166) రాష్ట్రమువారు, కేంద్రంవారున్ను చట్టములోని పరిమితికి లోబడి ఋణముచేయవచ్చును. సమాఖ్యవారు రాష్ట్రమునకు ఋణమునివ్వవచ్చును. లేక వారుచేసే ఋణములకు కొన్నిషరతులతో హామీయివ్వవచ్చును. భారతదేశంవెలుపల ఋణముచేసే రాష్ట్రము ముందుగా సమాఖ్యవారి అంగీకారాన్ని పొందాలి. దేశంలోచేసినా ఆరాష్ట్రం యిదివరలోనే ఋణపడిఉంటే కొత్తఋణానికి సమాఖ్యవారి అంగీకారం కావాలి. ఈఋణాలుచేయుట, వడ్డీరేటు వగైరాలకు సంబంధించిన తగాదాలు పరిష్కరించేహక్కు, గవర్నరు జనరలుగారిది. (స్వాంతవివేచనతో) విదే

శాల్లో స్వల్పవడ్డీకి డబ్బు తెచ్చి భారతగ్రామఋణాన్ని ఒకపత్రకం ప్రకారం తక్షణం తీర్చేసేచట్టం చేయడానికి సమాఖ్య శాసనసభకు స్వతంత్రంగా హక్కు లేదన్నమాట. ఇదివరలో ఇతర దేశాల్లో స్వల్పవడ్డీకి డబ్బుదొరుకుతూంటే అంతకంటె అధికంగా అనగా 5% కు యిండియా ప్రభుత్వం కోట్లకొలది ఋణం తెచ్చినసంగతి విశదమే. అలాంటి అక్రమాలు ముందైనా జరగకుండా చేసుకోడానికి సమాఖ్యశాసనవర్గానికి అవకాశము యీచట్టప్రకారం ఉన్నదా? ఆమాట సంశయం. సమాఖ్యవారి ఋణాలు యిండియామంత్రి అంగీకారాన్ని పొందాలి.

తణిఖీశాఖ:—గవర్నరుజనరలు స్వంతనిర్ణయంప్రకారం రాష్ట్ర సమాఖ్య లెక్కలతణిఖీవర్గాలను గూర్చి నిబంధనలను చేయును. రాజుగారు యావత్తుభారత ఆడిటరుజనరలును నియమించెదరు. ఈయనకు భత్యముకాక నెల 1 కి రు 5000 లు జీతం. ఈయనవిధులు, ఉద్యోగపరిమితి వగైరాలు కొన్నిలు ఆక్షేపలేక శాసనసభవారి చట్టంవల్ల నిర్ణయించబడును. కాని దానికి గవర్నరుజనరలుయొక్క ప్రవేశాంగీకారం కావాలి. ఈయన రాష్ట్రములలోకూడా పనిచేయవచ్చును. ఈచట్టము అమలుకువచ్చిన రెండు సంవత్సరములలోగా రాష్ట్రంలో నియమించవలసిన 'ఆడిటరుజనరలు'లను సమాఖ్యప్రభుత్వంవారే నియమించవచ్చును. భారత ఆడిటరుజనరలు లెక్కలు తయారయ్యే పద్ధతులను గూర్చి ఉత్తరువులు చేయవచ్చును. ఈయన నివేది

కలను శాసనసభలకు పంపుతారు. రాష్ట్రసమాఖ్య, రైల్వే అధికారవర్గంవారి బ్రిటిషుదేశంలోని కాతాలెఖలను గూర్చి తనిఖీ చేయుటకు సీమదేశంలో యింకో ఆడిటరుజనరలును నియమించాలి. బర్మాకు, సంస్థానాలకుకూడా యీయనే లెక్కలతనిఖీ చేయును. ఆనివేదిక ఇండియామంత్రికి పంపాలి.

---

# పదునొకండవ అధ్యాయము

పబ్లికుసర్వీసు.

సిద్ధాంతములో ప్రతిపబ్లికుసర్వీసుఉద్యోగి రాజుగారి ఆమోదంతోనే నౌకరీలో ఉంటాడు. కాని వాస్తవములో భారతప్రభుత్వముకు యీ ఉద్యోగికీ ఉండేసంబంధము ఖరారు నామావలన (Contractual relationship) కలిగినద నే సూత్రం పార్లమెంటువారిచేత అంగీకరించబడినది. ఇక యే వ్యక్తిన్ని తననిర్దోషిత్వమును స్థాపించుకొనే అవకాశం లేకుండా బర్తరఫుగాని, హోదాతగ్గింపుగాని పొందకూడదు. కాని యిందుకు రెండుమినహాలు. ఇతడు క్రిమినలుకేసులో శిక్షింప బడినవాడైతే విచారణావకాశం యివ్వబడదు. అల్లాగే అతనికి విచారణావకాశం యివ్వడం "సమంజసంగా సాధ్యంకా"దని తోచినప్పుడుకూడా విచారణావకాశం లేకుండానే ఉద్యోగిని శిక్షించవచ్చును. (సె 240 b.) ఈవాక్యాలు కొంత అపోహా నుకలుగ జేస్తున్నాయి.

ఒక ఉద్యోగినినియమించిన అధికారికంటె క్రిందిహోదా లోనివారు ఆఉద్యోగిని బర్తరఫుచేయరాదు. సాధారణంగా గవర్నరుజనరలు సమాఖ్య పబ్లికుసర్వీసుకున్ను, గవర్నర్లు రాష్ట్రసర్వీసుకున్ను, నిబంధనలు చేస్తారు. ఇదివరలోవున్న వుద్యోగులకు ఉన్నరక్షణలుగాక ఒకడిపార్లమెంటు అధిపతి

ఏపబ్లికుపుద్యోగినైనా శిక్షించడంగాని, నిరసించడంగాని జరిగి స్తే అందుపైన అప్పీలుంది. లేక పరతు ప్రకారంగాక ముందుగానే బర్తరపుచేస్తే గవర్నరుజనరలు గాని, గవర్నరుగాని 'కంపెన్సేషనులు' యివ్వవచ్చును. సివిలుడిపార్టుమెంటులో నౌకరీచేస్తున్న ఉద్యోగినిగూర్చి అతనిఅధికారిచేసినఉత్తరువులన్నీ గవర్నరుజనరలు, గవర్నరు పునర్విమర్శన చేయువచ్చును. యీ అంశములు ముఖ్యముగా గమనించనగును.

రైల్వేఅధికారవర్గముకు రైల్వేఉద్యోగాలను గవర్నరుజనరలుపక్షమున నియమించే హక్కు గలదు. పెద్దఉద్యోగాల నియామకంలో నిబంధనలగురించి 'పబ్లికుసర్వీసుకమీషన్'తో సంప్రదించాలి.

<u>ఆంగ్లో-యిండియనులకు రైల్వేవగైరాలలో ప్రత్యేక హక్కులు:</u>—రైల్వేలు, పోస్టు-టెలిగ్రాపుశాఖలలో పూర్వార్జితంగా ప్రత్యేకసౌకర్యాలు, హక్కులు వున్నాయన్నదిచట్టం. ఈవిషయంలో రైల్వేఅధికారవర్గంకూడా గవర్నరుజనరలు ఉత్తరువుకు లోబడాలి.

పోలీసు, భారతవైద్యసేవ, భారతసివిలుసర్వీసులకును తానవసరంఅని తలచే మరియేసర్వీసునకును తానే ఉద్యోగాలు పూర్వంవలెనే నియామకంచేస్తాడు ఇండియామంత్రి. (సె 244-245) ఈప్రకారం అప్పుడే పంపకాలు అయిపోతున్నాయని మదరాసు భారతసివిలుసర్వీసుసంఘాధ్యక్షులైన శ్రీ గోపాల

స్వామిఅయ్యంగారు తెలియజెప్పినారు. (చూ. గతమాసాలలో వారు సదరుసంఘపక్షమున యిచ్చిన అధ్యక్షోపన్యాసము.) ఈయన వివరాలు పార్లమెంటుయెదుటపెట్టాలి. మరికొన్నివిషయాల్లో ఉద్యోగస్థానాలు ఇండియామంత్రి నిర్ణయిస్తాడు. అవి పూర్తిచేసేవిధానం, సవరణలను సూచిస్తూ రిపోర్టును గవర్నరుజనరలు ఇండియామంత్రికి పంపించవచ్చును. ఇరిగేషనుశాఖలకు కూడ ఇండియామంత్రి ఉద్యోగనియామకం చేయవచ్చును. గవర్నరుజనరలు, గవర్నర్లు నియమించవలసిన ఉద్యోగాలను గూర్చిన నిబంధనలన్నీ ఇండియామంత్రే చేస్తాడు. ఉద్యోగుల ప్రమోషను, సెలవు, పన్షనులనుగూర్చి ఆయాశాఖాధికారి వుత్తరువుయిస్తాడు. గవర్నరుజనరలుకు, ఇండియామంత్రికిన్నీ ఇట్టి అన్నివుత్తరువులమీద సవరణాధికారం గలదు. ప్రస్తుతచట్ట ప్రకారం ఒకవుద్యోగికి నష్టంవచ్చినగాని, మరియేకారణంవల్ల గాని సదరువుద్యోగికి కంపెన్సేషనుకూడా యిప్పించుటకు అభ్యంతరము లేదు.

ఇదివరలో యూరోపియనుసర్వీసుకు బ్రిటిషుపౌరులకే అధికారంవుండేది. ఇప్పుడు సంస్థానపౌరులకుకూడా కలిగినది. స్త్రీలకుకూడా పబ్లికుసర్వీసులో అధికారం ఒప్పబడింది కాని గవర్నరుజనరలు, గవర్నర్లు వారికివ్వకుండా చేయవచ్చును.

ఇండియామంత్రికి పైనచెప్పబడిన అధికారాలు తనసలహాదార్ల ఆమోదంతో చెలాయించవలెనని చట్టంలోవున్నా

సలహాదార్లందరినీ ఒప్పించాలని నియమం లేదు. తాను సలహా పొందదలుచుకొన్న వారినిమాత్రం ఒప్పిస్తే చాలునని అక్కడ తాత్పర్యం. ఈఅర్థంలో తనసభలోనిభారతీయులను సలహాకే పిలవకపోవచ్చును.

పబ్లిక్సర్వీసుకమీషనులు:—ఈసంఘములు సమాఖ్యా ప్రభుత్వానికొకటి, ప్రతిరాష్ట్రమునకుగాని, కొన్నిరాష్ట్రములకు కలిపి ఒకటిగాని వుంటాయి. సమాఖ్యాది గవర్నరుజనరలున్ను రాష్ట్రాది గవర్నరున్ను (స్వంతవివేచనతో) నియమిస్తారు. వీరిఉద్యోగకాలం వగైరా వీరేనిర్ణయిస్తారు. ఈకమీషన్ యొక్క అధ్యక్షుడు తనపదవిముగిసినవెనుక మరేఉద్యోగం చేయకూడదు.

వీరుచేసేపని ఉద్యోగాలివ్వడంకాదు. అభ్యర్థులపరీక్షలు మాత్రం జరుపుతారు. ప్రభుత్వం అడిగితే వుద్యోగనిర్ణయంలో సలహాయివ్వాలి. అటవీశాఖకు ప్రత్యేకఅర్హతలుండాలి. సాధారణంగా పబ్లికునౌకరీలకుసంబంధించిన అన్నివిషయాల్లో ప్రభుత్వం వీరిని సంప్రదించాలి. వివిధసంఘాలమధ్య ఉద్యోగాలు పంపకంచేయడమునుగురించి వీరిని అడుగకూడదు. అది గవర్నరుజనరలేచేస్తాడు. పోలీసుశాఖలోని క్రిందివుద్యోగులనుగూర్చి కూడా వీరితో సంప్రదించరాదు.

ఈకమీషనరులకు యివిగాక చట్టప్రకారం యితరఅధికారాలు ఆయాశాఖాధికారుల ఆమోదంతో యివ్వవచ్చును.

కాని సదరుఅధికారములను వీరు ఇండియామంత్రినియమించిన ఉద్యోగులమీదను, సైనికోద్యోగులమీదను, 'రిజర్వుడు' అని చెప్పబడినస్థానాలలో ఉన్నవుద్యోగులమీదను, ఇండియామంత్రి ఆమోదంలేకుండా చలాయించజాలరు. ఏరాష్ట్రచట్టమైనా రాష్ట్రసర్వీసులోలేని ఉద్యోగులపైన యిట్టిఅధికారమిస్తే గవర్నరుజనరలు ఆమోదంపొందితేనేగాని అది అమలుజరుగుటకు వీలులేదు.

చట్టప్రకారం పబ్లికుసర్వీసు ఉద్యోగులకు క్రొత్తరక్షణ ఒకటి యివ్వబడింది. శాఖాధిపతి అంగీకారంలేకుండా యేపబ్లికుప్రద్యోగిపైనను సివిలు, క్రిమినలు కేసు పెట్టకూడదు. అట్టి ఆమోదంతో కేసుపెట్టినప్పటికూడా సదరుమద్దాయి లేక ప్రతివాది చర్యలు సదుద్దేశంతో చేయబడినవని న్యాయాధిపతి నొంచితే (నేరం యేలాటిదైనా) కేసు కొట్టివేయవచ్చును. ఆలాటప్పుడు వాది లేక ఫిర్యాదీవల్లను కోర్టుద్వారా పొందజాలని ఖర్చులను ప్రభుత్వం సదరుప్రద్యోగి కిచ్చుకోవాలి. ఈరక్షణలు బాగాళంలోని విప్లవోద్యమంవల్ల చేయనవసరం కలిగిందన్నారు.

ఇవిగాక మామూలు సివిలుప్రొసీజరు, క్రిమినలుప్రొసీజరుకోడ్డులప్రకారము ఉద్యోగులకున్న రక్షణలన్నీ ఉండనే ఉన్నాయి.

అన్నిటికంటె ఆశ్చర్యాన్ని పుట్టించిన అంశమేమిటంటే బ్రిటిషుఉద్యోగుల పెన్షనులకు భారతప్రభుత్వాదాయం ప్రథమ బాధ్యత (First charge) గలది. ఇంతేగాక సీమదేశంలో హిందూదేశపు తనఖాపైన ఋణంచేసిఅయినా గవర్నరుజన రలు యీపెన్షను లివ్వడానికి హక్కున్నది. ఇంత అపూర్వ సంశయాం, అధికారం యెందుకో ?

భారతసైనిక వితంతునిధి. అనాథలనిధి, కుటుంబపెన్షనులనిధి, విరాళములవలన యేర్పడే భారతసైనికకుటుంబపెన్షనులనిధి, సివిలుసర్వీసుకుటుంబపెన్షనులనిధి. వీటిక్రింద నిబంధనలప్రకారము సభాయుతులైన రాజుగారు సదరు నిధులపాలనకు యేర్పాట్లుచేస్తారు.

---

# పండ్రెండవ అధ్యాయము.

సంస్థానాలు జనసంఖ్య 7 కో. 90 ల. చతురపుమైళ్ళు 675267.

ఈ సంస్థానాలు ఫిరంగీ మర్యాదలు గలవి, లేనివి (Salute states and non-salute states) అని రెండు రకాలు. ఇదివరలో వీనికి సంబంధము ఆయా రాష్ట్ర గవర్నర్లతోగాని రాజప్రతినిధితోగాని ఉండేది. అది యిప్పుడుపోయి దేశము కొన్నిఖండాలక్రింద విభజించి ఒక్కొక్కఖండములోని సంస్థానాలను ఒకయేజెన్సీక్రింద ఉండాలన్నారు.

ఈసంస్థానాలలో చాలచోట్ల నిబంధనాయుతపరిపాలన లేదు. మైసూరు, బరోడా, కాశ్మీరములలో శాసనసభలున్నాయి. నైజాములో కార్యవర్గపరిపాలనమే యించుమించుగా జరుగుతోంది. శాసనసభలున్న సంస్థానాల్లోకూడా సభవారికి ప్రశ్నలువేయుట, సలహా చెప్పుటకుమాత్రమే అధికారం. ఈ నిబంధనలు అధిపతిని బైండుచేయవు. 34 సంస్థానాల్లోమాత్రం కార్యవర్గం, న్యాయశాఖ వేరుచేయబడినవి. కొన్నిటిలో మాత్రం అధిపతియొక్క వ్యక్తి ఆస్తికిన్నీ, ప్రభుత్వాస్తికిన్నీ సంబంధంలేకుండా ఉంది. 40 సంస్థానాల్లో హైకోర్టులున్నాయి. చాలాచోట్ల మామూలుకోర్టులు ఉద్యోగస్థులను విచారించుటకు హక్కులేదు. 40 సంస్థానాలు క్రమమైన సివిలుఉద్యోగుల జాబితాలను కలిగి సివిలుసర్వీసును ఒకపద్ధతిపై నడిపిస్తున్నాయి. అన్నిసంస్థానాల్లోను పెన్షనులిస్తారు. సంస్థానములకు

గలహోదాలు 3 రకాలు. (1) కొన్ని సంపూర్ణ శాసన, న్యాయ నిర్వహణాధికారం గలవి. (2) కొన్ని బ్రిటిషువారు ఆంతరంగిక పరిపాలనను తణిఖీచేయుట, వర్ధిల్లో ఉంచుటకు లోబడి కొంత వరకు శాసనాధికారం కలవి. సిమ్లాకొండ సంస్థానాల్లో 'రెసిడ్యుఅరీ' హక్కులు బ్రిటిషువారివే. (3) కొన్ని అతిస్వల్ప పరిపాలనాధికారంగల యెస్టేటుజాగీరులు. మైసూరు, తిరువాన్కూరు, భావనగరు, బరోడా, ఇటీవల నైజాము వగైరాలలో గ్రామపునర్నిర్మాణకార్యక్రమములు మంచివి ఉద్యమింపబడినవి.

నరేంద్రమండలి:—109గురు పెద్దసంస్థానాలనుండిన్ని 12గురు రెండవరకంనుండిన్ని వచ్చే ప్రతినిధులతో యీమండలి 1919 సం॥ యిండియాచట్టప్రకారం యేర్పడింది. పెద్దసంస్థానాలు కొన్ని చిన్నవాళ్లతో కలియడం గౌరవప్రదం కాదని యిందులో చేరని హేతువుచేత యీమండలిద్వారా చిన్నసంస్థానాలు తమహక్కులను విశాలపరుచుకొనుటకు యత్నిస్తున్నాయి.

ఎగుమతిదిగుమతిపన్నులు, 'వైర్లెసు', విమానాలు-యీవిషయములలో తమహక్కులకై యీసంస్థద్వారా సంస్థానములు ఆందోళనచేస్తారు. బ్రిటిషుయిండియాను, సంస్థానాలకున్ను, ఉభయులకు మిగతాసామ్రాజ్యముతోటిన్ని గలసంబంధములనుగూర్చి రాజప్రతినిధి వీరితోనే సంప్రదిస్తారు.

సంస్థానములు బ్రిటిషురాజుగారి రక్షణక్రింద ఆయన సార్వభౌమత్వమునకు లోబడి వర్తిల్లాలి. ఈసార్వభౌమత్వం (Paramountcy) అనిర్వచనీయమైనది. ఇక ఈసంస్థానముల కున్ను, బ్రిటిషురాజుగారికిన్ని జరిగిన పూర్వపుసంధు లున్నాయి. ఇదిగాక యీసంస్థానములపట్ల పూర్వపురాజప్రతినిధులు జరిపిన చర్యలనుబట్టి యేర్పడిన ఆచారాలున్నాయి. (Political Practices.) ఈమూడు అంశాలనుబట్టి సంస్థానములకు బ్రిటిషుయిండియాతోగల సంబంధములు అంతర్జాతీయశాస్త్ర దృష్టిలో నిర్వచించాలి. బ్రిటిషుఆధిపత్యముకు వీరు కట్నము లుకూడా కడతారు.

రాబోయే సమాఖ్యలో యీమూడురకముల సంబంధాలు మారవు. ఆసంబంధములక్రింద ప్రత్యేకాధికారి రాజుగారే. ఆయనతరఫున ప్రతినిధిగా గవర్నరుజనరలే యీసందర్భములో రాజప్రతినిధి అనే హోదాతో వాటిని తానొక్కడే నిర్వహిస్తాడు.

సంస్థానాలు ఈఫెడరేషనులో చేరవలెనని బ్రిటిషువారు కోరేసరికి యీఅవకాశంలో తమస్థితిని, హోదాను అధమం గట్టిపరచుకోవడమైనా జరిగించుకోవాలని సంస్థానా లుద్యమిస్తున్నాయి. (1) సార్వభౌమాధికారంఅంటే యేమిటో నిర్వచించి దానిహద్దులను వ్రాతమూలకం చేయవలెను. ఇదివరలో హైదరాబాదు, కాశ్మీరు మొదలైనసంస్థానములలో బ్రిటిషు గవర్న

రుజనరలు అధాత్తుగా జోక్యముపుచ్చుకొని పరిపాలన సవరిం చుకొన బలవంతపెట్టి ఆలాచేయించినారు. అట్టిపరిస్థితుల నుండి ముందు తప్పించుకోవాలని వీరిఉద్దేశము. (2) తాము చెల్లించేకట్నములను రద్దుచేయవలెను. (3) తమకున్న రాజ్యాధి కారంలో యెప్పుడూ, యేవిధంగానూ, యెవరూ జోక్యం పుచ్చుకోరాదు. కప్పములు తగ్గాలి. ఆదాయపుపన్నుమీద హెచ్చుభాగం తమకుచెందాలి. కొన్నిప్రాంతాలు (బెంగుళూరు వంటివి) తమకు స్వాధీనంకావాలి. రైల్లువేసే అధికారం తమకు కావాలి. (సంస్థానాలరైళ్ళలో బ్రిటిషువారికి జోక్యమున్నది. ఇది సైనికనీతినిబట్టి బ్రిటిషువారు సంపాదించుకున్నారు). ఇవి ముఖ్యముగా సంస్థానముల ఆందోళనలోని లక్ష్యాంశములు. ఒకవేళ యివన్నీ లభించినా వారు అభయాంతో సమాఖ్యతో చేరదలచినట్లు కనుపడదు. అవసరంవస్తే సమాఖ్యలోనుంచి విడిపోవడానికికూడా తమకు హక్కుందని న్యాయవాదులచేత నిర్వచనంచేయించుకొని మరీజేరాలని చూస్తున్నారువీరు.

టెల్లిగ్రాములు, టెల్లిఫోనులుకూడా బ్రిటిషుప్రభుత్వమే సంస్థానాల్లో వేశారు. స్థానికావసరములకొరకు సంస్థానములు వీటిని వృద్ధిచేసుకొనవచ్చును. వీటి పరిపాలనాశాఖలు బ్రిటిషు వారేర్పరచినవే.

ఓడరేవులసుంకములు సంస్థానములలోనైనా వసూలు చేసుకొనేహక్కు బ్రిటిషువారికి సాధారణముగావున్నది. దేశ

ములోపలి సుంకము లే సంస్థానములకు చెందును. సంధిషరతులనుబట్టి యిందు ఆయాస్థలములలో అనేకమార్పులుకలవు.

నాణెముల చలామణీకి రూపాయే ప్రమాణముగా ఖాయపరచబడినది. సంస్థానములవారినాణెములు వారిహద్దులలోపలనే చలామణీఅగును. ఉప్పుపన్నుఅధికారంకూడా బ్రిటిషువారిదే. ఈవిధంగా బ్రిటిషుఇండియాకున్ను సంస్థానాలకున్ను ఉభయావసరము, క్షేమకరముఅయిన అనేకవిషయాలుండి జాయంటుగా పూర్వంనుంచీ అమలుజరుగుతున్నాయి.

ఇంతేకాదు. సంస్థానప్రజలు నిరంకుశపరిపాలన కలవాటుపడ్డా, బ్రిటిషుప్రభుత్వం అట్టిపరిపాలనను స్థిరపర్చడంలో సంస్థానప్రభువులకు ఎట్టిఖరారులను చేసినను ప్రక్కబ్రిటిషు ఇండియాలోని పూర్ణస్వరాజ్యాందోళనాన్ని ఆప్రజలున్ను చూస్తూనే వున్నారు. భారతకాంగ్రెసుశాఖలు సంస్థానాల్లోను వున్నాయి. స్వరాజ్యమనేది సంస్థానాలసహా యావద్భారతదేశానికీ వర్తిస్తుందనే కాంగ్రెసుసూత్రం.

ఈసంస్థానప్రజల రాజకీయ హక్కులకై పోరాడేది సంస్థాన ప్రజాసంఘం. గతసాలున ఈసంస్థానప్రజల మహాసభాధ్యక్షత వహించిన శ్రీ పట్టాభిగారి సామర్థ్యమువలన ఆంధ్రప్రతిభ సంస్థానములందు అధిక వ్యాప్తమైనది. దీనితరఫున సాలీనామహాసభలు జరుగుతున్నాయి. శాసనాలు చేయుట, పన్నువిధించుటలో ప్రజాప్రతినిధులు భాగస్వాములు కావ

లెను. సంస్థానాధిపతి స్వాంతసామ్యం అనేది నిర్ణయింపబడి కేటాయించబడాలి. న్యాయశాఖనుండి కార్యనిర్వహణశాఖ వేరుచెయ్యాలి. పౌరహక్కుల ప్రకటన కావాలి 1935 సం॥ చట్టప్రకారం యేర్పడే సమాఖ్యశాసనసభ్యానికి నియమితమైన సంస్థానప్రతినిధులు ప్రజలచేతనే యెన్నుకోబడాలి. సివిలు సర్వీసు కట్టుబాట్లతో నిర్మించబడాలి. అది న్యాయశాఖ చేతిలో నుండాలి. ఇవి భారతసంస్థాన ప్రజాసంఘంవారి ఆశయాలు. వీనిని పురస్కరించుకొని వీరున్ను మహత్తరమైన ఆందోళనకై ఉద్యమించుచున్నారు. అసలు సంస్థానములే రద్దుకావలెనను అతివాదపక్షమున్ను వీరిలో యేకొద్దిపాటిలోనైనా లేకపో లేదు.

---

# పదమూడవ అధ్యాయము.



ఏకదేశవిధానం—సమాఖ్యవిధానం—అధినివేశప్రతిపత్తి-క్యాబినెట్టుపద్ధతి—లక్షణసమన్వయం—గుణదోషాలు.

ఒకదేశంలోని రాజ్యాంగముయొక్క విధానం, హోదా, పరిపాలనాపద్ధతినిగూర్చి తెలిపే పై రాజ్యాంగపారిభాషికపదాలు యీచట్టంలోనూ ఉపయోగించబడ్డాయి. అందుచేత యీ పదాలకు వాక్యార్థం కొంచెముచేసి వాటికి ప్రస్తుతచట్టంప్రకారం యీదేశంలో యెంతవరకు వ్యాప్తిగలదో యోచిద్దాము. ఇంతేకాక యీచట్టమును సుబోధం చేసుకోవాలంటే యీశాస్త్రవిషయాలుకూడ తెలుసుకోవాలి.

ఇప్పటివరకు మనదేశములోని రాజ్యాంగము యేకదేశ విధానము (Unitary system) పైన ఆధారపడినది. ఏక దేశవిధానమనగా రాజ్యాధికారము (అనగా శాసనములుచేసి అమలుపరచేహక్కు, ఆప్రకారము న్యాయనిర్ణయముచేయుట సహా) ఒక్కటే కేంద్రప్రభుత్వముక్రిందసదా ఉండి చలాయించబడేది. రాజధానులు లేక రాష్ట్రప్రభుత్వములకు యీసూత్ర ప్రకారము యీకేంద్రాధికారము తాత్కాలికంగా అప్పజెప్ప బడుతుంది (Delegation). అంతే. ఇంగ్లీషుపార్లమెంటువారు లండను రాజధాని కౌన్సిలు హక్కులన్నీ ఒక్క నిమిషములో

లాగుకొనవచ్చును. అమెరికాసమాఖ్యప్రభుత్వము 'న్యూయార్క్' ది, ఆలా లాగుకొనలేను. రెండవదానివిషయములో హక్కులులాగుకొనుటకు ఉభయుల అంగీకారము కావాలి. చట్టబద్ధమైనవిధానం ఆప్రకారం మారాలి. అది సమాఖ్యవిధానం కనుక. మొదటిది ఏకదేశ విధానం కనుక అలా అక్కరలేదు.

2 వ తరగతి—సమాఖ్యవిధానము. దీనిక్రింద రాజ్యాధికారమనేది రాష్ట్రమునకు కేంద్రమునకు "యింతంత" అని పంపకము జరుగును. ఆపంపిణీప్రకారం ఒకనిబంధనావళి వ్రాతది ఉండాలి. ఆనిబంధనావళిప్రకారమే ఒక 'సుప్రీము' న్యాయస్థానముకూడ స్థాపించబడుతుంది. కేంద్రమునకు రాష్ట్రములకుగాని, రాష్ట్రమునకురాష్ట్రమునకుగానిహక్కు-బాధ్యతలను నిర్వచించుట, నిర్వహించుటలో భేదాలు వస్తే ఒకరిఆవరణను మరియొకరు ఆక్రమిస్తే యీసుప్రీముకోర్టువారే చట్టమునుబట్టి ధర్మనిర్ణయం చేయాలి. ఆప్రకారం పార్టీలు బద్ధులగుదురు. సమాఖ్యవిధాన మనగా రాష్ట్రములు తమస్థానిక స్వపరిపాలనపుహక్కులకు భంగములేనిపద్ధతిని మొత్తం జాతీయావసరములు, క్షేమముకొరకై తమకున్న కొన్నిఅధికారములను వదలుకొని వానితో ఒక కేంద్రప్రభుత్వాన్ని నిర్మించేవిధానము. అనగా ఏకదేశంలో రాజ్యాధికారం అవిభాజ్యముగా ఒక్కసంస్థ చేతిలోనే ఉంటే సమాఖ్యలో యీరాజ్యాధికారం ముఖ్యంగా

సమాఖ్య, రాష్ట్రములనే రెండుసంస్థలమధ్య పంపకమవుతుంది.[1] అందుకనే సమాఖ్యవిధాన మనేసరికి నాలుగుఅంగాలు గోచరిస్తాయి. రాష్ట్రము, రాష్ట్రములిచ్చిన అధికారాలు ధరించి సమిష్టిగా బయలుదేరిన సమాఖ్యప్రభుత్వము, ఉభయులకుగల సంబాధబాధ్యతలు తెలిపేచట్టము, చట్టమును నిర్వచించే సుప్రీముకోర్టు. ఇంతేకాక సమాఖ్యవిధానంలో మరియొకవిషయ మున్నది. చట్టనిర్మాణకాలంలో అనుకోని క్రొత్తపరిపాలనాంశముయేదైనా పిమ్మట బయలుదేరితే దానిమీద యెవరిది అధికారం? ఇందునుగూర్చికూడా చట్టము స్పష్టపరచాలి. దీనినే 'రెసిజ్యుఅరీ' హక్కులంటారు.

తాను ఒకరికి హక్కుయివ్వడంగాని ఒకరివల్ల పొందడంగాని అనేదే లేక నియతంగా సిద్ధాంతంలో సర్వరాజ్యాధికారం తనచేతిలోనే వుంచుకొంటుంది గనుక ఏకదేశవిధానంలో యీలక్షణాలకు ప్రసక్తిలేదు.

## అధినివేశప్రతిపత్తి.

1907 సం॥రంలో జరిగిన బ్రిటీషు కాలనీలమహాసభలో దేశములోపల స్వపరిపాలనచేసుకొనే దేశాలకు "అధినివేశము" (Dominions) లని పేరుపెట్టబడి వానికిన్ని, సామ్రాజ్యము

---

1 రాజ్యాధికారమనేది అవిభాజ్యమని అనే 'రూసో' నాటిసిద్ధాంతాలు నమ్మి ప్రచారంచేసే పూర్వపక్షులు యిప్పుడున్న లేకపోలేదు. వీరు రాజ్యాధికారం విభాజ్యమైనది అనకుండానే సమాఖ్యసూత్రాన్ని సమర్థించవచ్చంటారు.

లోని యితర కాలనీలకున్న హోదాలో ప్రత్యేకతగలదని స్థిర పర్చబడింది. భారతదేశముకు యీసభలో స్థాన మివ్వబడ లేదు. పిమ్మట జరిగినసామ్రాజ్యసభలో బ్రిటిషుప్రధానమంత్రిఅధ్యక్షతక్రింద అధినివేశప్రధానులు సమావేశపర్చబడిరి. 1911 సం॥ మహాసభలో అధినివేశములకు సంబాధించిన విదేశవ్యవహారాల్లోనేగాక ఆలాసంబాధించని వ్యవహారాల్లోకూడా అధినివేశాలను సంప్రదించాలని నిర్ణయించబడింది. కాని యుద్ధము, సంధి విషయాల్లోమాత్రం బ్రిటిషుగవర్నమెంటుకు హక్కున్నది. సేన, నౌక, బ్రిటిషువారిదే గనుక యీహక్కు వారికి వదలినా నష్టం లేదనుకొన్నాయి అధినివేశాలు. ఐరోపాసంగ్రామంలో నిజంగా యీఅధినివేశాలు చేసినసహాయం భారతదేశం చేసిన దానికంటె చాలాతక్కువైనా ఎక్కువహోదాలు కోరినవి. 1917-18 సం॥రపు సామ్రాజ్యయుద్ధ మంత్రివర్గం పేరితో అధినివేశమంత్రులుకూడా యుద్ధమును, సంధిని, నడిపించుటలో పాల్గొన్నారు. పిమ్మట నానాజాతిసమితిలో అధినివేశములకు ప్రత్యేకప్రాతినిధ్య మివ్వబడి వాటిసభలకు సదరుఅధినివేశాలు తమప్రతినిధుల నెన్నుకోవడంకూడా తటస్థించింది. 1927 సం॥లో అధినివేశాని కొకప్రతినిధిచొప్పున ఉండాలని స్థిరపడింది. అటు పిమ్మట బ్రిటిషువారు చేసుకొనే సంధిపత్రాల్లో అధినివేశాలు నామకార్థంగా సంతకంపెట్టడమేకాకుండా వారివారి పార్లమెంటులలో యోచించుకొని మరీపెట్టాలన్నారు. ఆప్రకారం బ్రిటి

షువారు వీరిసంతకాలకోసమని ఆగిపోవలసివచ్చేది. 1920 సం॥లో 'వాషింగ్టను'లో కెనడా ప్రత్యేకప్రతినిధిని పెట్టుకొన్నది. పిమ్మట ఒక అధినివేశముకుసంబాధించినసంధిపత్రం రాజుగారితో కూడా ఆఅధినివేశమే సంతకం చెయ్యాలి; ఒకసంధిపత్రం తయారుచెయ్యడంలో సంబంధంలేని అధినివేశం సదరు సంధిని ఒప్పుకోవాలని నియమముండకూడదు. అని రెండుసూత్రాలను 1923-26 సం॥రం మహాసభలలో కెనడాపెట్టి ఒప్పించింది బ్రిటిషువారిచేత.

ఐర్లండు ఆఫ్రికాలు యీహోదాను యింకా పైకి తీసికెళ్లాయి. తనఅధినివేశప్రతిపత్తి బ్రిటిషువారి దానంవల్ల వచ్చిందికాదనిన్నీ, సమానహోదాతో జరిగినసంధివల్ల వచ్చిందిఅనాలనిన్నీ, ఆప్రకారం తాను ఒప్పుకొన్న హద్దులకులోబడి సర్వస్వతంత్రము తనకు కలదన్నది ఐర్లండు. ఆఫ్రికాపక్షాన్ని 'హెర్టుజాగ్'మంత్రి యింకోవిశేషం ప్రవేశపెట్టాడు. బ్రిటిషు సామ్రాజ్యం అనగా స్వతంత్రరాజ్యాధికారాలుగల (తాటస్థ్యము, రాజ్యము వదలుకొనుటసహా) రాష్ట్రాలసమావేశమనిన్నీ, ఆప్రకారం రాజత్వమనేది యెక్కడకక్కడ విభజింపబడింది అని అంగీకరించాలన్నాడు. 1926–30 లోగా జరిగినమహాసభలు యీసూత్రాలను ఒప్పుకోకపోయినా యివన్నీ సమాన హోదాగలవనిన్నీ; దేశవ్యవహారాల్లోను, విదేశవ్యవహారాల్లోను, ఒకరాష్ట్రం మరియొకదానికి యెంతమాత్రం లోబడి

యుండదనిన్నీ, యివన్నియు బ్రిటిషురాజుగారుమాత్రం తమ భక్తికి యేకైకపాత్రులుగా యెంచుకుంటూ 'బ్రిటిషు కామన్ వెల్తు'లో సమానహోదాగల సభ్యులుగా నుండాలనిన్నీ అంగీకరించారు. అప్పటినుంచీ విదేశవ్యవహారాల్లోకూడా అధినివేశాలు స్వతంత్రంగానే వ్యవహరించుకుంటున్నాయి. 1931 సం॥ 'వెస్టుమినిష్టరు'చట్టప్రకారం యీఅధినివేశములమీద బ్రిటిషువారికున్న అధికారలాంఛనాలుకూడా చాలవరకు పోయాయి. సామ్రాజ్యశాసనాలకు వ్యతిరేకంగా అధినివేశశాసనాలుండవచ్చును. వాటికి దేశంవెలుపలకూడా చలామణీకలదు. 1931 సం॥ తరువాత సామ్రాజ్యచట్టమేదిన్నీ వీరికి వర్తించదు. అధినివేశచట్టమును రద్దుచేయుటకు బ్రిటిషుపార్లమెంటుకు యిప్పుడుకూడా సిద్ధాంతాన్నిబట్టి హక్కుకలదని ప్రీవీకౌన్సిలు అన్నా అది సాధ్యముకాదు. ఐర్లండు కెనడాలనుంచి ప్రీవీకౌన్సిలుకు అప్పీలుహక్కులు, ఇంమునుగూర్చి రాజుగారి ప్రత్యేకఅధికారాలుకూడా తీసివేయబడ్డాయి. బ్రిటిషుపార్లమెంటువారు కెనడా రాజ్యాంగవిధానంలో మార్పుచేయడానికి హక్కున్నా, కెనడా రాష్ట్రి, సమాఖ్యప్రభుత్వాలు కోరితేనేగాని చేయకపోవడం సాంప్రదాయం. ఆస్ట్రేలియా న్యూజీలండులు 'వెస్టుమినిష్టరు' చట్టము తమకుకూడా వర్తిస్తుందని అంగీకరించనేలేదు. ఆఫ్రికా రాజ్యాంగవిధానంలో బ్రిటిషురాజుగారు తమచట్టాలను తిరస్కరించడానికే హక్కులేదన్నారు. ఐర్లండువిధానంలో యీఅంశ

మే చెప్పబడలేదు. ఆఫ్రికాలో రాజుగారి ప్రత్యేకాధికారాలకు సంబంధించిన విషయాల్లోతప్ప, ఆఫ్రికా ఐర్లండుదేశాల్లో వారి వారి పార్లమెంటువారు శాసనాలను రాజామోదానికి నిలిపి ఉంచాలనే అంశాన్నికూడా రద్దుచేశారు.

చివరకు సామ్రాజ్యంలోనుంచి విడిపోతామని మా పార్లమెంటుచేసినచట్టం 'Royal Executive functions and seals Act of 1934' క్రింద గవర్నరుజనరలు ఒప్పుకుంటే సరిపోదా? అన్నారు ఆఫ్రికావారు. కాని సామ్రాజ్యంలోనుంచి విడిపోవడమనేది ఒక్కరుచేసే చట్టంవల్ల సిద్ధంకాదనిన్నీ, unilateral Act: ఉభయాంగీకారంమీద జరుగవలసి ఉంటుందనిన్నీ మతభేదం కలదు. ఈప్రకారం అధినివేశప్రతిపత్తి అనగా బ్రిటిషురాజుగారికిమాత్రం వ్యక్తిపరంగా గౌరవార్థం భక్తినివదలకుండా సర్వవిషయాల్లోను సమానహోదాతోఉండే స్వతంత్రరాష్ట్రాలకలయికగా యిది క్రమేణ పరిణమించింది. నేటి ఐర్లండునాయకుడు ఇంకా పైకిపోయినాడు.

<u>క్యాబినెట్టుపద్ధతి</u>:—రాజ్యాంగములోని తరగతులకు సంబంధించినవి మొదటిరెండు. బ్రిటిషుకామన్‌వెల్తులోని అంగాంగీభావానికి సంబంధించినది మూడవది. ఈక్యాబినెట్టుపద్ధతి అనేది ప్రభుత్వంనడిపే తరహాలలో ఒకటి, లేక ప్రజాప్రతినిధులకు పరిపాలనలో ఎట్టిహోదాకలదో తెలిపేపద్ధతియిది. అధ్యక్షపద్ధతి, 'స్విస్సు' (Swiss) పద్ధతి, 'సోవియటు' శాసిస్టు

(Soviet and Fascist) పద్ధతులని మరికొన్ని రీతుల కార్య వర్గములు గలవు. అవియిక్కడ అనవసరము. క్యాబినెట్టుపద్ధతి ముఖ్యముగా బ్రిటిషుక్యాబినెట్టుపద్ధతి "అనగా శాసనవర్గంలోని క్రిందిసభలోగల మెజారిటీపార్టీనాయకుని రాజుగారు పిలిచి అతన్నియావత్తుపరిపాలనకు ప్రధానిగా ఉండమంటారు. తన సహకారులుగావుండే తోడిమంత్రులపేర్లు సూచించమంటారు. ఈప్రకారం ప్రధానమంత్రి నాయకత్వంక్రింద యేర్పడినమంత్రి వర్గం సమిష్టిగా శాసనసభకు బాధ్యత వహిస్తూ వారివిశ్వాసానికిలోబడి కార్యనిర్వాహకవర్గంగా పరిపాలనచేస్తారు. ఎప్పుడైనను శాసనసభవారు విశ్వాసరాహిత్యం పెట్టి వీరిని తొలగించవచ్చును. లేక తమకార్యక్రమానికి శాసనసభ అడ్డువస్తుందనిన్నీ, నియోజకవర్గంద్వారా శాసనసభవారిదే తప్పు, తమదే రైటు అనిపించుకోవాలనితోస్తే మంత్రివర్గమే రాజుగారిద్వారా శాసనసభను రద్దుచేయించి ఆప్రత్యేకసమస్యలమీద తిరిగి యెన్నికలు జరిగిస్తారు. ఒకప్పుడీయెన్నికలలో మెజారిటీపక్షము మైనారిటీకావచ్చును. అందుచేత క్యాబినెట్టువిధానం సిద్ధాంతములో రెండుపక్షములతో కూడుకొనిఉండును. ఒకపక్షం అధికారంలోవుంటే మరియొకపక్షం, వారికి వ్యతిరేకములోనుండి వారివిధానాన్ని విమర్శిస్తూ తమవిధానాన్ని సమర్థించుకొనుచుండును. ఎవరికార్యక్రమానికి ప్రజలలో అవలంబనం వస్తుందో వారు అధికారపక్షంగాను రెండవవారు వ్యతిరేక

పక్షంగాను నిరంతరం తారుమారు అవుతూవుంటారనిన్నీ, పోట్లాటపోరాటంవంటి యీపార్టీ కార్యక్రమసంఘర్షణలవల్ల దేశంలో అద్భుతమైన రాజకీయప్రబోధము, సంచలనము, శాంతికి భంగములేనిపద్ధతిని జరగడానికి అవకాశమున్నదనిన్నీ యీమతం వారినమ్మకం. కాని యీపక్షాలుఅనేవి, కులాలు, మతాలు, యింటిపేరు, మనిషిపేరును బట్టికాదు యేర్పడేవి. రాజకీయ, ఆర్థికసిద్ధాంతాలు దేశాన్నిబాగుజేసే నిర్మాణకార్యక్రమాలను బట్టి యీపక్షా లేర్పడాలి. వారివారి విధానప్రకారము దేశాన్ని సేవిస్తామనిన్నీ, తమన్ని అధికారంలోకి పంపించి అట్టి అవకాశం యిప్పించమన్నిన్నీ యెన్నికలమూలంగా యీపక్షాల వారు ప్రజల్ని ప్రార్థిస్తారు. ఇంతేకాకుండా వ్యతిరేకపక్షంవారు ప్రభుత్వములోవున్న పక్షంవారిని విమర్శించేటప్పుడు తమ బాధ్యతను గుర్తించాలి. ఈవిమర్శకులే మెజారిటీతో ప్రభుత్వము నాక్రమించే అవకాశ ముంటుందికనుక. తాను వ్యతిరేకపక్షములో ఉన్నప్పుడు భారతస్వరాజ్యముచుగూర్చి గ్రంథాలువ్రాసి బ్రిటిషుప్రభుత్వమును స్వరాజ్యం యివ్వకపోవడమునుగూర్చి ఖండించిన 'మార్గొనాల్డు' మంత్రిపదవికి రావడంతోనే తనూ ఆదారేత్రొక్కి వెనుకవ్రాతలు చూచుకొని సిగ్గుపడవలసి వచ్చింది.

ఈసిద్ధాంతాలు, సూత్రాలదృష్టిలో చట్టముయొక్క వైఖరిని ముందుగా కొంచెము విలోకిద్దాము. పిమ్మట చట్టము

యొక్క భాగోగులనుగూర్చి తెలుసుకోవచ్చును. ప్రజాబాధ్యతవహించే వేళాల్లో రాజ్యాధికారానికి మూలకందం ప్రజలు. అట్టివిధానమే ప్రజాస్వామ్యమంటారు. అట్టి ప్రజాస్వామ్యమును భారతదేశము పొందుటయే తమలక్ష్యమని బ్రిటిషువారు ప్రకటించుటయే గాక అట్టి ప్రజాస్వామ్యపరంగా వికసించే అవకాశాలు యీచట్టములో ఉన్నాయని పదేపదే అన్నారు. కాని యీచట్టములో యెక్కడచూచినా బాధ్యత అనేది గవర్నరు, గవర్నరుజనరలు, ఇండియామంత్రి, బ్రిటిషుమంత్రివర్గపరంగా కనిపిస్తున్నదిగాని ప్రజాపరంగా ఉన్నది అతిస్వల్పము. రాజ్యాధికారానికి మూలకందం (Fountain source of sovereignty) పార్లమెంటువారుకాని భారతప్రజలు ఎందులోనూ కారు. అందులకే చట్టములోని ఒక చుక్కనయినా పార్లమెంటువారుతప్ప భారతశాసనసభవారు ఎంతమాత్రము మార్చలేరు. చట్టప్రకారం రాష్ట్రములలో స్వపరిపాలనాధికారము యిచ్చినది నిజంగా ప్రజలకుగాదు గవర్నరులకు. కేంద్రములో కొంత బాధ్యతాయుతపాలనము దేశీయులకు వాపసుచేశామన్నారు. నిజంగా వాపసుచేసింది రాజప్రతినిధికి. అధినివేశప్రతిపత్తి అనే శబ్దము చట్టంలో ఉచ్చరించడానికే సాహసంలేనివారు కాలక్రమేణ భారతదేశం అధినివేశంగా పరిణమించుగాక యని ఆజ్ఞాపత్రంలో చాటున మాటున ఆశీర్వచనాలుచేశారు. కాని చట్టంలోఉన్న ప్రతిఅంశము అనధి

నివేశప్రతిపత్తికి దారిచూపుతోంది గాని వేరుకాదు.[1] ఒక విధంగా చూస్తే 1919 సం॥పు చట్టముకంటె 1935 సం॥పు చట్టము వెనక్కుపోయింది. 'మాంటుఫర్డు' సంస్కరణనివేదికలో 1930 సం॥రానికి సంపూర్ణ రాష్ట్రస్వతంత్రము, సామ్రాజ్యక్షేమానికి అవసరమైన కొన్నిరక్షణలకు మాత్రము లోబడి సంపూర్ణ కేంద్రబాధ్యత సూచింపబడినది. ప్రస్తుతచట్టప్రకారము 1930 కాకుకదా 1937 సం॥లో కూడా 1920 సం॥ పూర్వంకంటెకూడ వెనుకపడ్డ సంస్కరణాలు వచ్చాయి. కేంద్రబాధ్యత రాలేదు.

ఇక సమాఖ్యావిధానము ప్రవేశపెట్టామన్నారు. ఈసమాఖ్య యెవరిమధ్య? బ్రిటిషుసామ్రాజ్యాధిపత్యంలో ఉన్న రాష్ట్రములకున్నూ కేవలనిరంకుశప్రభువులైన సంస్థానాధిపతులకున్నూమధ్య. ఇక బ్రిటిషు రాష్ట్రప్రతినిధులు పేరునకైనా ప్రజాప్రతినిధులు. సంస్థానప్రతినిధులు కేవలం రాజని

---

1. 1911 సం॥ పిమ్మట సామ్రాజ్యసభలలో భారతప్రభుత్వానికి స్థానం ఇచ్చుట, యుద్ధపుమంత్రివర్గంలో స్థానం, నానాజాతిసమితిలో స్థానం ఇచ్చుట ఇల్లాంటి అధినివేశలక్షణాలు పట్టడానికొప్పుకొని, ఇప్పుడు డీవేలరా, హార్ట్జాగుగార్లచర్యలవలన అధినివేశమంటే "సంపూర్ణస్వతంత్రము" నే అర్థం వస్తుందని భయమేసి, ఆశబ్దం చట్టంలో ఉచ్చరించకుండా ప్రస్తుతం తప్పించుకున్నమాత్రాన యేదితప్పుతుంది? ఇదేమిరాజనీతి? అన్నాడు కైత్ పండితుడు. అచ్చే అందుకుకాదు. 1919 సం॥ చట్టంకంటె నూతనరాజనీతి ఇప్పుడేమి అవలంబించలేదు. అందుచేత నూతనప్రియాంబిలు అవసరంలేదని అడ్వొకేటుజనరలు సమర్థించాడు పార్లమెంటులో.

యామితులు. ఇట్టిసమాఖ్య అపూర్వమైనదే కాక అసామరస్య మైనది. ఇందువల్ల పూర్వం శాసనసభలలో ప్రభుత్వనామినేషన్ సభ్యులు అధికారవర్గానికిచేసే జోహారులు యికముందు యీసంస్థాన ప్రతినిధులవల్ల జరుగుతాయి. అంతేకాక యీనిరంకుశప్రభువులను భారతప్రజానాయకులు ఆశ్రయించవలసినగతి కూడ సంభవిస్తుంది. పోనీ యీసమాఖ్యఅయినా అన్ని సంస్థానాలపట్ల ఒకసూత్రముమీద యేర్పడుతుందా ? ఏసంస్థానము యేయేహక్కులను యెంతెంతవరకు అంగీకారపత్రం ప్రకారం సమాఖ్యకు వదులుతుందో అంతవరకే వారితో సమాఖ్య. మిగతా అంశాల్లో రాజుగారి పక్షమున రాజప్రతినిధికి వీరికి వ్యక్తిగతసంబంధము. ఎవరికి అర్థంగాని ఈపేంటు యెందుకు ?

ఇక సమాఖ్యశాసనసభలో సంస్థానప్రతినిధులకు బ్రిటిషుఇండియాప్రతినిధులకు అన్యోన్యము యేలా ఉంటుంది ? బ్రిటిషుఇండియాపరిపాలన అంశాల్లో సమాఖ్యప్రతినిధులు మాటాడరు. సంస్థానపరిపాలననుగూర్చి బ్రిటిషుఇండియా జోక్యము పుచ్చుకొనకూడదు. ఇది ఎప్పుడేనా, ఎక్కడేనా కుదురుతుందేమో యోచనీయము. రాజ్యాధికారములేని రాష్ట్రాలకున్నూ, స్వీయనిర్మితమైన సమాఖ్యకున్ను బ్రిటిషుపార్లమెంటువారు చేసినపంపకంప్రకారం గవర్నరు,గవర్నరుజనరలుమధ్య అధికారవిభాగము చేయబడినసమాఖ్యగాని యిది అమెరికా,

కెనడావంటి ప్రపంచదేశాల్లో సూత్రసమన్వయంగా మనంచూస్తూన్న సమాఖ్యకాదు.

ఇకక్యాబినెట్టుపద్ధతి పరిపాలనలో ప్రవేశపెట్టితిమన్నారు. చట్టంలో యెక్కడా యీ అంశము వ్రాయబడలేదు. చట్టములో వ్రాసినట్లయితే దానిప్రకారం ప్రజాప్రతినిధులు కోర్టుద్వారా అమలు జరిపించుటకు అవకాశంఉంటుంది. ఆజ్ఞాపత్రంలో యీఅంశము పొందుపర్చారు. ఈపత్రము కోర్టు ఎదుటికి వచ్చేదికాదు. అల్పసంఖ్యాకులకుకూడా మంత్రిత్వాలు ఉండాలనే మాటవలన క్యాబినెట్టుసిద్ధాంతముయొక్క విలువ తగ్గిపోయింది. మినహాయింపులు, రక్షణలతో చట్టమంతా నింపివేసిన బ్రిటిషురాజనీతిజ్ఞులు ప్రజాపక్షమునకు అవసరమైన యీ అంశాన్నిమాత్రము చట్టములో యెందుకు పొందుపర్చలేదు? పైగా యీమంత్రులను శాసనసభ్యులుకానివారినుండికూడ నియమించుటకు అవకాశము కలదు.

ఇకపైన తెలిపిన లక్ష్యార్థంప్రకారం క్యాబినెట్టుపద్ధతి ఇంగ్లండులోనే పనిచేయుటలేదు. ప్రపంచపు నేటిపరిస్థితుల కిది సరిపడదన్నమాట. ఇంతేకాక రాచకీయస్వతంత్రంలేని దేశాల్లో క్యాబినెట్టుపద్ధతి యెప్పుడూ కనలేదు. వినలేదు. పిల్లికి ఎలుకకుమధ్య ఒకపరిస్థితి నొకరంగీకరించే పూర్వపక్షసిద్ధాంతాలెల్లాకుదురుతాయి? దాస్యమునుండి విముక్తికై యత్నించే జాతికి, రాచకీయంలో మతసంఘాభిమానములు బాగా పోని

జాతికి, ఆర్థిక పునర్నిర్మాణం అత్యవసరంగా అపేక్షించేజాతికి పక్షభేదాలు, తద్గతమైన క్యాబినెట్టుపద్ధతి పనికిరాదు. మరింత చీలదీస్తుంది. రషియాలో ప్రస్తుతం ఒకవిధమైన పార్లమెంటరీ పద్ధతి వచ్చిందంటే అది రాచకీయస్వేచ్ఛకు అనంతరం అచ్చటి పరిస్థితులవలన యేర్పడింది. (ఇందునుగూర్చి ఇంకా తెలుసుకోవాలంటే 'చూ. మద్విరచితములైన రాజ్యాంగవివేకం-చరిత్రదీపిక, క్యాబినెట్టుపద్ధతి 'పనికిరాదు.' అనే గ్రంథాలు.)

అందుచేత ఈచట్టానికి పైనతెలిపిన శాస్త్రలక్షణాలుగాని రాజ్యాంగహోదాగాని పట్టలేదనుట సిద్ధం. ఇక భారతప్రజలకు రాజ్యాధికారం యిందువల్ల ఆవగింజంత అయినా వాపసు కాలేదు. స్వయంనిర్ణయసూత్రం మాటే లేదు. పోనీ రాజ్యాంగం సులభంగా బోధపడేదిగా ఉండాలి. దేశపు బీదరికమునుబట్టి అతిస్వల్పఖర్చుతో నడవాలి అని గాంధీగారు రౌండుటేబిలుసభలో చేసిన సూచనలకు ఏమైనా అవకాశమున్నదేమో చూదాము.

ఇందులకై చట్టాన్నిగూర్చి, విమర్శ కాకపోయినా విలోకనం అయినా కాస్త చేద్దాము. (చట్టవివరణం తెలుపుటలో ప్రాసంగికంగా తెలుపుతూవచ్చిన అంశాలను యిక్కడ కలుపుకోవాలి). ఇదివరలో తెలుపబడిన ఖరారునామానుబట్టి యీచట్టము యేడుసంవత్సరాలక్రింద రావలసినది. 'మింటో-మార్లే' సంస్కరణాలకున్ను, 1919 సంగరం చట్టానికిన్నీ 10

సంవత్సరాలు వ్యవధిమాత్రమే ఉంటే యిప్పుడు 17 సం॥లు అయినది. ఇదివరకు చట్టాల్లో యేమున్నా, లేకపోయినా, వాటిలోని అన్నిసెక్షనులు అమల్లోకి వచ్చేవి. ఈచట్టం వెనుక పుటల్లో తెలిపినట్లుగా పదిసంవత్సరాలు సిద్ధాంతరాద్ధాంతాలు జరిపి తయారుచేయబడినది. కాని యిందులోని 321 సెక్షనుల లోను 46-93 వరకు అనగా 47 సెక్షనులుమాత్రమే (రాష్ట్రస్వతంత్రమునకు సంబంధించినవి.) చట్టము నిర్మించబడిన రెండు సంవత్సరాలకు అమల్లోకి వస్తాయి. మిగతాభాగాలు సమాఖ్యవిధానమువగైరా సంస్థానాధిపతులలోని నియమితసంఖ్యాకుల అంగీకారము మీదగాని రావు. సమాఖ్య రాకపోయినా రాజుగారు సమాఖ్యన్యాయస్థానము, సమాఖ్యరైల్వే అధికారవర్గము, సమాఖ్య పబ్లికు సర్వీసు (సె 318), ముందుగానే స్థాపించవచ్చును.

ఒకపెద్దఖండంలాటిదేశం, భిన్నమతాలు, భిన్నక్షేమాలు గలదేశం. మీపట్లమాకుగల రక్షకబాధ్యత ననుసరించి మేము యెన్నిసంగతులు యోచించాలి? ఏడుసంవత్సరములు విచారణ ఒక ఆలస్యమా? అంటారు బ్రిటిషువారు. కాని యీదీర్ఘకాలంలో ఒకసబుకమిటీరిపోర్టుఅయినా సారాంశాన్ని తేల్చిందా? సమాఖ్యసబుకమిటీ,ఆర్థికం, సైనిక, అల్పసంఖ్యాకులుమొదలైన ఏసబుకమిటీరిపోర్టుఅయినాచూడండి. ఈకమిటీలు అన్నితంతే గాని అసలుగీటును తెరచాటునుండి యెవరో ఒక్కరే పెడుతు

న్నారు. చివరకు చట్టబద్ధమైందిఅదే. అసలుయిట్టివిచారణ అనేది బ్రిటిషువారు కల్పించుకున్నారుగాని ఎవరుకోరారు? జస్టీసు పక్షంకూడ కోరలేదు.

అసలు భారతీయులుకోరిన గమ్యములు స్పష్టముగానే ప్రతిపాదించబడినవి. కాంగ్రెసు వారు యిష్టము వచ్చినప్పుడు 'బ్రిటిషు కామన్ వెల్తు' లోనుంచి విడిపోవుటకు అవకాశముగల పూర్ణస్వరాజ్యము లక్ష్యముగాపెట్టుకుంటూ సేన విదేశవ్యవహారాల సహా భారతీయులపరముచేసే స్వపరిపాలనవెంటనే అములోకి రావాలన్నారు. అట్టివిధానం స్వయంనిర్ణయమునుబట్టి భారతీయులే యేర్పరుచుకోవాలన్నారు. తాత్కాలికంగా బ్రిటీషు భారతీయు లుభయుల అంగీకారంతోటి కొన్ని సర్దుబాట్లకు వీరికి అభ్యంతరము లేదు. ఇక మితవాదులు బ్రిటిషు కామన్ వెల్తులో నుంచి విడిపోని అధినివేశప్రతిపత్తిని గమ్యంగాపెట్టుకుంటూ దానిసిద్ధికి కాలనియామకంచేయుమనిన్నీ, యీలోగా కొన్నిరక్షణలమినహాతో విధానం తయారుకావాలన్నారు. భారతదేశంలో గల రాచకీయమతములు నిజంగా యీరెండే.

ఇంతస్పష్టంగా భారతీయగమ్యాలు కనిపిస్తూవుంటే పెద్దమనిషితరహాలో బ్రిటిషువారు ఒక్కటేచెప్పాలి. మీపార్టీలవారు కోరేవాటిలో యివియిస్తాము. ఇవియివ్వము లేక అసలే యివ్వము లేక యిచ్చినవికూడా కొన్నిగాని అన్నిగాని తీసివేస్తాము. అలాచేస్తే విషయము సులభమైపోవును. మాలాంటి

గ్రంథకర్తల కృతజ్ఞతకుకూడ పాత్రులయ్యేవారు. అలాకాకుండా చట్టములోని ప్రతిఅంశము సందిగ్ధము, అనుమానముతో కూడుకొని వుండడం యీచట్టముయొక్క ప్రత్యేకలక్షణంగా ఉంది. అందులకే చట్టములోని 321 సెక్షనులుచాలక రోజురోజూ కొన్నిలుఆర్డర్లు అంటూయిప్పటికి 30 వరకు తయారై యింకాతయారవుతున్నాయి. వీనిక్రిందనిబంధనలు యింకాశతసహస్రాలుంటాయి. హిరణ్యాక్షవరాలలాగ మెన్నిరక్షణలుపెట్టుకుంటున్నా యింకా తృప్తికలుగుటలేదు. ఓటరులంటే అనుమానం; శాసనసభ్యులంటే నమ్మకంలేదు; మంత్రులంటే చెప్పనక్కరలేదు. చట్టములోనిముఖ్యాతిక అంశాలు గవర్నరు, గవర్నరుజనరలుల స్వంతనిర్ణయము స్వంతవివేచనతో అనులుజరుగుతాయి. స్వంతనిర్ణయాలు, వివేచనల క్రింద వచ్చేఅంశాలను లెక్కపెట్టమొదలిడి, అలాలెక్కపెడితే చట్టమంతా తిరుగవ్రాయవలసివస్తుందని భయంతో మానుకున్నాము. ఈదృష్టిలోచట్టబద్ధము కాని పూర్వకాలపు 'నవాబుదర్బారు'అనే నిరంకుశపరిపాలనకున్నూ దీనికిన్నీ తేడాయేమి? ఇదినిబంధనాయుత (Constitutional) పరిపాలన మనిపించుకుంటుందా?

ఒకసభకంటె ఒకసభలోను, ఒకరిపోర్టుకంటె ఒకరిపోర్టులోను బిగింపులుమెక్కువైనవి. శ్వేతపత్రములో బీహారు, సంయుక్తపరగణాలలో ద్వితీయసభలు ఉండాలనిన్నీ పదిసంవత్సరములఅనంతరము వాటిని శాసనసభలు వద్దంటే తీసివేయమనిన్నీ

అన్నారు. కాని జా. పా. రిపోర్టు బొంబాయి, మదరాసులనుకూడా యిందులో కలిపింది. ద్వితీయసభను రద్దుచేసుకొనేహక్కు సంకుచితపర్చింది. ద్వితీయసభను 'లాస్కీ' వంటిరాజ్యాంగపండితులు నిరసించారు. ఉన్నదేశాల్లో అవి రద్దవుతున్నాయి. భారతీయులంతా వద్దన్నారు. కాని అవి రాకమానలేదు. గవర్నరుగారి అంగీకారము లేకుండా పోలీసునిబంధనలు మార్చకూడదనిన్నీ, గవర్నరుకు మంత్రుల కార్యదర్శులు (మంత్రులచర్యగూర్చి) తెలియజెప్తూ ఉండాలనిన్నీ, బ్రిటిషువస్తువులమీద భారత మంత్రులు దిగుమతీపన్నులు వేస్తే ఆపన్నులు బ్రిటిషువర్తకము పాడుచేయాలనే దురుద్దేశంతో వేయబడ్డాయని ఊహించి రద్దుపరచడానికి అవకాశము, రిజర్వుబ్యాంకుపై గవర్నరుజనరలుకు కొన్నిప్రత్యేకాధికారాలు-ఇవన్నీ జా. పా. రిపోర్టు క్రొత్తగా కల్పించినవి. ఈప్రకారమే చట్టమైనది.

సమాఖ్యశాసనవర్గంలో క్రిందిసభకు యిదివరలోనున్న సరాసరియెన్నిక తీసివేయబడినది. ఇది 15 సం॥నుంచి చక్కగా అమలుజరుపుచున్న విధానము. ప్రజాభీష్టము మాటఅటుంచిఎన్నికల విధానాలగురించి విచారించిన, లోథియన్ సంఘమువారు, ఇండియాప్రభుత్వమువారు, తనసాక్ష్యంలో యిండియామంత్రిగారుకూడా సరాసరియెన్నికవుండాలని సమర్థించారు. కాని చట్టములో భారతీయులమాట త్రోసిపుచ్చుటయేగాక యింతమంది అధికారుల మాటనుకూడ త్రోసిపుచ్చి పరోక్షపు యెన్నిక

పెట్టినందుచేత రంగా, నాగేశ్వరరావు, గిరివంటివాళ్లను ఎన్నుకోవ డానికి ప్రజలకు అవకాశాలు తక్కువ అవుతాయని తలపబడ వచ్చును.

సమాఖ్యాశాసనవర్గములోని పైసభకు పంచమప్రతినిధు లను రాష్ట్రశాసనవర్గములోని పంచమప్రతినిధులే యెన్నుకో వాలి. ఇది పూనాఒడంబడికకు విరుద్ధముకాదా? రాష్ట్రపు పైసభలలో గవర్నరు నామినేషనులు పోలేదు. (చూ. ఒకటవ అనుబంధం) ఇక క్రిందిసభకు నియోజకవర్గాలు చిన్నవిచేసి, ఏకస్థానముకలవిగా చేసియు రెండుస్థానాలచోట రెండుఓట్లు ఒక్కరికే యిచ్చేపద్ధతి పెట్టడంవల్ల దేశాభిమానులకంటె స్థాని కపు పెత్తనదారులకు అవకాశాలు వుండేలాగునను, ఒకపక్షంలో నే స్పర్థలు యేర్పడేలాగునను పరిస్థితులు కలిగినవి. మతనియోజక వర్గాలు, జాతినియోజకవర్గాలు, జాతీయవాదుల విజయావకా శాలను మరింత తగ్గించినాయి. కాని యీగండములనన్నీ దాటి కాంగ్రెసు యీయెన్నికలలో అఖండమెజారిటీలతో విజయం కాంచకుంటవలన కాలవాహిని కాంగ్రెసు కనుకూలముగా ఉన్నట్లు యెంచాలి.

<u>మినహాలు, రక్షణలు:</u>—గాంధీ-ఇర్విన్ సంధిప్రకారం ఇవి భారతదేశక్షేమాన్నిబట్టే యేర్పడాలని వున్నది. మేగ్డ నాల్డుమంత్రి "ఇట్టిమినహాలను భారతదేశ సంపూర్ణబాధ్యతా యుతపరిపాలనకు అడ్డురాకుండా వుంటా"యని ఖరారుచేశాడు.

కాని రెండవరౌండు టేబిలుసభకు గాంధీగారు వెళ్లేసరికే యివి ఉభయదేశాల క్షేమాలనుబట్టి నిర్ణయించాలని బ్రిటిషురాజనీతిజ్ఞులు అనడం మొదలుపెట్టారు. చివరకు జిన్నాగారు చెప్పినట్లుగా 100 కి 98 పాళ్లు మినహాలు, రక్షణలతో చట్టము తయారైంది.

సేన, విదేశవ్యవహారాలు మొదలైనవి మినహాయింపబడినవిషయాలు. వీటిలో శాసనసభలకు, మంత్రులకుకూడా యేమీప్రమేయం వుండదు. ఉద్యోగులనయినా శాసనసభలోని వారినుండి గవర్నరుజనరలు నియమించాలని చేయబడిన సూచనకూడ అంగీకరించబడలేదు. 1919 సం॥రం చట్టప్రకారం గవర్నరుజనరలు తనకార్యవర్గసమాలోచనంతో సేనాపరిపాలన చెయ్యాలి. స్వంతబాధ్యతతో దానిని పరిపాలించుట కవకాశమిచ్చిన 1935 సం॥రం చట్టం పూర్వచట్టాన్ని మెరుగనిపించింది. సైనికతరిఫీదు, సైనికోద్యోగీయులుగా భారతీయులనే నియమించుటలో అభివృద్ధికి అవకాశం లేకపోయినా, విపరీతమైన సేన ఖర్చు తగ్గించడానికి అవకాశము లేకపోయినా, సేనకు కావలసిన సరుకులు స్వదేశీవైనా కాని ఆఖర్చు యీదేశంలోనే పెట్టవలసిందని నిబంధించడానికైనా శాసనసభలకు, మంత్రులకు హక్కు లేదు. చివరకు యిండియామంత్రి ఈచట్టానికి అనంతరము ఒక ఉపన్యాసంలో "దూరదృష్టికలవాళ్లుకూడ చెప్పలేనంత కాలం వరకు" యీదేశంలోని విదేశవ్యవహారాల రక్షణ రాజప్రతినిధే

పరిపాలిస్తాడు; శాసనసభకు సంబంధము వుండదు. అది సామ్రాజ్యపార్లమెంటువారివద్దిలో నుంటాయి అన్నారు. (Vide cust lectures)

రక్షణలు:—1919 సంIIరం సంస్కరణప్రకారం భారతదేశానికి ఆర్థికంలో సంపూర్ణస్వాతంత్ర్యము యివ్వాలని, భారతీయుల ఆర్థికనీతిని వారిఅభివృద్ధిపరంగా నిర్ణయించుకోవాలని అంగీకరించబడినది. పిమ్మటయేర్పడిన External capital సంఘంవారుకూడా భారతీయపారిశ్రామిక ఉద్యమమునకు ప్రభుత్వము ప్రత్యేకప్రోత్సాహమొసంగవలెనని ప్రోత్సహించిరి. కాని యీచట్టములో "'భారతీయ' అనేశబ్దమును తీసివేసి 'భారతదేశంలో Domicile అయినవారు'" అని మార్చిరి. భారతదేశంలో Domicile అయినవారు సగముమంది యేవ్యాపారంలోవున్నా ఆవ్యాపారాలన్నిటికీ కేవల భారతీయ వ్యాపారాలతోపాటు సర్వరక్షణలు, సనుపాయాలు, ధనసహాయాలు, భారతప్రభుత్వము చేయువలసిందే. సీమసరుకులు వేటిపైనైనా దేశీయపరిశ్రమల ప్రోత్సాహముకొరకు మత్రులు దిగుమతిపన్నులు హెచ్చించినా "అదికో కార్పణ్యంతో చేశారు" అని గవర్నరుజనరలు, గవర్నర్లు రద్దుచేయవచ్చును. ఇప్పుడున్నపన్నులుకూడ ఈగ్లాస్గో, మాంఛెస్టరు వర్తకులు తగ్గించుకోవడానికి అవకాశమున్నది. ఈరక్షణలక్రింద సెక్షను 101 క్రింద భారతశాసనసభ, మంత్రులు, జరిపిన అంతర్జాతీయవర్తక

సంధులలో గవర్నరుజనరలు జోక్యంపుచ్చుకోవచ్చును. ఇల్లా వున్నది ఆర్థికస్వతంత్రం, పరిశ్రామికాభివృద్ధి. ఈచట్టమువచ్చిన తర్వాత లంకాషైరు, మాంచెస్టరువర్తకులు భారతదేశానికే తమకంపెనీలు మార్చివేయడానికి అభ్యంతరములేదు. అప్పుడు యీవున్నదిగుమతిపన్నులుకూడ వీరిమీదవుండవు సరిగదా, గ్లాస్గోబరులు తమమిల్లులకు యేకానొప్పారుపేరునో పెట్టి భారత ప్రభుత్వమువారి సర్వసహాయము పొందవచ్చును.

ఇంకొకవిషయం—ఇండియాప్రభుత్వంచేసిన స్టెర్లింగు ఋణము 600 కోట్లువరకు నున్నవి. దీనిమీద యీఆర్థికదుస్థితిలో 5% చొప్పున ఋణదాతలు సీమదేశంలో వడ్డీ అనుభవిస్తున్నారు. కాని భారతశాసనసభవారికి వీరిమీద “అధినివేశాలలోవలె” పన్నువసూలుచేయడానికి అధికారము ఉండదు. సీమదేశంలో ఆదాయపుపన్ను ఇచ్చేవారిమీద ఈదేశంలో వేయరాదు. పెన్షనులమీద ఆదాయపుపన్ను లేదు. పెన్షనుదారులపైన చావుపన్ను లేదు. బ్రిటిషుఓడల వర్తకులకు, భారత ఓడలవర్తకులకు మధ్య యెట్టిపక్షపాతం ప్రభుత్వం చూపకూడదు. ఈరక్షణలు కేవలము పారిశ్రామిక ఆర్థికంగానే కాదు. బ్రిటిషువారికి. ఏసీమడాక్టరును భారతప్రభుత్వము యిక్కడికి రాకూడదని అనడానికి వీలులేదు. అతనిపట్టాను ఆక్షేపించడానికి వీలులేదు. అంటే ప్రీవికౌన్సిలుజోక్యం పుచ్చుకుంటుంది. ఇలాగే సివిలుసర్వీసు వుద్యోగస్తులు. ఈచట్టమువచ్చినతర్వాత

ఫసీమదొరగారువద్దైరా వుద్యోగమయినా అవసరంలేక ఆయన్ని ప్రభుత్వం విడుదలచేస్తే ఆయనకు రూల్సుప్రకారం యివ్వవలసిన జీతభత్యాలు దేశీయుల శక్తిసామర్థ్యాలతో నిమిత్తం లేకుండా యిచ్చుకోవలసిందే. ఇంతేకాక యింకా అదనంగా అవసరమనితోస్తే ఇండియామంత్రిగారు యెక్కువ యివ్వవచ్చును. పూర్వపుఉద్యోగుల పెన్షనులు యథావిధిగా చెల్లవలసిందే. ఏసాలులోనైనా పన్నులుచెల్లకగాని, మరియేకారణంచేతగాని సొమ్ముచాలకపోతే యీమినహాయింపులకు, రక్షణలకు సంబంధించిన ఉద్యోగులజీతాలు, పెన్షనులు మాత్రము ఆగవు. అవి దేశంమీదమీద (ఋణంచేసిఅయినా) కట్టాలి. శాల్యావస్థలోని భారతవర్తకవ్యాపారాలను అభివృద్ధిని చేసుకోవడానికి ప్రభుత్వానికిప్పటిలాగే అవకాశాలు సున్న.

ఈచట్టప్రకారము జీతాలు, సేనవ్యయం మొదలైనవి తగ్గవుసరిగదా ఖర్చు యిప్పటికంటె హెచ్చుఅవుతుంది. పన్నులెక్కువ అవుతాయి. క్రొత్తరాష్ట్రాలు రెండువచ్చాయి. అవి తమఖర్చు తాము భరించలేనివి. పశ్చిమోత్తరరాష్ట్రముకు గవర్నరుజనరలు శాసనసభను లక్ష్యపెట్టకుండా ఇష్టంవచ్చినగ్రాంటు యివ్వవచ్చును. ఇవికాక అంతర్రాష్ట్రసంఘాలు, ఇరిగేషను సంఘాలు, రైల్వేఅధికారవర్గం, రైల్వేపంచాయితీ, రైల్వేరేట్లు సంఘాలు, బయలుదేరినవి. బర్మావిడిపోవుటవల్ల 3 కోట్లునష్టం. 11 రాష్ట్రములకు ఆర్థికపండితులంటూ నెలకు 4 వేలకు తక్కు

వకాని జీతముతో దిగుమతి అవుతారు. సమాఖ్యన్యాయస్థాన మంటూ ఒకటివచ్చింది. సర్వీసుకమీషనులు చాలబయలుదేరు తాయి. ఇదికాక ఆరురాష్ట్రాలలో ద్వితీయశాసన సభలు వచ్చాయి. క్రిందిశాసనసభ్యులు, మంత్రులసంఖ్య అధికంగా పెరిగింది. ప్రతిరాష్ట్రమునకు తనిఖీశాఖపుద్యోగులు పెరిగిరి. వీరిజీతములు, భత్యములు, హోదాలు మొదలైనవికూడా సీమపుద్యోగీయులంతకాకపోయినా కొంతవరకైనా పెరుగు తాయి. ఈక్రొత్తగాబయలుదేరిన కేంద్రశాఖలు, సంస్థలను బట్టి వందలకొలదివేలకొలది ఆఫీసర్లు, ఆఫీసులు పెరుగుతాయి. ఈఆర్థికదుస్థితిలో యీబీదభారతదేశం పూర్వంకంటె పెరిగిపో యిన యీవిపరీతవ్యయభారాన్ని యెల్లాభరిస్తుంది? పాతపన్ను లనిన్నీ, వారసత్వపుపన్నులనిన్నీ కొన్ని క్రొత్త పన్నులు చట్టంలోనే సృష్టించబడ్డాయి. ఈచట్టమే అమలుజరుగవలసిన చో కల్లుసారాయీలు ఆదాయము తగ్గ వీల్లేకుసరిగదా, అద నపుపన్నులుగూడ వేసినగాని ఇప్పుడు దేశములోగల ప్రజా సౌకర్యాలైనా నిలువవు. ఇటిస్థితిలో నూతనప్రాజెక్టులు, రేవు లు, కట్టడాలు, నిర్మాణాలు యెల్లాజరుగుతాయి? పన్నుభారం యెల్లాతగ్గుతుంది? రిజర్వుబ్యాంకుపైన ప్రత్యేకాధికారాలన్నీ గవర్నరుజనరలువి. నాణెములచలామణిని సరిచేయుట, ఇప్పటి వలెవెండిబంగారాలు బలంలేకుండా నోట్లుముద్రించుట, మారక కంరేటునుభారతవ్యాపారం కార్మికకర్షకక్షేమంకులనుకూలంగా

మార్చుటకును శాసనసభకు వీలులేదు. ఇక విద్యాభివృద్ధి, గ్రామాభివృద్ధిని యెల్లాయోచించగలం? కార్మిక, కర్షకుల ఋణతీర్మానముకు శాసనసభలకు స్వతంత్రంలేదు.

చట్టం 12 వ సెక్షనుప్రకారం గవర్నరుజనరలుయొక్క ప్రత్యేకబాధ్యతలంటే చేయుబడిన నిర్వచనంలోనే ఏకచ్ఛత్రాధిపత్యపుహక్కులన్నీ యివ్వబడ్డాయి. కాని అక్కడికి తృప్తికలుగలేదు. ఒకకార్యాన్నిగూర్చి ఒకప్పుడు శాసనసభవారుచేసేచర్య యింకొకప్పుడు పరోక్షంగానయినా తనప్రత్యేకబాధ్యతమీద వాల్తుందనే అనుమానము కలిగితే అట్టిచర్యలన్నీ ఆపేయడానికి హక్కుయిచ్చేసింది గవర్నరుజనరలుగారికి. (సె. 12-L.). ఈవిధంగా కేవల ఊహలు, అనుమానాలు కూడా ఒకచట్టంలో ప్రవేశించడం ఆశ్చర్యము.

నూతనరాష్ట్రనిర్మాణాన్నిగురించి శాసనసభకు నిజమైన స్వాతంత్రము లేదు. ఈచట్టంలోకూడ ల్యాండురివిన్యూ, రీసెటిలుమెంటువిధానాన్నిగూర్చి విచారించుటకు న్యాయస్థానాలకు అవకాశము లేదు. జిల్లాజడ్జీలు, జిల్లామునసబులను నియమించే హక్కు గవర్నరుకు క్రొత్తగా యివ్వబడడంచేత వారి స్వాతంత్రము అరికట్టబడవచ్చును. ఈనిబంధనలుకూడా పబ్లికుసర్వీసు కమీషనుతో యోచించినను గవర్నరులే చేస్తారు. స్త్రీలకు ఉద్యోగస్వాతంత్ర్యమున్న గవర్నరుజనరలు, గవర్నరులదయను సదా స్త్రీజాతికోరుతుంటేనేగాని సాధ్యపడదు.

పబ్లికుసర్వీసు విషయములో చేయుబడిన రక్షణలన్నీ ఆప్రకరణంలో తెలుపబడ్డాయి. వీటికి చట్టప్రకారం క్రొత్త రక్షణ ఒకటి అపూర్వమైనది చేయబడినది. సముద్దేశంతో చేశా రనికోర్టువారునెంచితే యెలాంటినేరమైనా ఉద్యోగస్థులమీద రద్దుచెయ్యాలి. సె 271 ప్రకారం ఉద్యోగస్థులకు యివ్వబడిన రక్షణలను సవరించే యేబిల్లునూ గవర్నరు, గవర్నరుజనరలు అంగీకారం కాకుండా శాసనసభలలో ప్రవేశం కాకూడదు. కాని "కారణం" తెలుపకుండా ఉద్యోగులనుభర్తరఫు చేయవ చ్చునని ఈచట్టంలో, ఈరోజుల్లో పెట్టడంయెందు చేతనో.

ఆజ్ఞాపత్రముకు వ్యతిరేకంగా నిబంధనలుచేసినా గవర్నరు జనరలును, గవర్నరును అడిగేవారులేరు. చట్టప్రకారం తనకు స్వతంత్రంలేనిస్థలాలు బహుకొద్దిగా ఉంటాయి. అక్కడకూడ స్వతంత్రముగావర్తిస్తే కోర్టులు నిరోధించగలవా ? అట్టిఅవకా శమున్నా మామీదచర్య తీసుకోవద్దని గవర్నరుజనరలు ఆజ్ఞా పిస్తే కోర్టువారుచర్యను నిలుపుచేసుకోవాలి.

ఈచట్టానికి అధినివేశపరంగా తనంతటతాను వికసించే శక్తి ఉందన్నారు. అంటే యికముందు సైమన్‌కమిషన్‌లాంటి విచారణ లుండకపోవచ్చును. విదేశవ్యవహారాల్లో మునిగిపో యిన బ్రిటిషుపార్లమెంటులోకూడ హిందూదేశవ్యవహారాల పట్ల యిప్పుడున్నంతశ్రద్ధఅయినా యికముందు ఉండదు. అందు కనే కౌన్సిలు ఆర్డరు అనే పేరుతో హిందూదేశరాజ్యాంగవిధా నము విశాలపరచటం గాని, సంకుచితపరచటంగాని బ్రిటిషు

మంత్రివర్గంవారు జరిగిస్తారు. రాష్ట్రస్వతంత్రము సమాఖ్యకు మధ్యకాలంలో తాత్కాలికంగా రాజుగారు చట్టములోని కొన్ని అంశాలను రద్దుపరచుటకును సమాఖ్యకు పుష్కలంగా ధనం చిక్కేయేర్పాటులు వగైరా చేయుటకు హక్కుంది.

నిజమే! ప్రత్యేక బాధ్యతను నిర్వచించుటలో భారతబ్రిటిషు దేశముల సంబంధము భాగస్వామిత్వమని జ్ఞాపకముంచుకో. ఆర్థికమంత్రికి సమాఖ్యమంత్రివర్గముకు సైనికవిషయాలతో పరిచయముండాలి. అల్పసంఖ్యాకులు అనగా అయిన వాళ్లు కాని వాళ్లుకారు. స్వంతవివేచనఉపయోగించుటలో గవర్నరు, గవర్నరుజనరలులు, మంత్రివర్గాలు తమ బాధ్యతను మరచేటట్లుచేయకూడదు. భాగస్వామిత్వమనేది మూఅధివేశాలతో భారతదేశము అర్థస్థానము పొందునట్లుగా వృద్ధిపొందాలి. (చూడు ఆజ్ఞాపత్రము 14, 19, 11, 9, 31) అని గవర్నరు, గవర్నరుజనరలులకు చల్లటిమాటలతో రాజుగారు సూచనలు చేశారు. చట్టముచదివితే భారతీయులకు కలిగేవేడిని శమింపజేయుటకాయీ వాక్యాలు? ఆలాఅయితే చట్టంలోనే వీటిని ఎందుకుప్రతిపాదించకూడదు? 'లా' ప్రకారము భారతీయులకు ఎట్టిహక్కులు లేవు. కాని వినయవిధేయతతో మెలగినట్లయితే కొద్దో గొప్పో గవర్నరు, గవర్నరుజనరలులదయాధర్మమునకు పాత్రులయ్యేటట్లుగా చూస్తారు అన్నట్లుంది. అందులకే కోర్టులకు నిర్వచనాధికారంలేని ఆజ్ఞాపత్రంలో యీముక్కలు వేయడం తటస్థించింది.

బ్రిటిషురాజనీతిజ్ఞులు యింకొకవిధంగా చట్టాన్ని సమర్థిస్తారు. ఎన్నిమినహాయింపులుంటే మీకెందుకు ? ఎన్నిరక్షణలుంటే మీకెందుకు ? గవర్నరు గవర్నరుజనరలులకు శాంతి సమయాల్లోకూడ చట్టాన్ని అంతా ఒకమూలపెట్టి స్వంతవివేచన స్వంతనిర్ణయంతో యావత్తుఅధికారం చలాయించే హక్కు ఉంటేమాత్రం మీకు సంశయం ఎందుకు ? మీరుమాత్రం అకుంఠితమైన భక్తివిశ్వాసాలతో మాగవర్నరు గవర్నజనరలులను సమీపించి 'అడియందాసోహం' అనండి. సహకారం చేయండి. జ్ఞానయోగం వదలి 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అని మమ్మ్మలనే శరణుజొచ్చే ప్రపత్తిమార్గంలోకి రండి. ఇందులో ఒక్కటయినా మిమ్మల్నికుట్టదు. అభురుకు అంటదు. ఇవన్నీ క్రొత్తపద్ధతి, మేము ప్రవేశపెట్టుచున్నప్పుడు కాస్తజాగ్రత్తకొరకు పెట్టుకున్నాము. అందులో మీదేశక్షేమంపట్ల మాకు దైవదత్తమయిన బాధ్యతఉన్నది. ఒక్కమాటు ఏలావదులుతాము? వదలితే మీరు చెల్లాచెదరయిపోరా? అందులో మీలో అల్పసంఖ్యాకులగతి యేమికావాలి? అని అంటారు. ఇది మొదట్లో మోహసంజనకమైనా కొంచెము ఆలోచిస్తే, ఉభయపక్షాల పూర్వచరిత్రను తిలకిస్తే, చరిత్ర దృష్టితో విమర్శిస్తే యిందలి సత్యం ఎక్కడా అందడంలేదు. బంధనం లక్ష్యంకాకపోతే గూట్లోకి ఎందుకు పిలవాలి ఈగను సాలీడు? సమానహోదాతో స్వేచ్ఛావాతావరణంలో ఎందుకు చేతులుకలుపుకోకూడ

చు? ఇప్పటికిదిచాలును. ఇందలిసత్యం ఋజువుకుడే భవిష్యత్తు అతిదగ్గరలో ఉందిగనుక. మనిషిని నమ్మకుండా మంత్రిత్వము చేయిస్తారు చూడమంటున్న దీచట్టము.

అయితే యీచట్టంలో మంచి చేయిలేదా? అని కూడా చూద్దాము. 3 కోట్ల 60 లక్షల స్త్రీ పురుషులవద్దకు స్వాతంత్ర్యసందేశం, స్వీయదాస్యమును, దుస్థితిని తెలుపుకు చేసేజ్ఞానం తీసుకువెళ్ళడానికి అఖండావకాశం ఇచ్చింది. పూర్వపునిరంకుశ రివిన్యూవిధానం సడలింది. రైత్వారీభూమిపన్నువిధానంపైన శాసనసభకు పెత్తనంఉంటుంది. కాని యీపెత్తనం హెచ్చించుకోవడానికే ఉపయోగపడవలసివస్తుందేమో! రివిన్యూవిచారణావిధానాన్నికూడ శాసనసభవారే నిర్ణయించవచ్చును అనగా సెటిలుమెంటు వగైరాలకు కూడ ఇది వర్తిస్తుంది. విదేశములలోని భారతీయుల క్షేమాలను కాపాడుటకు శాసనసభలకు, కొంత అవకాశములు కలిగినవి. భారతన్యాయస్థానాలపైన ప్రీవికౌన్సిలు అప్పీళ్ళను సమాఖ్యశాసనంవల్ల తగ్గించుకోవచ్చును. జమీందారీపద్ధతి సవరించుటకు బిల్లులు ప్రవేశపెట్టి చర్చ లేవదీసే అవకాశము కూడ ఉంది. కౌన్సిలు ఆర్డరుప్రకారం అల్లాంటివి గవర్నరుజనరలుకు గవర్నరు పంపిస్తాడు. అక్కడ యెల్లాగో తిరస్కరిస్తాడు.

ఇంకా కొంచెము ఉన్నతపథంలో యీసమస్యను చూదాము. అసలు వాస్తవదృక్పథం యిదే. భారతదేశానికి

బ్రిటనుకు జరుగుచున్న సంఘర్షణ నిజంగా భౌతికపథంలో కాదు. నైతికపథంలోది. మానవునకేకాక ప్రతిజీవికిన్ని స్వతస్సిద్ధమైన— ఆపరాత్పరదత్తమైనది అనండి—స్వేచ్ఛాస్వాతంత్రాలతో భారతస్వరాజ్య సమస్యను వీక్షిస్తానంటుంది కాంగ్రెసు. నీఒళ్లంతా బంగారంచేస్తాను. కాని నాయిష్టంలేకుండా మేడమెట్లైనా దిగ కూడదంటుంది బ్రిటను, అత్తగారిలాగ. బ్రిటిషు రాజనీతిజ్ఞుల ఇల్లాంటిమాటలు ఎంతనిజమైనా అందుకు భారతదేశం ఒడబడిందా స్వధర్మంలోనుంచి జారిందన్నమాటే! నల్లపూసంత పురుగునకుకూడ తనగతిని తానే నిర్ణయించుకొనే స్వేచ్ఛ ఉండడం సృష్టిలో చూస్తున్నాము. ఈస్వేచ్ఛ నుపయోగించుటలో అది అనేకతప్పులు చేస్తుంది. ఆకారణంవల్ల దానిస్వేచ్ఛ అరికట్టబడడం అస్వాభావికం. అల్లాచేస్తే దానికి స్వీయవికాసావకాశమేపోతుంది. అల్లాగే "స్వరాజ్యమనగా వ్యక్తికి సహజముగాఉన్న తప్పులుచేసే హక్కును సంపాదించుటయే." ఒకవేళ సేన, విదేశవ్యవహారాదులలో నేడు భారతీయులకు తగిన సమర్థతలేదంటే ఒకసారీడుకున్న స్వేచ్ఛకూడ ఈవిధానంలో దేశీయులకు లేకపోవడంవల్లనే "నామంచిచెడ్డలకు నేనే కర్తను" అనుటలోగల భావానందం, ఆత్మవిశ్వాసం, పర పరిపాలనంలో అదెంతమంచిదైనా కలుగదు. అందులకే పరపాలనలో జాతియొక్క కార్యప్రారంభకశక్తులు, మేధాశక్తులు వికసించవు. అందుకే సుపరిపాలనముకంటేస్వపరిపాలనంకాదన్నారు పారదర్శులు.

---

ఈ గ్రంథములో ఉపయోగించబడిన కొన్ని

## పారిభాషికపదాలు.

Individual discretion = స్వంతవివేచన

Individual Judgment = స్వంతనిర్ణయం.

Reciduary powers = సమాఖ్యకు, రాష్ట్రముకు పంపకం సమయంలో అనుకోని నిలువఅధికారాలు.

Legislature = శాసనవర్గం.

Summon = సమావేశపరచుట.

Prorogue = సమాప్తిచేయుట.

Dissolve = రద్దుచేయుట లేక ఉపసంహరించుట.

Budget
Financial statement } ఆదాయవ్యయపత్రిక లేక జమాఖర్చు.

Bill = బిల్లు.

Act = { శాసనం = ఉభయసభలుఅంగీకరించి గవర్నరు ఆమోదానికి పెట్టబడినది.
చట్టం = గవర్నరువగైరాలు ఆమోదించినది.

Address = ఉద్బోధనముచేయుట.

Message = సందేశము.

Safe guards = రక్షణలు.

Reservations = మినహాయింపులు.

Special responsibilities = ప్రత్యేకబాధ్యతలు.

Instrument of Instructions = ఆజ్ఞాపత్రం.

Instrument of Accession = అంగీకారపత్రం.

Executive = కార్యవర్గం; అనగా గవర్నరు లేక గవర్నరు జనరలు ఆధిపత్యమున మంత్రుల సముదాయం.

Executive authority = కార్యనిర్వహణాధికారం.

Administrative authority = పరిపాలనాధికారం.

Subvention } = సహాయం- ద్రవ్యరూపంగాకూడ ఉండ
Subsidy } వచ్చును.

Functions = కార్యములు.

Original Jurisdiction = ప్రథమవిచారణాధికారం.

Source of revenue = ఆదాయనిలయం.

Surcharge = అదనపుపన్ను రేటు.

Broad-casting = వార్తాప్రసారం.

Law point = న్యాయాంశము.

Fact = జరిగినసంగతి.

Deed = పట్టా.

Document = దస్తావేజు.

Unitary system = యేకదేశవిధానం.

Federal system = సమాఖ్యవిధానం.

పరా:—ఈశబ్దాలు అర్థప్రధానంగా ఉపయోగించబడినవి. ప్రమాణశుద్ధి కలుగలేదనితోచిన పదాలను (ముఖ్యంగా 3 వ అనుబంధము లోవి) ఈ జాపితాలో చేర్చలేదు.

1 వ అనుబంధము.

## రాష్ట్ర లెజిస్లేటివు కౌన్సిల్ స్థానాలు

| 1<br>రాష్ట్రము | 2<br>మొత్తము స్థానాలు | 3<br>సాధారణ స్థానాలు | 4<br>మహమ్మదీయ స్థానాలు | 5<br>యూరోపియన్ స్థానాలు | 6<br>ఇండియన్ క్రైస్తవ స్థానాలు | 7<br>లెజిస్లేటివు అసెంబ్లీ పూర్తిచేయవలసిన స్థానాలు | 8<br>గవర్నరు పూర్తిచేయవలసిన స్థానాలు |
|---|---|---|---|---|---|---|---|
| మదరాసు | 54కు తక్కువ కాకుండా<br>56కు ఎక్కువ కాకుండా | 35 | 7 | 1 | 3 | — | 8కి తక్కువ కాకుండా<br>10కి ఎక్కువ కాకుండా |
| బొంబాయి | 29కి తక్కువ కాకుండా<br>30కి ఎక్కువ కాకుండా | 20 | 5 | 1 | — | — | 3కి తక్కువ కాకుండా<br>4కి ఎక్కువ కాకుండా |
| బెంగాలు | 63కు తక్కువ కాకుండా<br>65కు ఎక్కువ కాకుండా | 10 | 17 | 3 | — | 27 | 6కు తక్కువ కాకుండా<br>8కి ఎక్కువ కాకుండా |
| సంయుక్తరాష్ట్రాలు | 58కి తక్కువ కాకుండా<br>60కి ఎక్కువ కాకుండా | 34 | 17 | 1 | — | — | 6కు తక్కువ కాకుండా<br>8కి ఎక్కువ కాకుండా |
| బీహారు | 29కి తక్కువ కాకుండా<br>30కి ఎక్కువ కాకుండా | 9 | 4 | 1 | — | 12 | 3కి తక్కువ కాకుండా<br>4కి ఎక్కువ కాకుండా |
| అస్సాము | 21కి తక్కువ కాకుండా<br>22కి ఎక్కువ కాకుండా | 10 | 6 | 2 | — | — | 3కి తక్కువ కాకుండా<br>4కి ఎక్కువ కాకుండా |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
|---|---|---|---|---|---|---|---|---|
| | | సాధారణ స్థానాలు. | | | | | | |
| రాష్ట్రము. | మొత్తం స్థానాలు. | మొత్తం సాధారణ స్థానాలు. | నిమ్నజాతులకొరకు ప్రత్యేక ఉంచబడిన సాధారణ స్థానాలు. | వెనకబడ్డజాతులయొక్కయు కొండల యొక్కయు ప్రతినిధుల స్థానాలు. | సిక్కుల స్థానాలు. | మహమ్మదీయుల స్థానాలు. | ఆంగ్లోయిండియను స్థానాలు. | యూరోపియను స్థానాలు. |
| మదరాసు | 215 | 146 | 30 | 1 | — | 28 | 2 | 3 |
| బొంబాయి | 175 | 114 | 15 | 1 | — | 29 | 2 | 3 |
| బెంగాలు | 250 | 78 | 30 | — | — | 117 | 3 | 11 |
| సంయుక్త రాష్ట్రాలు | 228 | 140 | 20 | — | — | 64 | 1 | 2 |
| పంజాబు | 175 | 42 | 8 | — | 31 | 84 | 1 | 1 |
| బీహారు | 152 | 86 | 15 | 7 | — | 39 | 1 | 2 |
| మధ్యరాష్ట్రములునుబీరారు | 112 | 84 | 20 | 1 | — | 14 | 1 | 1 |
| అస్సాము | 108 | 47 | 7 | 9 | — | 34 | — | 1 |
| వాయవ్యసరిహద్దురాష్ట్రం | 50 | 9 | — | — | 3 | 36 | — | — |
| ఒరిస్సా | 60 | 44 | 6 | 5 | — | 4 | — | — |
| సింధు | 60 | 18 | — | — | — | 33 | — | 2 |

బొంబాయిలో 7 సాధారణస్థానములు మహారాష్ట్రులకొరకు
పంజాబులో భూస్వాములస్థానములలో నొకటి ఒక 'తుమా
అస్సాము, ఒరిస్సాలలో. స్త్రీలకు ప్రత్యేకింపబడిన స్థానములు

| 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | స్త్రీల స్థానాలు. | | | | |
| హైందవ క్రైస్తవస్థానాలు. | వర్తకం, పరిశ్రమలు, గనులు, మొక్కలు నాటుట వీటి ప్రతినిధుల స్థానాలు. | భూస్వాముల స్థానాలు. | విశ్వవిద్యాలయస్థానాలు. | కార్మికప్రతినిధుల స్థానాలు. | సాధారణ. | సిక్కు. | మహమ్మదీయ. | ఆంగ్లో హైందవ. | హైందవ క్రైస్తవ. |
| 8 | 6 | 6 | 1 | 6 | 6 | — | 1 | — | 1 |
| 3 | 7 | 2 | 1 | 7 | — | — | 1 | — | — |
| 2 | 19 | 5 | 2 | 8 | 2 | — | 2 | 1 | — |
| 2 | 3 | 6 | 1 | 3 | 4 | — | 2 | — | — |
| 2 | 1 | 5 | 1 | 8 | 1 | 1 | 2 | — | — |
| 1 | 4 | 4 | 1 | 3 | 3 | — | 1 | — | — |
| — | 2 | 3 | 1 | 2 | 3 | — | — | — | — |
| 1 | 11 | — | — | 4 | 1 | — | — | — | — |
| — | — | 2 | — | — | — | — | — | — | — |
| 1 | 1 | 2 | — | 1 | — | — | — | — | — |
| — | 2 | 2 | — | 1 | — | — | 1 | — | — |

ప్రత్యేకించవలెను.
న్దారు'చే పూర్తిచేయబడవలెను.
జాతిభేదములేనివిగా నుండవలెను.

## అనుబంధము—2.

### స్టేటుకౌన్సిలుసభలో బ్రిటిషుఇండియాప్రతినిధులస్థానాలు.

| 1<br>రాష్ట్రము<br>లేక<br>కమ్యూనిటీ | 2<br>మొత్తం<br>స్థానా<br>లు | 3<br>సాధారణ<br>స్థా<br>నాలు | 4<br>షెడ్యూల్డు<br>జాతుల<br>స్థానాలు | 5<br>సిక్కు<br>లస్థానా<br>లు | 6<br>మహమ్మ<br>దీయస్థా<br>నాలు | 7<br>స్త్రీల<br>స్థానా<br>లు |
|---|---|---|---|---|---|---|
| మదరాసు | 20 | 14 | 1 | — | 4 | 1 |
| బొంబాయి | 16 | 10 | 1 | — | 4 | 1 |
| బెంగాలు | 20 | 8 | 1 | — | 10 | 1 |
| సంయుక్తరాష్ట్రాలు | 20 | 11 | 1 | — | 7 | 1 |
| పంజాబు | 16 | 3 | — | 4 | 8 | 1 |
| బీహారు | 16 | 10 | 1 | — | 4 | 1 |
| మధ్యరాష్ట్రములు, బీరారు | 8 | 6 | 1 | — | 1 | — |
| అస్సాము | 5 | 3 | — | — | 2 | — |
| వాయవ్యసరిహద్దురాష్ట్రం | 5 | 1 | — | — | 4 | — |
| ఒరిస్సా | 5 | 4 | — | — | 1 | — |
| సింధు | 5 | 2 | — | — | 3 | — |
| బ్రిటిషు బెలూచిస్థానం | 1 | — | — | — | 1 | — |
| ఢిల్లీ | 1 | 1 | — | — | — | — |
| అజ్మీరు-మార్వారా | 1 | 1 | — | — | — | — |
| కూర్గు | 1 | 1 | — | — | — | — |
| ఆంగ్లోహైందవులు | 1 | — | — | — | — | — |
| యూరోపియనులు | 7 | — | — | — | — | — |
| హైందవక్రైస్తవులు | 2 | — | — | — | — | — |
| మొత్తం | 150 | 75 | 6 | 4 | 49 | 6 |

## ఫెడరల్ అసెంబ్లీకి బ్రిటిషు ఇండియా

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| | | సాధారణ స్థానాలు. | |
| రాష్ట్రము. | మొత్తం స్థానాలు. | మొత్తం సాధారణ స్థానాలు. | షెడ్యూల్డు కులాలకై ఉంచబడిన సాధారణ స్థానాలు. |
| మదరాసు ... ... | 37 | 19 | 4 |
| బొంబాయి ... ... | 30 | 13 | 2 |
| బెంగాలు ... ... | 37 | 10 | 3 |
| సంయుక్తరాష్ట్రాలు ... ... | 37 | 19 | 3 |
| పంజాబు ... ... | 30 | 6 | 1 |
| బీహారు ... ... | 30 | 16 | 2 |
| మధ్యరాష్ట్రములు, బీరారు ... | 15 | 9 | 2 |
| అస్సాము ... ... | 10 | 4 | 1 |
| వాయవ్యసరిహద్దురాష్ట్రం ... | 5 | 1 | — |
| ఒరిస్సా ... ... | 5 | 4 | 1 |
| సింధు ... ... | 5 | 1 | — |
| బ్రిటిషు బెలూచిస్థానం ... ... | 1 | — | — |
| ఢిల్లీ ... ... | 2 | 1 | — |
| అజ్మీరు- మార్వారా ... ... | 1 | 1 | — |
| కూర్గు ... ... | 1 | 1 | — |
| రాష్ట్రసంబంధములేని స్థానాలు. ... | 4 | — | — |
| మొత్తములు. ... | 250 | 105 | 19 |

ప్రతినిధుల స్థానాలు.

| 5 సిక్కు స్థానాలు. | 6 మహమ్మదీయ స్థానాలు. | 7 ఆంగ్లో హైందవ స్థానాలు. | 8 యూరోపియన్ స్థానాలు. | 9 హైందవ క్రైస్తవ స్థానాలు. | 10 వర్తకం, పరిశ్రమలు వీటి ప్రతినిధుల స్థానాలు. | 11 భూస్వాముల స్థానాలు. | 12 కార్మిక ప్రతినిధుల స్థానాలు. | 13 స్త్రీల స్థానాలు |
|---|---|---|---|---|---|---|---|---|
| — | 8 | 1 | 1 | 2 | 2 | 1 | 1 | 2 |
| — | 6 | 1 | 1 | 1 | 3 | 1 | 2 | 2 |
| — | 17 | 1 | 1 | 1 | 3 | 1 | 2 | 1 |
| — | 12 | 1 | 1 | 1 | — | 1 | 1 | 1 |
| 6 | 14 | — | 1 | 1 | — | 1 | — | 1 |
| — | 9 | — | 1 | 1 | — | 1 | 1 | 1 |
| — | 3 | — | — | — | — | 1 | 1 | 1 |
| — | 3 | — | 1 | 1 | — | — | 1 | — |
| — | 4 | — | — | — | — | — | — | — |
| — | 1 | — | — | — | — | — | — | — |
| — | 3 | — | 1 | — | — | — | — | — |
| — | 1 | — | — | — | — | — | — | — |
| — | 1 | — | — | — | — | — | — | — |
| — | — | — | — | — | — | — | — | — |
| — | — | — | — | — | — | — | — | — |
| — | — | — | — | — | 3 | — | 1 | — |
| 6 | 82 | 4 | 8 | 8 | 11 | 7 | 10 | 9 |

# 3 వ అనుబంధము.

## ౧

## సమాఖ్యాశాసనవర్గంవారి అధికారములోని అంశాలు.

## (Federal legislative list).

(1) భారతదేశపు 'ఎస్టాబ్లిషుమెంటు'పైన వసుస్తూఉన్న రాజుగారి నౌకా, సైనిక, వైమానికదళాలున్ను, వారిచేత యీదేశంలో నిర్మించబడ్డ తదితరమైన సాయుధదళములున్ను (ఇందు సంస్థాన, రాష్ట్రములలో పనిజేయుటకు యేర్పడినదళములు చేరవు;) రాజుగారిదళములు కాకపోయినను రాజుగారి సదరుదళములతో చేరినట్టిగాని, లేక వాటితోకలిసి పనిచేయుచున్నట్టిగాని యితరదళములు; కేంద్రవార్తాసంఘము; రక్షణ, విదేశవ్యాపారాలు లేక రాజగారికిన్ని సంస్థానములకున్ను గలసంబంధాలు నిర్వహించుటలో రాచకీయకారణాలను బట్టి వ్యక్తులను ముందుకు సాగనీయకుండా నిలుపుదలచేయుట; (2) సైనిక, నౌకా, వైమానిక సంబంధమైన కట్టడాలు; సైనికులు నివసించే ప్రదేశాల్లోస్థానికపరిపాలన (సంస్థానదళాలుండేచోటుకు యిదివర్తించదు); అట్టిస్థలాల్లో గృహనిర్మాణసౌకర్యాలు; సదరుసైనికనివాసస్థలాల పరిమితి నేర్పాటుచేయుట; (3) విదేశవ్యవహారాలు; ఇతరదేశాలతో జరిగే సంధులు, ఒడంబడికలు పూర్తిచేయుట; నేరస్థులను యీదేశంలోను, దేశం వెలుపలఆధినివేశములలోను ఆయాఅధికారులకు అప్పజెప్పుట; (4) క్రైస్తవమతవ్యాపారాలు, సమాధులసహా; (5) నాణెములు, వాటిని తయారుచేయుటవగైరా; (6) సమాఖ్యవారిఋణం; (7) పోస్టులు, టెలిగ్రాములు (టెల్లిఫోనులు, వైర్లెసు, వార్తాప్రసారము మొదలైనవిసహా); (8) సమాఖ్యవారి పబ్లికుసర్వీసు కమిషను, సర్వీసులు; (9) సమాఖ్య ఆదాయములోనుంచి యిచ్చేసమాఖ్యఉద్యోగాల పెన్షనులు; (10) సమాఖ్యావసరాలనిమిత్తం రాజుగారి స్వాధీనంలో ఉన్నట్టిగాని, ఉంచబడినట్టిగాని కట్టడాలు, భూములు, ఇళ్లు (నౌకా, సైనిక, వైమానికసంబంధమైన కట్టడాలకు యిది వర్తించదు); కాని ఒకరాష్ట్రంలో సదరు ఆస్తి ఉన్నట్లయితే సమాఖ్యశాసనం ఇంకోవిధంగా చెపితేతప్ప సదరు రాష్ట్రశాసనానికే అది లోబడి ఉంటుంది; అట్టి ఆస్తికాలు, ఒడంబడికప్రకారం పుచ్చుకోబడిసంస్థానంలో ఉన్నట్టయితే సద

రుపరతుల ప్రకారం పరిపాలించబడుతుంది. (11) ఇంపీరియల్ గ్రంథాలయం, భారత ప్రదర్శనాలయం, సామ్రాజ్యయుద్ధవస్తు ప్రదర్శనాలయం, విక్టోరియా స్మారకమందిరం, మొదలైన సమాఖ్యధనంవల్ల పోషింపబడేవి; (12) పరిశోధన, పాండిత్య, సాంకేతికశిక్షణ, ప్రత్యేకశాస్త్రాల అభివృద్ధి, వీటికి సంబంధించిన సమాఖ్యవారి సంస్థలు; (13) కాశీవిశ్వవిద్యాలయం, అలీఘరుముస్లిం విశ్వవిద్యాలయం; (14) భారతదేశపుసర్వే; భూగర్భ, వృక్ష, జంతు, సంబధమైన శోధనలు; వాతావరణపరీక్షకు సంబంధించిన సమాఖ్యవారి సంస్థలు; (15) ప్రాచీన చారిత్రకవస్తువులు; ప్రాచీనకాలపు ప్రాముఖ్యస్థలాలు, వాటి గుర్తులు; (16) జనాభా; (17) హిందూదేశంలో 'డొమిసైలు' కానట్టియు, సంస్థాన, బ్రిటిషుదేశముల పౌరులు కానట్టియు వారిని దేశంలోకి రానిచ్చుట, నిర్గమనము, తరిమివేయుట, అట్టివారి జాడలను గూర్చి యేర్పాట్లుచేయుట సహా; హిందూదేశమునకు వెలుపల యాత్రాస్థలములు; (18) ఓడరేవుల 'క్వారంటైను'లు, నావిక, క్వారంటైనుల వైద్యాలయములు; (19) దేశంలో సమాఖ్యప్రభుత్వంవారు నిర్వచించిన ప్రకారం 'కస్టమ్సు' సరిహద్దులద్వారా ఎగుమతి దిగుమతులు; (20) సమాఖ్యరైల్వేలు; భద్రత, రేట్లు, కిరాయీల హెచ్చుతగ్గు పరిమితులనిర్ణయం, స్టేషను, సర్వీసు టెర్మినలుఛార్జీలు, రవాణా మార్పుదల, జనులు సరుకులు రవణాచేసే హోదాలో రైల్వేవారిబాధ్యత, ఈవిషయములుగూర్చి (మైనరురైల్వేలుతప్ప) తదితరరైల్వేలు అన్నిటివిషయంలోను క్రమమైనయేర్పాటు చేయుట, మైనరురైల్వేల విషయంలో వాటి భాటసారులు, సరుకులుయొక్క భద్రత పరిపాలనాబాధ్యతను గురించి క్రమమైనయేర్పాట్లు చేయుట; (21) కోస్తాఓడలు, సముద్రఓడలు, నావికులపై అధికారము; (Admirality Jurisdiction) (22) పెద్దఓడరేవులు (Major Ports) అట్టివి నిర్ణయించుట, నిర్మించుట, ఉద్యోగస్థుల ఏర్పాటుచేసి వారిఅధికారాలు నిర్వచించుట; (23) సముద్రమధ్యమందలి చేపల వ్యాపారం; (24) వైమానికవిద్య, విమానాలరహదారీ, విమానాలు దిగేస్థలాలను ఏర్పాటుచేయుట, వాటిని క్రమపద్ధతిని నడిపించుట; (25) దీపస్తంభాలు, దీపపుఓడలు, నావికుల వీలుకొరకేర్పరచబడిన సంకేతస్థలాలు

(Beacons) విమాన, ఓడల భద్రతకొరకు చేయబడిన తదితరయేర్పాట్లు; (26) సముద్రము, గాలిద్వారా మనుష్యులు, సరుకులరవాణా; (27) కాపీ రైటు, క్రొత్తవికనిపెట్టడం, నమూనాలు, వర్తకపుగుర్తులు, సరుకులమీద గుర్తులు; (28) చెక్కులు, మారకపుబిల్లులు, ప్రోనోట్లు, ఇల్లాంటి తదితరదస్తావేజులు; (29) అయుధములు, మందుగుండు, మందుగుండుతోకూడిన ఆయుధములు; (30) ఉపద్రవకరద్రవ్యాలు; (31) నల్లమందు, దానిపంట, పరిశ్రమ, యెగుమతి; (32) సమాఖ్యశాసనప్రకారం మండి ప్రమాదముకలుగజేస్తాయనే పెట్రోలు, తదితరచమురుల్లు, అనగా వాటినికలిగియుండుట, నిలవ, రవాణా; (33) వర్తకసంస్థలు, (Corporations) వాటినిర్మాణము, క్రమపరుచుట, రద్దుచేయుట (బ్యాంకింగు, ఇన్సూన్యరెన్సు, ఆర్థికసంస్థలసహా), ఇది సంస్థానముల వారికిచెందినట్టిగాని, సంస్థానము వద్దిలోనుంచి సంస్థానములోనే వ్యాపారముచేయచున్నట్టి సంస్థకు వర్తించదు. ఇల్లాగేకొన్ని పరిస్థితుల్లో సహకారసంస్థలకు కూడా వర్తించదు. (34) ప్రజాక్షేమదృష్టిలో సమాఖ్యశాసనం వల్లనే పనిజరగాలని తలపబడే పరిశ్రమల అభివృద్ధి; (35) నూనె, బొగ్గుగనులలోని కార్మికుల రక్షణ, నియమాలు; (36) ప్రజాక్షేమదృష్టిలో సమాఖ్యశాసనంవల్లనే క్రమపరచాలని అన్నంతవరకు బొగ్గుగనులు, నూనెగనుల అభివృద్ధి; (37) ఇన్సూన్యరెన్సులా (సంస్థానానికి వర్తించదు), ఇన్సూన్యరెన్సువ్యాపారాన్ని క్రమపరచుట, గవర్నమెంటు ఇన్సూన్యరెన్సు, ఈవిషయం సంస్థానం నిర్వహించుటకు పూనుకొన్నంతవరకు రాష్ట్రవిషయాల జాబితాలోగాని, కంకరెంటు జాబితాలోగాని జేరినంతవరకు వారివారి వద్దిలోనుండును. (38) బ్యాంకింగు, సంస్థానములలోని బ్యాంకింగుల కిదివర్తించదు. (39) ఒకభాగమునకుచెందిన పోలీసుదళములోనివారి అధికారాలు, ఆవరణ హెచ్చించుట; కాని యిట్టిహెచ్చింపు యేర్పాటునకు సంబంధిస్తుందో ఆగవన్నరు లేక ఛీఫ్‌కమిషనరుయొక్క అంగీకారము లేకుండా జరుగకూడదు. ఇల్లాగే ఒక 'యూనిట్' లోని రైల్వేపోలీసు ఉద్యోగుల అధికారము ఆవరణ "ఆ యూనిట్"కు పైబడి హెచ్చించవచ్చును. (40) కౌన్సిలుఆగస్ట్లు, యీచట్టమునకులోబడి సమాఖ్యశాసనవర్గపు యెన్నికలు; (41) సమాఖ్యమంత్రులు, అధ్య

క్షుడు, ఉపాధ్యక్షుడు (ఉభయసభలకు), శాసనసభ్యులు,—వీరియొక్క జీతాలు, భత్యాలు, తదితరహోదాలు; ఈచట్టముయొక్క రెండవభాగంప్రకారం అధికారమున్నంతవరకు శాసనసభవారి సంఘాలయెదుట రికార్డు దాఖలుచేయుటకు సాక్ష్యమిచ్చుటకు నిరాకరించినవారిని శిక్షించుట; (42) ఈజాబితాలోని అంశాలపైనిచేసే శాసనాలక్రింద జరిగే నేరాలు; (43) ఈజాబితాలోని అంశాలను గురించి విచారణ, లెక్కలను తేల్చుట; (44) కష్టమ్సు డ్యూటీలు, యెగుమతిపన్నులసహా; (45) మనుష్యులు తాగేకల్లుసారాయిలు, నల్లమందు, గంజాయి మొదలైన మత్తుగల, మత్తులేని పదార్థాలు; ఔషధ, అలంకార వస్తువులు (వీటిల్లో పైనల్లమందువగైరా ద్రవ్యాలు చేరిఉంటే); ఈపైనతెలిపినవి తప్ప హిందూదేశంలో తయారైనగాని నైరుచేయబడినట్టిగాని పొగాకు మొదలైన వస్తువులపైన యెక్సైజుపన్నులు; (46) వర్తకవ్యాపారసంస్థలపైన పన్ను; (47) ఉప్పు, (48) లాటరీలు, (49) జాతీయతనిప్పించుట, (50) గవర్నరు, ఛీఫ్‌కమీషనరు రాష్ట్రముల్లోనుంచి పైకిగాని లోపలికిగాని ప్రయాణం; (51) తూనికగుండ్లు; (52) "రాంచి" లోని ఐరోపియనుల పిచ్చి ఆసుపత్రి; (53) ఫెడరలున్యాయస్థానం తప్ప తదితరకోర్టులకు యీజాబితాలోని అంశాలపై ఆవరణ, అధికారాలు; ఈచట్టముయొక్క తొమ్మిదవభాగంలో చెప్పినంతవరకు సమాఖ్యన్యాయస్థానంవారి యొక్క అప్పీలు అధికారాన్ని వృద్ధిచేయుట, సప్లిమెంటరీ అధికారాన్ని కలుగజేయుట; (54) వ్యవసాయపు ఆదాయంపైనతప్ప తదితర ఆదాయముపైన పన్ను; (55) వ్యక్తులు, కంపెనీలయొక్క ఆదాయాలనుబట్టి కిమ్మతుకట్టబడిన పెట్టుబడిపైన పన్నులు (ఇందులో వ్యవసాయపుభూమిచేరదు); కంపెనీల పెట్టుబడిమీద పన్ను, (56) ఆస్తికి వారసుఅయినందుకుపన్ను (వ్యవసాయపుభూమికిది చెందదు); (75) రశీదులు, ప్రాక్సీలు, ఇన్సూర్యెన్సు పోలసీలు, క్రెడిటు ఉత్తరాలు, లేడింగుబిల్లులు, ప్రామిసరీనోట్లు, చెక్కులు, మారకపుబిల్లులు, వీటిమీద స్టాంపుడ్యూటీలు; (58) రైళ్లు, విమానం, పైన మనుష్యులు సరుకులకు దిగేచోటపన్ను; రైళ్లకు కిరాయి, ఛార్జీలు; (59) ఈజాబితాలో తెలిపిన అంశాలపట్ల చెల్లింపవలసినఫీజు, ఇందులో కోర్టులు వసూలుచేసే ఫీజులుచేరవు.

## ౨

## రాష్ట్రీశాసనసభవారి వర్గీలోనిఅంశాలు.

## (Provincial legislative list).

(1) పబ్లికు ఆర్డరు (రాజుగారినౌకా, సేనా, వాయువశాలను సివిలు అధికారులసహాయంకొరకు ఉపయోగించడం యిందులోచేరదు); న్యాయ పరిపాలనం, సమాఖ్యన్యాయస్థానంతప్ప తదితరన్యాయస్థానాలకు నిబంధనల నేర్పరచుట, వాటిని నిర్మించుట; పబ్లికుఆర్డరును కాపాడుటకు సంబంధించిన కారణములవల్ల వ్యక్తులను నిర్బంధించుట; (2) సమాఖ్యన్యాయస్థానం తప్ప యీజాబితాలోని అంశాలనుగూర్చి తదితరన్యాయస్థానాలన్నిటియొక్క ఆవరణ, అధికారాలు, రెంటు, రివిన్యూకోర్టుల నడవడికలు; (3) గ్రామ, రైల్వేలలోని వారిసహా పోలీసుశాఖ; (4) జైళ్లు, రిఫర్మేటరీలు, బోర్ష్టలుస్కూళ్లు, అందులోని ఖైదీలు; జైళ్లు, తదితరసంస్థల ఉపయోగంనిమిత్తం చేసుకొనే యేర్పాట్లు; (5) రాష్ట్రీఋణం, (6) రాష్ట్రీపబ్లికుసర్వీసు, దానికమీషనులు; (7) రాష్ట్రీదాయాల్లోనుంచి యివ్వవలసిన పెన్షనులు; (8) రాష్ట్రీవసరాల నిమిత్తం రాజుగారికిచెందించబడినట్టిగాని లేక స్వాధీనంలో ఉన్నట్టిగాని కట్టడాలు, (Works) భూములు యిళ్లు (Buildings); (9) భూసంపాదన; (10) రాష్ట్రీదాయాలనుండి పోషించబడే గ్రంథాలయాలు, ప్రదర్శనశాలలు మొదలైనవి; (11) రాష్ట్రీశాసనవర్గానికి యెన్నికలు (చట్టం, కౌన్సిలు ఆర్డర్లకు లోబడి); (12) రాష్ట్రీమంత్రులు, శాసనసభ లేక సభలఅధ్యక్ష ఉపాధ్యక్షులు, సభ్యులు వీరియొక్క జీతాలు, భత్యాలు తదితరహోదాలు; చట్టం 3వ భాగంలో తెలుపబడినంతవరకు రాష్ట్రీశాసనసభలసంఘాలయెదుట సాక్ష్యమిచ్చుటకు గాని, రికార్డుదాఖలుచేయుటకుగాని నిరాకరించేవారిని శిక్షించుట; (13) స్థానిక పరిపాలన, అనగా మునిసిపల్ సంస్థలు, ఇంప్రూవుమెంటుట్రస్టులు, జిల్లా బోర్డులు, మైనింగుసెటిలుమెంటు అథారిటీలు, మొదలైనస్థానికగ్రామపరిపాలనాసంస్థలనిర్మాణము, అధికారాలు; (14) ప్రజారోగ్యము, పారిశుద్ధ్యము,

ఆసుపత్రులు, వైద్యాలయాలు; జననమరణాలరిజిస్ట్రేషను; (15) దేశంలోపలి యాత్రాస్థలాలు; (16) రుద్రభూములు; (17) విద్య (18) రోడ్లు, వంతెనలు రేవుదాటులు, మొదలైన ఒకటవజాబితాలో తెలియపరచని రహదారీలు. నెం 1 రు జాబితాకులోబడిన మైనరురైళ్ళేలు, మునిసిపలుట్రాముదారులు, Rope wayల రహదారీ కాలవలు, వాటిద్వారా రవాణా, ఇట్టి నీటిరహదార్లద్వారా జరిగేరవాణా 3వ నెంబరు జాబితాలోని అంశాలకులోబడి ఉండును. ఓడరేవులు; పెద్దఓడరేవులకు సంబంధించినంతవరకు ఒకటో నెంబరు జాబితాకులోబడి అన్వయించుకోవలెను. యంత్రసహాయంతో నడపబడని పడవలువగైరా; (19) నీటిసప్లయి, పారుదల, కాల్వలు, మురుగు, కాలువగట్లు, రిజర్వాయిర్లు, నీటిసహాయముతో యంత్రములు నడిపించుట; (20) పరిశోధన, విద్య, సహోవ్యవసాయం; పంటతెగుళ్లు, పురుగులనుండిరక్షణ; పశువృద్ధి, రోగనివారణ, పశుచికిత్సలో శిక్షణ, బందెలదొడ్లు; (21) భూమిలోను, పైనహక్కులు; భూసంబంధాలు (Land tenures) వ్యవసాయకునికి భూస్వామికి వుండే సంబంధాలుసహా, శిస్తువసూళ్లు, భూమిని అన్యులకిచ్చుట (Transfer) క్రియపరచుట, ఇతరులకు చెందింపజేయుట; భూమిని అభివృద్ధిపరచుట, వ్యవసాయికవుపెట్టుబళ్లు, భూవసతులుగలచోట్లకు ప్రజలను వలసపోవుటకై ప్రోత్సహించుట,(Colonization) కోర్టుఆఫ్ వార్డ్సు;ఋణభారాలతోవున్న జమీందారీలు; నిధినిక్షేపాలు; (22) అడవులు (23) గనులు, నూనెగనులు, గనులఅభివృద్ధిని క్రమపరచుట; ఈఅంశము ఒకటోనెంబరుజాబితాకులోబడి రాష్ట్రానికి అధికారం. (24) చేపలు; (25) అడవిపక్షులు,మృగాలరక్షణ; (26) గ్యాసు, వాటితోతయారయ్యేవి; (27) రాష్ట్రములలోని వర్తకవ్యాపారాలు, మార్కెట్లు, సంతలు, ఋణములనిచ్చుట, ఋణదాతలు;(28) Inns and Inn keepers; (29) ఒకటో నెంబరు జాబితాకు లోబడి, సరకులను తయారుచేయుట, వ్యాప్తిచేయుట, పరిశ్రమాభివృద్ధి; (30) భోజన దినుసులు, తదితరసరుకుల యొక్కయు కల్తీ; కొలతలు, తూనికలు; (31) నల్లమందువిషయంలో ఒకటో నెంబరు జాబితాకులోబడినన్ని, విషములు,

ప్రమాదకరమైన ఓషధులువిషయంలో 3 వ నెంబరు జాబితాకులోబడిన్నీ, మత్తుకలిగించే ద్రవములు, పదార్థములు వాటిపంట, పరిశ్రమ, స్వాధీనము. రవాణా, అమ్మకట, కొనుట; (32) బీదలకుపరిహారము, నిరుద్యోగము, (33) నెం 1 రు జాబితాలో తెలిపిన కార్పొరేషనులుగాక తతిమ్మావాటినిర్మాణం క్రమపరచుట, రద్దుపరచుట, కార్పొరేషను రూపకంగాలేని వర్తక, విద్యా, శాస్త్ర, మత, మొదలైన సొసైటీలు, సమాజాలు, కోఆపరేటివుసంఘాలు; (34) దానాలు, వాటికిసంబంధించిన సంస్థలు; దాన, మతసంస్థలు; (35) నాటకాలు, నాటకశాలలు, నాటకాలుఆడుట, సినీమాలు (ప్రదర్శించే సినిమాఫిలిములగూర్చిన ఉత్తరువులిం దుండవు); (36) పందెములు, జూదములు; (37) ఈజాబితాలో తెలిపిన అంశాలక్రింద నేరాలు; (38) ఈజాబితాలోని అంశాల్లో దేనినిగూర్చిఅయినా విచారణ, లెక్కలను తయారుచేయుట; (39) భూమిపన్ను, పన్నువిధింపు, వసూలు, ల్యాండురికార్డులనుంచుట; భూమిపన్నును అన్యాక్రాంతముచేయుట, రెవిన్యూనిమిత్తమున్ను, హక్కులరికార్డునిమిత్తమున్ను సర్వేచేయుటసహా; (40) ఒకరాష్ట్రములో తయారుచేయబడిన లేక పండించబడిన యీక్రిందసరకులమీద ఎక్సైజుడ్యూటీ విధించుట, హిందూ దేశములో యితరచోట్ల తయారైన యిట్టిసరకుమీద పోటీపన్నును వేయుట; మనుష్యులు త్రాగేకల్లు సారాయిలు, నల్లమందు, గంజాయి మొదలైనమత్తుద్రవ్యాలు; పైనచెప్పబడిన మత్తుద్రవ్యాలుగల మందులేక అలంకారార్థమైన ద్రవ్యాలు; (41) వ్యవసాయిక ఆదాయంపైనపన్ను; (42) భూములు, యిండ్లు Hearths & Windows;! (43) వ్యవసాయకభూమిపైన వారసత్వము వచ్చినందుకు పన్ను; (44) గనులహక్కుపైన పన్ను, సమాఖ్యవారి శాసనానికి లోబడి; (45) తలపన్ను (Capitation tax); (46) వృత్తి, వ్యాపారము, జీవనము, ఉద్యోగములపై పన్ను; (47) మృగములు, పడవలమీద పన్ను; (48) సరకుల అమ్మకం; ప్రచురణమీదపన్ను; (49) సరుకులు ఒకస్థలములోనికి అనుభవమునకు గాని అమ్మకమునకు గాని వచ్చినందుకు సెస్సు; (50) భోగాలమీదిపన్ను ప్రదర్శనములు, వినోదములు, పందెములు, జూదములసహా; (51) నె 1 రు జాబితాలో స్టాంపుడ్యూటీనిగురించి చెప్పబడినవి గాక తతిమ్మాదస్తావేజులపైన స్టాంపుడ్యూటీని నిర్ణయించేరేట్లు; (52) దేశం

లోపల నీటిరహదారిని సరుకులు, మనుష్యులను తీసికొనివెళ్ళినందుకు చెల్లవలసిన రుసుములు; (53) టోలుగేట్లు; (54) ఈజాబితాలో తెలిపిన యేఅంశములోనైనా చెల్లించవలసినఫీజులు, కాని కోర్టులు యిందునిమిత్తం వసూలుచేసే ఫీజులు యిందులోచేరవు.

---

## 3

### 1 వ భాగం. కంకరెంటు జాబితా.

(1) ఒకటిరెండునెంబర్లజాబితాలలో తెలుపబడిన అంశాలకు సంబంధించిన నేరాలుమినహాగా పీనలుకోడ్డులో యీచట్టం తయారయేనాటికివున్న అన్ని అంశాలతోకూడిన క్రిమినలు 'లా' ఇది సివిలుఅధికార్ల సహాయంనిమిత్తం రాజుగారి నావిక, సైనిక, వాయుదళాలు ఉపయోగించుటకు వర్తించదు. (2) ఈ చట్టమునాటికి క్రిమినలుప్రొసీజరుకోడ్డులోగల అన్ని అంశాలతోకూడిన క్రిమినలు ప్రోసీజరు. (3) ఖైదీలను, ముద్దాయిలను ఒకచోటినుంచి మరియొకచోటికి మార్చడం. (4) ఈచట్టంనాటికి సివిలుప్రొసీజరుకోడ్డులోని అన్ని అంశాలతోకూడుకున్నట్టి లిమిటేషనులా (కాలదోషం) సహా సివిలు ప్రొసీజరు. ఒకరాష్ట్రానికి బైటయేర్పడినపన్ను, బాకీ, బాకీవిధంగా రాబట్టుకోదగినది లేక తదితర పబ్లికుడిమాండు—వీటిని గవర్నరు లేక చీఫ్ కమీషనరు యొక్క రాష్ట్రములోపల రాబట్టుకొనుట. (5) సాక్ష్యము, ప్రమాణాలు, చట్టాలను గమనించుట, పబ్లికుచర్యలు, రికార్డులు, న్యాయవిచారణంలో చర్యలు (6) వివాహం, విడాకులు, చంటిపిల్లలు, మైనర్లు, దత్తత. (7) విల్లు వ్రాయుట, విల్లులేకుండా మనిషిచనిపోయినప్పుడు యేర్పడేపరిస్థితులు, వారసత్వం (వ్యవసాయికభూమిదికాక) (8) వ్యవసాయభూమికాని తదితరాస్తిని ట్రాన్సుఫరుచేయుట, పట్టాలు దస్తావేజులయొక్క రిజిస్ట్రేషను, (9) ధర్మకర్తృత్వము, ధర్మకర్తలు. (10) ఒడంబడికలు (contracts) భాగస్వామిత్వము, ఏజంటుగిరీ, కంట్రాక్ట్సు ఆఫ్ కారియేజి, తదితరరకముల ప్రత్యేకఒడంబడికలు కానివ్యవసాయపు భూమికి సంబంధించిన ఒడంబడికలకు యిదివర్తించదు. (11) పంచాయితీ (12) బాంక్‌రప్ట్సీ, ఇనుసాల్వెన్సీ; అఫిషియల్ ట్రస్టీలు,

అడ్మినిస్ట్రేటర్సు జనరలు; (13) జ్యుడిషియల్ స్టాంపులద్వారా వసూలు చేయబడిన రుసుములుగాని, డ్యూటీలుగాని, కాని స్టాంపుడ్యూటీలు; స్టాంపు డ్యూటీల రేటుకు యిదివర్తించదు. (14) చర్యతీసుకోదగిన నేరాలు. నెం 1,2 రు జాబితాలలో తెలుపబడిన విషయాలకు మినహాగా. (15) ఈజాబితాలో తెలుపబడిన విషయాల్లో ఫెడరలున్యాయస్థానానికిగల ఆవరణతప్ప యితర కోర్టులయొక్క ఆవరణ (Jurisdiction) అధికారాలు; (16) న్యాయవాదులు, వైద్యులు, తదితరవృత్తులు; (17) వార్తాపత్రికలు, పుస్తకాలు, అచ్చాఫీసులు; (18) పిచ్చి, ఉన్మాదము; దీనికి సంబంధించిన ఆసుపత్రులు సహా; (19) విషాలు, ప్రమాదకరమైన ఔషధాలు; (20) యంత్రసహాయంతో నడపబడే ప్రయాణసాధనాలు: (21) బాయిలర్లు, (22) జంతువులపట్ల క్రౌర్యనివారణ(23) ఐరోపియన్ సంచారకులు, నేరస్వభావంగలజాతులు, (24) ఈజాబితాలోనివిషయాన్ని గురించైనావిచారణలు, లెక్కలుతయారుచేయుట.(25) ఈ జాబితాలో తెలుపబడిన విషయాలనుగురించి రుసుములు (కోర్టులు వసూలు చేసేవి ఇందులోచేరవు.)

2 వ భాగము (నె 126 కు జవాదారీగా)

(26) ఫ్యాక్టరీలు (27) కార్మికులక్షేమం, స్థితిగతులు, ప్రావిడెంటు ఫండు, కార్మికులకు కంపెన్సేషనుయిచ్చుటకు యజమానులకుగల బాధ్యత, అరోగ్యపు ఇన్సూర్యెన్సు (శారీరకముగా అసమర్థులైనందుకు పెన్షనుసహా,) ముసలితనంపెన్షను, (28) నిరుద్యోగపుభీమా (29) ట్రేడుయూనియనులు; పారిశ్రామిక, కార్మికతగాదాలు (30) మనుష్యులు, మృగాలు, చెట్లు-వీటితెగుళ్లను ఒకచోటనుండిమరియొకచోటికివ్యాపించకుండాచేయడం (31)విద్యుత్తు (Electricity) (32) ఓడలు, ఓడలరహదారీ (యంత్రంతోనడిపే కాలవలలోని సాధనాలకే ఇది వర్తిస్తుంది;) సరుకులను మనుష్యులను సదగు రహదారీలలోతీసికొని వెళ్లుట; (33) ప్రదర్శనార్థమైన సినీమాఫిలిముల మంజూరు; (34) సమాఖ్య అధికారంక్రింద నిర్బంధించబడవలసిన వ్యక్తులు (35) ఈజాబితాలోని ఏవిషయాన్నిగురించి అయినా విచారణలు, లెక్కలు తయారు చేయుట; (36) ఈజాబితాలో తెలుపబడిన విషయములను గురించి రుసుములు (కోర్టులు వసూలుచేసేవి ఇందులోచేరవు.)



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA112B165 |
| పుస్తకం పేరు | నేటి భారత రాజ్యాంగము |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 249 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | 229,76 |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | Aswini |
| పరీక్ష చేసినది | PRAGATHI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |